# చెమటకాయల బాధనుండి ఉపశమనానికి టాల్కం పౌడర్ కాదు నైసిల్ కావాలి!

## నైసిల్ వాడండి

**చెమటకాయల బాధనుండి శీఘ్ర ఉపశమనం పొందండి.**






నైసిల్ చెమటకాయల బాధనుండి ప్రతిదశలోనూ ఉపశమనాన్నిచ్చేందుకై ప్రత్యేకించి రూపొందించబడిన ఔషధయుక్త పౌడర్. ఇది దురదను, మంటను, చిరచిరను వెంటనే ఉపశమింపజేస్తుంది. టాల్కం పౌడర్లవలెకాక ఇది క్రిమిచర్యను అరికట్టి బాధ ప్రబలకుండ చేస్తుంది.

నైసిల్– చెమటకాయల బాధనుండి ఉపశమనానికి నమ్మకమైన, నిరపాయకరమైన మార్గం.

1. అతిగా వచ్చే చెమటను ఆపుతుంది. 2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధకారక క్రిములను ధ్వంసం చేస్తుంది. 4. శరీరానికి హాయినిస్తుంది.

మంచి ఆరోగ్యానికి మూలస్థానం

**గ్లాక్సో**

HTB-GLL 8606

సమృద్ధ పరిమళము
సరియైన ధరతో

ప్రేమ్ - తాజాతనము నందించు సబ్బు




"గులాబి మరియు ఆకుపచ్చ రంగులలో లభించును"



జయలక్ష్మి
గుంటూరు వారి
తయారీ

Imageads-2106 Tel

# ప్రభుత్వం – పత్రికలు

ప్రభుత్వానికి తగినటువంటి పత్రికలు వస్తే పత్రికలకి కూడా వాటికి తగినటువంటి ప్రభుత్వమే ఉంటుంది. రాజీవ్ గాంధి పత్రికల విషయంలో అసంతృప్తిని వెలిబుచ్చితే వాటికి కూడా తమ ప్రధాన మంత్రిపై అంతకన్నా ఎక్కువ అసంతృప్తి ఉంటుంది. అది రెండు వైపులా పని చేస్తుంది. రాజీవ్‌గాంధీ కానీ, మరొకరు కానీ కేకలు వేసినందువల్ల ఆయనకి కానీ, పత్రికలకి కానీ దానివల్ల ప్రయోజనం ఉండదు.

బాధ్యతతో వ్యవహరించేవని చెప్పబడే పత్రికల పట్ల రాజీవ్‌గాంధీ సంతృప్తిని వ్యక్తం చేస్తే అలాంటి మన పత్రికల విషయంలో నాకు పెద్ద అనుమానమే వస్తుంది. కమ్యూనిస్టు లేదా ఫాసిస్టు దేశాలలో మాత్రమే ప్రభుత్వం పత్రికల పట్ల తన సంతృప్తిని వ్యక్తం చేస్తుంది. మిగతా అన్ని దేశాలలో పత్రికలు ప్రభుత్వానికి పక్కలో బల్లెంలాగే ఉంటాయి. నిజానికి అవి అలాగే ఉండాలి కూడా.

వార్తా పత్రికలు ప్రజల మనోభావాలకి దర్పణంగా ఉండాలన్న వాస్తవాన్ని ఎంతో మంది రాజకీయ నాయకులు గ్రహించరు. వాటి సంపాదకులకు వారి వారి స్వంత అభిప్రాయాలు ఉంటే ఉండవచ్చు. అవి సంపాదకీయం పేజీలలో తప్పనిసరిగా ప్రచురిత మవుతూనే ఉంటాయి. వాటి పరిధి అంతవరకే. వార్తాపత్రిక అన్నది నిస్సందేహంగా ప్రజాభిప్రాయానికి వేదికగా ఉండాలి. అలా లేనప్పుడు దాని ఉనికే ఉండదు.

అత్యవసర పరిస్థితి తర్వాత గత కొద్ది సంవత్సరాలలో వార్తాపత్రికలు పుంఖాను పుంఖాలుగా ఆవిర్భవించాయి. వాటిలో చాలా భాగం నిలవలేక పోయాయి. నిందారోపణలకి పేరు పొందిన ఒక ప్రచురణ సంస్థ కొద్ది సంవత్సరాల క్రితం బొంబాయిలో ఒక టాబ్లాయిడ్ దినపత్రికని వెలువరించింది. ఆ పత్రికని ఎవరూ కనీసం తాకనైనా లేదు. దానిని ఒక రాజకీయ పక్షానికి విపరీతమైన లాభానికి అమ్మి వేసారు. ఇప్పుడు ఉన్నదానికన్నా మరింత దారుణంగా ఆ రాజకీయ పక్షం ఆ పత్రికని నిర్వహిస్తుందనే అనుకోవాల్సి ఉంటుంది. సరైన చరిత్ర లేనటువంటి కొందరు ఢిల్లీలో ఒక దిన పత్రికని పెట్టారు. వాళ్ళ ప్రవర్తన సరైనది కాకపోయినా పైకి పెద్ద దేశ భక్తుల లాగా వేషం వేసుకుని దేశభక్తినంతా తమ భుజస్కంధాల మీదే మోస్తున్నట్లు కనిపిస్తారు. ఆ రెండు వార్తాపత్రికలూ రాజీవ్ గాంధీని పొగుడుతూ ఉంటాయి– శ్రీమతి గాంధీ జీవించి ఉన్నప్పుడు కూడా అవి అలాగే పొగుడుతూ ఉండేవి– అందువల్లనే అవి విజయవంతం కాలేక పోయాయి. భారతీయ పాఠకుడికి ఎవరెలాంటి వారో బాగా తెలుసు చివరికి ఆ వ్యక్తులు ప్రధాన మంత్రులైనా సరే.

రాజీవ్ గాంధీ సంగతి భారతీయ పాఠకుడు తెలుసు కున్నాడు. ఆయన ఏమిటన్నది తెలుసుకోటానికి అతనికి రెండేళ్ళు పట్టటమే ఆశ్చర్యం. వార్తాపత్రికలని నిందించటం వల్ల ప్రయోజనం లేదు. జరుగుతున్న వాటినే అవి ప్రతిబింబిస్తాయి. అవి అలా చెయ్యకపోతే మిగతా కొన్ని పత్రికలలాగే కాలగర్భంలో కలిసి పోతాయి. ప్రపంచం అంతటా ఇదే జరుగుతున్నది. పాతవి అంతరించి పోతూఉంటే కొత్తవి వాట స్థానాన్ని ఆక్రమిస్తున్నాయి. ఎన్నో ఏళ్ళుగా వార్తాపత్రికలు ఈగల్లా చస్తున్న లండన్‌లో కూడా ఒక్కొక్కటే రు. 50 కోట్లకి పైగా విలువ చేసే రెండు పత్రికలు కొత్తగా వెలువడ్డాయి. వచ్చే ఏడాది ప్రారంభంలో భారత దేశంలో కూడా బొంబాయి, ఢిల్లీలలో కొత్త వార్తాపత్రికలు రాబోతున్నాయి. అందువల్ల ఇప్పుడు ఉన్నవాటిలో పోటీకి నిలవలేనివి అంతరించి పోతాయి.

సాధారణ పాఠకుడు ఆధార పడవలసినది ప్రైవేటు యాజమాన్యం అనబడేదానిలో ఉన్నటువంటి వార్తా పత్రికలపైనే. ఎందుకంటే ప్రభుత్వం అధీనంలో ఉన్నటువంటి ప్రచార సాధనాలన్నీ పూర్తిగా నమ్మదగినవి కావు కాబట్టి. ఇప్పుడు మనం ఎప్పటికప్పుడు తాజా విషయాలని, నమ్మదగినటువంటి వార్తలని తెలుసుకోవలసినటువంటి కాలంలో జీవిస్తున్నాము. అవి తెలుసుకుంటే తప్ప మన మనుగడ సజావుగా సాగదు.

రాజకీయ, ఆర్థిక పరిస్థితులు చాలా వేగంగా, త్వరత్వరగా మారి పోతున్నాయి. అందువల్ల ఎవరు ఏమిటో, ఎవరు సరైనవారో ఎవరు కాదో తెలుసుకోక పోతే కష్టాలపాలు అయ్యే పరిస్థితులు ప్రస్తుతం మనకి ఉన్నాయి. మనం రాజీవ్ గాంధీ దూరదర్శన్ చూస్తే దేశంలో ఇద్దరే ముఖ్యంగా మనకి కనిపిస్తారు. అందులో ఒకరు రాజీవ్ గాంధీ, రెండవవారు విఠల్ గాడ్గిల్ (ఈ వ్యాసం ముద్రణకి వెళ్ళే సమయానికి గాడ్గిల్ కేంద్ర మంత్రి వర్గం నుంచి తొలగింప బడ్డారు.) దూరదర్శన్ వాళ్ళ స్వంతం అయినట్లు ఎప్పుడూ వాళ్ళే టి. వి. లో కనిపిస్తూ ఉంటారు, ముఖ్యంగా వార్తా ప్రసారాలలో. గాడ్గిల్ పని ప్రభుత్వం ఏమి చేస్తున్నదో మనకి చెప్పటం తప్ప ఆయన ఏమి చేస్తున్నారన్నది కాదు. ఈ ఇద్దరు ప్రముఖులూ ప్రతి సాయంత్రం తెరపై మనకి దర్శనం ఇస్తుంటారు. అందులో ఒకరు అధికారికమైన సమావేశాలలో ప్రసంగిస్తూ ఉంటారు. ఆ సమావేశాలు ఎప్పుడూ అదే అధికారులు, మంత్రులు పాల్గొంటున్నట్లుగా ఉంటాయి. ఇక రెండో వారు చూసేవారికి, అంటే మీకూ, నాకూ ఎంత మాత్రం ఆసక్తి లేనటువంటి ఏదో ఒక ఉత్సవాన్నో, కార్యక్రమాన్నో నిర్వహిస్తూ ఉంటారు. మీరు ఏ వార్తాపత్రికా చదవకుండా కేవలం టి. వి. మాత్రమే చూస్తూ ఈ పెద్ద మనుషులు చెప్పేవి వింటుంటే ఈ దేశంలో అంతా సవ్యంగానే ఉన్నట్లు అనిపిస్తుంది. మనకి ప్రతినిత్యం ఎదురయ్యే ఇబ్బందులు, సమస్యలన్నీ కేవలం భ్రమలుగా, దేశం అంతా మూడు పువ్వులూ ఆరు కాయలుగా ఉన్నట్లు కనిపిస్తుంది. అంతే కాక ప్రపంచంలో ఎక్కడ ఎప్పుడే కష్టం కలిగినా దానిని సరిదిద్దగల వ్యక్తి మన యువ ప్రధానమంత్రే నన్న భావం కూడా కలుగుతుంది.

ఇవి నిజంకాదని బహుశ మీకు తెలుసు. ప్రపంచం భారతదేశాన్ని లేదా దాని ప్రధాన మంత్రిని అసలు పట్టించుకోదు. తటస్థ రాజ్యాల సమావేశం అన్నది ఒక బూటకం అని, అక్కడ చేరిన వారంతా ఒక కంట తమ ప్రయోజనాల కోసం వాషింగటన్ లేదా మాస్కో వైపు చూసే వారేనని, మూడు పువ్వులు ఆరు కాయలన్నంతగా దేశం ఏమీ లేదని, రాజీవ్ గాంధీ నమ్మిన బంటు జె. బి. పట్నాయక్ గారి ఒరిస్సా లోని గ్రామాలలో ప్రజలు చస్తున్నారని, దేశంలోనే కాక ప్రపంచం అంతటా రూపాయికి విలువ లేకుండా పోయిందని, ఇప్పుడు దాని విలువ పది పైసలకి మించి లేదని, రాజకీయ వాదులు, సినీతారలు, వాణిజ్య వేత్తలు తాము దోచిన దానిని బయటికి తీసుకు వెళ్ళి డాలర్లు, పౌన్లు, స్విస్ ఫ్రాంకులుగా మార్చుకోటంలో తీరిక లేకుండా ఉన్నారని మీకు తెలియక పోతే గోతిలో పడ్డట్టే. వాళ్ళలో కొందరు రాజీవ్ గాంధీ మిత్రులే.

మనకి ఇవంతా వార్తాపత్రికలు చదవటం వల్లనే తెలుస్తున్నది. ఒక్క భారత దేశంలోనే కాదు, విదేశాలవి కూడా. స్టేట్స్‌మన్, హిందూ, టైమ్స్ ఆఫ్ ఇండియా వంటి పత్రికలు వంద ఏళ్ళకి పైగా ఉన్నటువంటివి కాబట్టి వాటికి అబద్ధాలు చెప్పే అలవాటు లేదన్నది మనకి తెలుసు. అవి ఇంతకాలం బతికి ఉన్నాయంటే దాని అర్థం వాటిని ప్రతినిత్యం పాఠకులు కొని చదివి ఆదరించటం వల్లనే. లేక పోతే ఇంతకాలం అవి నిలవలేవు. వాటిలో కొన్ని బ్రిటిష పత్రికలుగా, వారి మిత్రులవిగా ఉండేవి. అలాగే మోతిలాల్ నెహ్రూ కూడా. పాత టైమ్స్ ఆఫ్ ఇండియా సంపాదకుడు బ్రిటిష గవర్నర్లకి మోతిలాల్ నెహ్రూలాగా అతిథి సత్కారాలు చేసి ఉండరు. మోతిలాల్ నెహ్రూ తమ వృత్తిలో పైకి రావటానికి బ్రిటిష్ గవర్నర్ల అనుగ్రహమే కారణం. ఆయన కోవకి చెందిన భారతీయులు సాధారణంగా బ్రిటిష్ వారి అనుగ్రహం కోసం పాకులాడే ఆ కాలంలో మోతీలాల్ నెహ్రూ బ్రిటిష్ వారి కను సన్నలలో ఉండేవారు. అలహాబాద్‌కి చెందిన ఆయన ముని మనుమడుగా రాజీవ్ గాంధీని ఏ భారతీయ సంపాదకుడూ విమర్శించలేడు. □

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుభాషి

# ఒక సాంకేతిక అద్భుతం........



## ఫ్యాంటసీ కలర్ టి.వి. యొక్క ప్రత్యేకత ఏమిటి?

మేలైన ప్రదర్శనకు దోహదం చేసే గ్రహణ శక్తి, మరియు లోకాతీతమైన రంగులు మీకు సమర్పించడం కోసం కేవలం ప్రతి ఫ్యాంటసీ టి.వి. సెట్టులో చూపెట్టబడే అత్యధికమైన శ్రద్ధ

ప్రపంచానికి వున్నత శ్రేణులైన ఫిలిప్సు వారి సరిక్రొత్త సాంకేతిక పరిజ్ఞానాన్ని, పరికరాలను పరిపాందించుకొని తయారైనది ఫ్యాంటసీ కలర్ టి వి

ఫ్యాంటసీ కలర్ టి వి తో (పిక్చర్ ట్యూబ్‌తో సహా) ఒక సంవత్సరపు వారంటీ ఇవ్వబడుతుంది. ఒక వేళ అవసరమొస్తే ఒక్క ఫోన్ చేస్తే చాలు తక్షణం, సమగ్రమైన, విశ్వసనీయమైన సేవ హాజరు

వెంటనే మీకు సమీపంలో ఉండే డీలరు వద్దకు వెళ్ళి ఫ్యాంటసీ ప్రదర్శన పరికించండి ఫ్యాంటసీ గుణగణాలు తప్పక మీ నిర్ణయానికి దోహదం చేస్తాయి

అందుకే మీరు కలర్ టి వి లో కోరుకొనే లక్షణాలన్నీ "ఫ్యాంటసీ" సంతరించుకొంది




# FANTASY

COLOUR TV

MAA(S) H VE 86

Marketed by Vijai Electronics Pvt Ltd 13 Progressive Towers, 6-2-913 & 914, Khairthabad, Hyderabad-500 004

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు (1938-1972)

14-20 నవంబరు, 1986
శ్రీ అక్షయ నామ సం కార్తీక శు త్రయోదశి
సంపుటము 79 : సంచిక 11

ముఖ్య సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

కార్యవాహక (యాక్టింగ్) సంపాదకుడు
మతుకుమల్లి మాధవరావు

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2.75 |
| పోస్టులో 6నెలల చందా | రు. 78.00 |
| పోస్టులో 12నెలల చందా | రు. 156.00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధినగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
నటి . సుహాసిని
(ఫొటో . ఏ రవిచందర్)






### ముఖచిత్రం

బ్యూటీ క్వీన్ భానుప్రియ" ముఖచిత్రం ఎంతో వెరైటీగాను, మోడరన్‌గాను వుంది

-ఎం శివాజీ, మోదుకూరు

### దసరా సంచిక

"మహిషాసుర మర్దిని" ముఖచిత్రంతో వెలువడిన దసరా సంచిక ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాలా ఆకర్షణీయంగా ఉన్నది. "పుణ్యక్షేత్రాల నిలయం రాజమహేంద్రవరం' వ్యాసం చాలా బాగున్నది మాకు తెలియని ఎంతో ఆసక్తికర విషయాలు తెలియజేయడమే కాకుండా, కన్నులపండుగగా ఫోటోలతో ఎంతో సుందరంగా ఉన్నది చదువుతూ, ఫోటోలు చూస్తుంటే, స్వయంగా దర్శించినంత అనుభూతి కల్గింది

-చోడాబత్తుల సరోజ,
కుప్పనపూడి

★ ★ ★

దసరా సంచిక (10-16, అక్టోబర్) దగద్ధాయమానంగా ఉంది. 'అర్చన' హైలైట్ అలాగే మామూలు' దసరా కార్టూన్ కార్నర్ కడుపు చెక్కలయిపోయిందంటే నమ్మండి. ప్రశ్నావళి ఆలోచనాత్మకంగా, సృజనాత్మకంగా సాగిపోతోంది సీరియల్స్ ఎప్పుడూ సెన్సేషనలే! ఇక ఈ వారం ప్రవేశపెట్టిన - 'గర్భస్థ శిశువు చెప్పిన కథలు' ఆసక్తిగా వుండి, పాల్గొనే విధంగా ఉంది

-కె శివరామిరెడ్డి, కె శాయిలీల,
నందివెలుగు

★ ★ ★

అక్టోబర్ 10-16, 1986 -ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖచిత్రం ఆకర్షణీయంగా వున్నది

-యన్ కనకారావు, పర్లాకిమిడి

### ముఖచిత్రం

అక్టోబర్ 17-23, 1986 నటి అంబిక ముఖచిత్రంతో వెలువడిన సచిత్ర వారపత్రిక ఎంతో ఆకర్షనీయంగా వుంది

యార్లగడ్డ సత్యవతి, మండపేట,

### సీరియల్స్

అందాలతార అంబిక ముఖచిత్రంతో వెలువడిన అక్టోబర్ 17-23, 86 సంచిక మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకున్నది

"పావని మాకు బాగా నచ్చింది

అమరా నాగేశ్వరరావు, ఆకివీడు

★ ★ ★

'కరిగిన శిల' సీరియల్ ఎంతో ఆసక్తికరముగా ఉన్నది. 'పావని' సీరియల్ చాల బాగుంది ఈ సీరియల్ నేటి సమాజ వ్యవస్థకు ప్రతిబింబం.

జె వి రమణమ్మ, బొబ్బిలి

★ ★ ★

'కరిగిన శిల' 'పావని' సీరియల్స్ ఆసక్తికరంగా వున్నాయి

చోడవరపు నాగేశ్వరరావు, రమాదేవి, హైదరాబాదు


(73 వ పేజీ చూడండి)

కొత్త సీరియల్ ప్రారంభం!

# ఒకటి ఒకటీ మూడు

తేజోవతి

అది చక్కగా నీట్‌గా సర్దబడిన గది.

గదిలో కడుగు పెట్టగానే కన్పిస్తుంది అలమేలు మంగా, వేంకటేశ్వరుల పెద్ద పటం.

దానికెదురుగా పేము కుర్చీ కుర్చీ ముందు పెద్ద చెక్క టేబిలు.

దానిపైన ఒక పక్కగా బి.పి. ఆపరేటస్. చిన్న రాక్‌లో మెడికల్ జర్నల్. ఒక గోడకు అముల్ మిల్క్ పాప ఫోటో.

ఆ కుర్చీకి ఎడం చేతి పక్కగా మ రో చిన్న టేబిలు పైన ఫోను. కుడి చేతి వైపు స్టూలు పేషెంట్లు కూర్చోడానికి.

టేబుల్‌కు అటు పక్కగా మ రో పేమం కుర్చీ.

డాక్టరుగారి కుర్చీకి ఎదురుగానే అల్లంత దూరంలో ఒక స్క్రీను. ఆ వెనకగా కనబడుతున్న పరీక్ష చేసే బల్ల తాలూకూ తెల్లటి కాళ్ళు...

ఆ గదికి రెండు తలుపులు. ఒకటి బయటకు పేషెంట్లుగానీ రిప్రజెంటేటివ్స్‌గానీ, మ రెవరైనా సరే బయట నుండి వచ్చే వాళ్ళకు.



రెండో తలుపు నర్సింగ్ హోమ్ లోపలకు.ఈ రెండింటికి కూడా స్ప్రింగు డోర్స్ వున్నాయి

రెండో తలుపు స్ప్రింగ్ డోర్ తెరుచుకుని లోపలకు నడిచింది అక్కడి నర్సు

నీలం బార్డరున్న తెల్ల చీర, తెల్ల జాకెట్టు తలకు వెయిల్. నుదుట మెరిసె కుంకుమ బొట్టు . ఆ మొఖంలో కొంచెం అదుర్దా

మెత్తగా చప్పుడు చెయ్యకుండా లోపలకు వచ్చింది ఖాళీగా వున్న డాక్టరు కుర్చీ పక్కనున్న ఫోను దగ్గర వున్న డైరెక్టరీ తీస్తుండగా బయటకున్న తలుపు తెరుచుకుంది

దరిదాపు ఆరడుగుల ఆజానుబాహు విగ్రహం . లోపలకు అడుగు పెడుతూనే ఎదుట వున్న యువతిని చూసి, "సీతా! " అన్నాడుఆశ్చర్యంగా

నర్సు చేతిలోంచి టెలిఫోను డైరెక్టరి క్రింద పడిపోయింది నిర్ఘాంతపోయి చూస్తుండగానే ఆయన అడుగులు రెండు గబగబా ముందుకు పడ్డాయి

నర్సు ఆశ్చర్యంగా చూస్తోంది బిత్తరపోయి చూస్తోంది అయోమయంగా చూస్తోంది

ఈలోపల బయట తలుపు స్ప్రింగుడోర్ మళ్ళీ తెరుచుకుంది. వాచ్‌మన్ వచ్చాడు లోపలకు



# ఒకటి ఒకటి మూడు

"అమ్మా లక్ష్మమ్మా . ఈయన డాక్టరు శ్యామసుందర్‌గారని మన డాక్టరమ్మగారి స్నేహితులు." అంటూ ఆ నర్సుకు పరిచయం చేసి,

"నర్సమ్మా . డాక్టరమ్మగారికి ఫోను చెయ్యి డాక్టరుబాబుగారు వచ్చారని " అని నర్సుకు పురమాయించి- "కూర్చొండి బాబుగారూ డాక్టరమ్మగారు యిప్పుడే వస్తారు " అని డాక్టరుగారి కుర్చీకి ఎదురుగా వున్న కుర్చీ చూపించి వెళ్ళిపోయాడు వాచ్‌మన్

డాక్టరు శ్యామసుందర్ కూర్చోలేదు.

ఎదురుగా బిత్తరపోయి బొమ్మలా నిలబడ్డ ఆ యువతి వైపే చూస్తూ, "సి ,తా ?" అన్నాడు ప్రశ్నార్థకంగా ఆయన మొఖంలో భావాలు రంగుటద్దంలోలా చకచకా మారిపోతున్నాయి.

"నా.. నా పేరు లక్ష్మి. ఇక్కడ నర్సును " అన్నది

ఒక్కసారి హతాశుడైనట్లు పక్కనే వున్న కుర్చీలో కూలబడిపొయ్యారాయన

అయినా ఆయన కళ్ళు మాత్రం నిశితంగా నఖశిఖపర్యంతం ఆ యువతిని పరీక్షిస్తున్నట్లే వున్నాయి

ఆ చూపులు యిబ్బందిగా అనిపించింది కాబోలు తటాలున వంగి కింద పడ్డ టెలిఫోను డైరెక్టరి తీసి నంబరు వెతకసాగింది లక్ష్మి...

ఈలోపల మరో అతడు లోపలకు వచ్చాడు. పల్లెటూరి మనిషిలా వున్నాడు

"అమ్మా నర్సమ్మా ఎలా వుంది మా అమ్మాయికి?" ఆదుర్దాగా అడుగుతున్నాడు.

"ఆమెకొచ్చిన భయమేమీ లేదు డాక్టరమ్మగారిక్కూడా ఫోను చేస్తున్నాను. ఆవిడ కూడా వచ్చేస్తారు మీరలా బయట కూర్చోండి " నర్సు తనను తాను సంభాళించుకుని ఆ వచ్చినతడికి ధైర్యం చెప్పి పంపించేసింది

నర్సు ఫోను డయల్ చెయ్యబోతుండగా అడిగారు డాక్టర్ శ్యామసుందర్.

"సుదా ఎక్కడికెళ్ళింది?"

"వాళ్ళ .. తమ్ముడిగారి పెళ్ళికి వెళ్లారు.. దగ్గర వూరే..." అంటూ ట్రంక్ కాల్ బుక్ చేసింది. అనుకోకుండా వెంటనే లైను దొరికింది

"అమ్మా . నేనమ్మా లక్ష్మిని అమ్మా... కాంప్లికేటెడ్ అవుతుందనుకున్నాం కేసు అన్నపూర్ణమ్మ "

" . .."

"అవునమ్మా. . ఆ అమ్మాయే . లేబర్‌పెయిన్స్ మొదలయ్యాయి . "

" . ."

"అన్నీ చేశానమ్మా... చాలా కాంప్లికేటెడ్‌గానే వుంది "




" "

" ... మొదటి బిడ్డ ... "

" "

"అవునమ్మా ట్రై చేశాను లాక్డ్ ట్విన్స్‌లా వున్నారు "

" . "

"అలాగేనమ్మా "

" "

"అలాగే ప్రయత్నం చేస్తానమ్మా అమ్మా.. మరి మీ స్నేహితులట.. డాక్టరుగారు . ఆయన వచ్చారమ్మా . "

" "

"ఆయన పేరు" ఫోను చేస్తున్న లక్ష్మి శ్యామసుందర్‌గారి వైపు చూసింది.

సిగరెట్ వెలిగించుకుని తాపీగా పొగ వదులుతూ నర్సునే గమనిస్తున్న శ్యామసుందర్‌గారు ఏమి మాట్లాడలేదు..

'ఆయన పేరు శ్యామసుందర్‌గారట డాక్టర్ శ్యామసుందర్‌గారు .."

" "

లక్ష్మి ఆ వెంటనే ఫోను శ్యామసుందర్‌గారికి అందిస్తూ, "డాక్టరమ్మగారు. మీకు ఫోనిమ్మన్నారు " అన్నది తల వంచుకుని-

"హల్లో సుధా హౌ ఆర్ యూ " ఫోను అందుకున్న శ్యామసుందర్‌గారు అడిగారు

" . . "

"నేనా వూరికినే వచ్చాను. వైజాగ్ వచ్చాను పనుండి రావటం లేదని అంటున్నావుకదా చూసిపోదామని వచ్చాను అంతే. ."

" . "

"అలాగే సరే చూస్తాలే అలాగే తప్పకుండా మీ నర్సుకి చెప్పు .."

మళ్లీ ఫోను అందించారాయన

"అలాగేనమ్మా మంచిది అన్నీ అరేంజి చేస్తాను " అనేసి ఫోను పెటేసి, డాక్టరమ్మగారు రాత్రిక మిమ్మల్నిక్కడ భోజనానికి వుండమని చెప్పమన్నారు.. ఆవిడ పెళ్ళి కాగానే బయలుదేరి వస్తారట యీ కేసు విషయంలో మీ హెల్ప్...."

అవును చెప్పింది వస్తున్నాను యిన్‌స్ట్రుమెంట్స్ అన్నీ రెడీ చెయ్యి అన్నారు

* * *

అరగంట తర్వాత

డాక్టరుగారి గదిలో కుర్చీలో వెనక్కువాలి సిగరెట్టు వెలిగించుకుంటున్న శ్యామసుందర్‌గారి ఆ సునిశితమైన చేతి వేళ్ళ వైపు ఆశ్చర్యంగా చూస్తూ కాఫీ అందించింది లక్ష్మి

ఈ రోజు ఆయన లేకపోతే తను ఏ మాత్రం చెయ్యగలిగేది ఆ డెలివరీ?..

అది ట్విన్స్ ఒకటి బ్రీచ్ ఒకటి ట్రాన్స్‌వర్స్ పైగా లాక్‌డ్ ట్విన్స్ . మొదటి బిడ్డ గడ్డం రెండో బిడ్డ మెడలో యింటర్‌లాక్ అయింది

ఆయన యిన్‌సిషన్ యిచ్చిన తీరు. రెండో ఫీటస్‌ను వేళ్ళతో పైకి నెట్టి, మొదటి బిడ్డను ఫోర్‌సెప్స్‌తో లాగిన తీరు ఆయన కాన్‌సన్‌ట్రేషను

తను ఎంతో భయపడిన కేసు ఆయన ఎంత అవలీలగా చేశారు. అవును ఆయన ఎన్ని కేసులు చేశారో,

మగ డాక్టర్ల దగ్గర పురుడు పోసుకోవాలంటే యిష్టపడరు ఆడవాళ్ళు .. కాని వాళ్ళకున్న బలం . సమయస్ఫూర్తి . ఆ ధైర్యం. . ఎక్కువ ధైర్యంగా పోవచ్చేమో.. ఆ సమయంలో డాక్టరమ్మగారు ఎంత టెన్షను ఫీలయ్యే వాళ్ళో యితరులకు తెలియకపోయినా తనకు తెలిసేది. కానీ ఈయన ఎంత కామ్‌గా ఎంత కూల్‌గా.. ఆ ధైర్యం, ఆ విశ్వాసం . ఆలోచిస్తున్న లక్ష్మి ఆయన కాఫీ తాగి కప్పు అక్కడ పెట్టగానే–

"ఇంకొక కప్పు యిస్తాను." అన్నది.

శ్యామసుందర్‌గారు మౌనంగా కప్పు ముందుకుజరిపారు.

ఫ్లాస్కులో కాఫీ వంచుతున్న నర్సుతో, "ఎన్నాళ్ళయింది యిక్కడ చేరి?" అని అడిగారు...

# కార్టూనిస్టులకు సూచనలు !

- ★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.
- ★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.
- ★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి !
- ★ వ్యాఖ్య **చిన్నదిగా, క్లుప్తంగా** వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ **మీదే** పేరూ, వూరూ అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.
- ★ సొంత చిరునామాగల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పి పంపడం జరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు.
- ★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది. పరిశీలనకు ఐదారు వారాలు పట్టవచ్చు.
- ★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.
- ★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.
- ★ మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు సంపరాదు.

## ఒకటి ఒకటి మూడు

"మూడేళ్ళయింది "

"అన్‌ట్రెయిన్డ్?"

అవునని తలూపింది నర్సు

డాక్టరుగారు కాపి తాగుతుండగా లక్ష్మి మళ్లీ డాక్టరమ్మగారికి ఫోను బుక్ చేసింది కాల్ మెచ్యూర్ అయ్యే లోపల అప్పుడే పక్క పల్లెటూర్ను నుండి వచ్చిన కేసు పరీక్ష చెయ్యడానికి లోపలకు తీసుకు వెళ్ళింది నర్సు.

ఆమె తిరిగి వచ్చేసరికి, అప్పుడే ఫోను పెట్టేస్తున్న శ్యామసుందర్‌గారు, "మీ డాక్టరమ్మగారు ఫోను చేశారు ఆవిడ కారు ఎవరో పని మీద తీసుకు వెళ్లారట ఆవిడ బయలుదేరడానికి యింకా రెండు మూడు గంటలు పట్టవచ్చట " అన్నారు

"అయ్యో.. డాక్టరమ్మగారు వస్తారని యిప్పుడొచ్చిన కేసు అడ్మిట్ చేసుకున్నానే "

ఏమిటా కేసు"

"పల్లెటూరి వాళ్ళు మూడు రోజుల నుండి బాధ పడుతుంటే యిప్పుడు తీసుకు వచ్చారు సర్వైకల్ డయలేషన్ లేదు. సిజేరియన్ చెయ్యాల్సి వుంటుందనుకుంటాను. అంటూనే హడావుడిగా నర్సింగ్ హోమ్‌లోపలికి వెళ్ళింది లక్ష్మి మరో నర్సు ప్రభావతితో మాట్లాడి వచ్చి పేషెంటు తాలూకు వాళ్ళను పిలిచి,

"కొంచెం కష్టమవుతుంది ఆపరేషను చెయ్యాల్సి వుంటుంది డాక్టరమ్మగారు లేరు మీరు మరో ఆస్పత్రికెక్కడికైనా త్వరగా తీసుకెళ్ళిపోండి" అని చెప్పింది.

పేషెంటుతో బాటు వచ్చిన పది మంది ఒక్కసారి గొల్లుమన్నారు ఆ మాట వినగానే

"మీరు ఏడ్చి ఏం ప్రయోజనం లేదు , నొప్పులు పడుతూంటే పురుడు రాకపోతే మూడు రోజులు ఎవరు పెట్టుకోమన్నారు యింట్లో.. వెంటనే తీసుకెళ్లండి

"అమ్మా యిది తొలి చూలు కనుక ఆలస్యమైందనుకున్నాం . మాది పల్లెటూరు బండి కట్టుకు తీసుకొచ్చాం . యీ పక్క పల్లెటూళ్ళన్నిటికి యిదొక్కటే ఆసుపత్రి మళ్లీ విశాఖ పట్టణం తీసుకెళ్లాలంటే ఆలీసమైపోతుందమ్మా నర్సమ్మగారూ మీ కాళ్ళు పట్టుకుంటాం , బిడ్డని గండం నుంచి బయట పడెయ్యండి."

బంధువులు ఏడుస్తూ బ్రతిమిలాడుతున్నారు

"నేనేమన్నా చెయ్యగలిగితే అడ్మిట్ చేసుకొనా డాక్టరమ్మగారు వస్తారని పరీక్ష చేశాను కాని ఆమెగారు రావడం లేటవుతుందిట " నచ్చ చెప్పడానికి ప్రయత్నిస్తోంది లక్ష్మి .

అంతదాకా మౌనంగా వున్న శ్యామసుందర్‌గారు కల్పించుకుని, "మామూలుగా మీ డాక్టరుగారు ఆపరేషను చేస్తే ఎనస్థిషియా ఎవరిస్తారు?" అని అడిగారు లక్ష్మిని

"ఈ వూర్లో యింకొక్క డాక్టరమ్మగారు మాత్రమే వున్నారు డాక్టరమ్మగారికి ఆవిడే సాయం చేస్తుంటారెప్పుడూ. "

"ఆవిడకు నర్సింగ్‌హోమ్ లేదా?"

"వున్నది కాని చాలా చిన్నది మామూలు డెలివరి లేదా డి అండ్ సి లాంటివి చేస్తారు అంతే "

'సరే అయితే ఆవిడకే ఫోను చెయి. థియేటరు రెడీ చేసి పేషెంటును... " అంటుంటే

అంటే మీరు ఆపరేట్ చేస్తారా?' ఆశ్చర్యంగా అన్నది లక్ష్మి. .

"ఏం, చెయ్యలేనని అనుమానమా?" సూటిగా కళ్ళల్లోకి చూస్తూ, అడిగారు శ్యామసుందర్‌గారు

"అహహ . అది కాదు ఆ వుద్దేశం కాదు ఆ వుద్దేశం లేదు. " తత్తరపడింది లక్ష్మి

ఆ తత్తరపాటు చూసి చిన్నగా నవ్వి, "ఆ లేడి డాక్టరుకు ఫోను చెయ్యి. "

అన్నారు

లక్ష్మి డయల్ చెయ్యబోతుంటే అడగారు శ్యామసుందర్‌గారు. "మామూలుగా ఆపరేషనప్పుడు ఎవరెవరు అసిస్ట్ చేస్తుంటారు మీలో?"

"నేనూ. ప్రభావతి అని యింకో నర్సు తను బిడ్డను చూసుకుంటుంది" అని చెప్పి ఫోను తీసింది లక్ష్మి

ఎమర్జెన్సీ ఆపరేషను కనుక తీసుకోవలసిన ప్రికాషన్సు అన్నీ జాగ్రత్తగా తీసుకుంది ఆమె

లక్ష్మి ఎప్పుడు థియేటరులోకి వచ్చినా తను చేరిన కొత్తలో అనుభవాలు ఎప్పుడూ గుర్తు తెచ్చుకుంటుంది.

తను మొదట్లో చేరింది ఒక పెద్ద డాక్టరు దగ్గర చాలా అనుభవజ్ఞుడు మామూలుగా ఎంత మంచిగా వుండే వాడో థియేటర్‌లో ఏమాత్రం పొరపాటు జరిగినా అంత మండి పడేవారు స్పిరిట్ పెట్టి ఎంత శుభ్రంగా తుడచినా ఎక్కడెక్కడో చిన్న పొరబాటు ఆయన కళ్ళబడేది..

లక్ష్మి ఆలోచిస్తూనే స్టెరిలైజుడు యిన్‌స్ట్రుమెంట్స్ అన్నీ తీసి పెట్టింది స్కాల్ పెల్స్, క్లాంప్స్, డిసెక్టింగ్ ఫోర్‌సెప్స్, సిజర్స్, నీడిల్స్, నీడిల్ హోల్డర్స్, సూచర్ మెటీరియల్. మాప్స్... యింకాయింకా.

డాక్టరుగారు సింక్ దగ్గర నిలబడ్డారు ఆయనకు సోప్ యిచ్చి స్టెరిలైజుడు వాటర్ చేతుల మీద పోస్తున్నప్పుడు లక్ష్మికి పాత అనుభవం గుర్తుకొచ్చింది

తను నేర్చుకోడానికి వచ్చిన కొత్తల్లో తను ముందు చేతి మీద నీళ్ళు పోసింది డాక్టరుగారికి-

ఆ డాక్టరుగారు అడిగారు, 'నువ్వు ఎవరికైనా అన్నం పెట్టేటప్పుడు ముందు కూర వడ్డిస్తావా? మజ్జిగా?...'

అది జ్ఞాపకం రాగానే లక్ష్మి పెదవుల మీద చిన్న చిరునవ్వు మెరిసింది

తలెత్తి ప్రశ్నార్థకంగా చూశారు డాక్టరుగారు

తలొంచుకుంది లక్ష్మి.. ఆయన థియేటరులో ప్రతి నిముషం తననే గమనిస్తున్నారని తనకు తెలుసు అది చాలా యిబ్బందిగా కూడా వుంది

ఆయన మాస్కు తొడుక్కుని కాప్ పెట్టుకుని అలా గంభీరంగా నిలబడితే చూడాలంటే భయంగా వుంది లక్ష్మికి

ఇన్‌స్ట్రుమెంట్స్ ట్రాలీలో ఇన్‌స్ట్రుమెంట్స్ పెట్టుకుని ట్రాలీ ఆపరేషను టేబిల్ పక్కకు జరుపుతుంటే మళ్ళీ వెన్నుకటి అనుభవం గుర్తొచ్చింది.

ఆ కొత్త రోజుల్లో తెలియక ఇన్‌స్ట్రుమెంట్స్ మీద స్టెరిలైజెడ్ టవలు కప్పడం మర్చిపోయింది లక్ష్మి

అంతే చెంప చెళ్ళుమన్నది.. ఆ రోజు అలా కొట్టినందుకు ఆయన్ను తిట్టుకుంది.. ఏడ్చింది, బాధపడింది... కాని ఆ చేదు అనుభవం నేర్పిన పాఠం ఆపరేషను థియేటరులో ఎప్పుడూ ఎట్టి పరిస్థితుల్లోనూ ఏ విషయంలోనూ అజాగ్రత్తగా వుండేది కాదు ఆ తర్వాత డ్యూటీలో ఒక్క రోజు ఒక్క మాట పడలేదు.

డాక్టరమ్మగారు ఎనస్థీషియా యిస్తున్నారు ప్రభావతి సాయం చేస్తోంది. లక్ష్మి శ్యామ సుందర్‌గారికి యిన్‌స్ట్రుమెంట్స్ ఒక్కొక్కటి అందిస్తోంది

థియేటర్‌లో వున్నంతసేపూ ఆయన కాన్‌సన్‌ట్రేషనుకు నిజంగా ఆశ్చర్యపోతుంది లక్ష్మి

ఎబ్డామెన్ వోపెన్ చెయ్యటం యుట్రిస్‌కు యిన్‌సిషను యిచ్చిన తరు. దాన్ని పెరిటోరియల్ కావిటీ నుండి తీసి. ఆ తర్వాత బిడ్డను తియ్యడం

లక్ష్మి డాక్టరుగారి చేతి వేళ్ళనే గమనిస్తోంది చాలా యంత్రంలా చేసుకుపోతున్నాయి అలవాటయినవాటిలా. సులువుగా. అలవోకగా యూట్రిస్ యిన్‌సిషనుకు సూచర్స్

లక్ష్మికూడా యంత్రంలానే అందిస్తోంది పరికరాలను ఆపరేషను అయిపోయింది ఎబ్డామిన్ యిన్‌సిషను కూడా కుట్లు వేశారు

లక్ష్మి పేషెంటును బెడ్ మీద పడుకోబెట్టి. డ్రిప్ పెట్టి తను మాస్కు, కాప్ అవన్నీ తీసేసి వచ్చేసరికి శ్యామసుందర్‌గారు డాక్టరుగారి గదిలో యిందాక కూర్చున్న చోటనే కూర్చుని వున్నారు వెనక్కు వాలి కాళ్ళు ముందుకు చాచి ఏదో ఆలోచిస్తూ వున్నారు

చేతిలో సిగరెట్ వెలుగుతోంది

చుట్టూ చీకట్లు వ్యాపిస్తున్నాయి. గంట ఏడున్నర చూపిస్తోంది.

గది లోపలికి వచ్చిన లక్ష్మి డాక్టరుగారితో అన్నది "మీరు డాక్టరమ్మగారు వచ్చేదాకా యిక్కడే వుంటారా. లేక లోపలికి వచ్చి స్నానం చేస్తారా?"

"లోపలికి అంటే- మీ యిల్లు యిక్కడేనా?" ఠీవాలున తలెత్తి అడిగారు

"డాక్టరమ్మగారింట్లోనే వుంటాను. ఆమె యిల్లు యీ నర్సింగ్‌హోమ్ పక్కనే."

"అంటే- ఫామిలీ లేదా?"

లేదన్నట్లు తలూపింది లక్ష్మి.

"ఏదో?" సూటిగా కళ్ళల్లోకి చూస్తూ అడిగారు

"అహఁ కాదు' అంటూనే అల్చిప్పల్లాంటి కళ్ళెత్తి సూటిగా చూసింది ఆ కళ్ళల్లోకి ఇలాంటి ప్రశ్నలడగటం మీకు తగదన్న మందలింపు వుంది ఆ చూపులో

పెదాలు దాటి దాటకుండా చిన్న నవ్వు మెరిసింది ఆయన మొఖంలో "అన్ మారిడ్!" అన్నారు యింకా కుతూహలం చంపుకోలేక

సింపుల్‌గా తలాడించింది "నేను యింటికి వెళుతున్నాను మీరు రాదలచుకుంటే రావచ్చు" అనేసి చకచకా బయటకు నడిచింది లక్ష్మి

## గడుసులోకం — బాబు






# ఒకటి ఒకటి మూడు

నెమ్మదిగా అనుసరించారు శ్యామసుందర్‌గారు

ఒక అరగంట లోపలే వచ్చింది డాక్టరు సుధాపరిమళ

"హల్లో శ్యామ్ ఎలా వున్నావ్? సారి నువ్వొచ్చేటప్పటికి యింట్లో లేకుండా పోయాను పెళ్ళంతా అయితేగాని బయలుదేరడానికి లేదని అమ్మా వాళ్ళు పేచి, నా కారు కూడా అటూ యిటూ తిప్పుతున్నారు పన్ల మిద" అంటూ వస్తూనే గలగలా మాట్లాడేసింది

"క్షమాపణలు ఎక్స్‌ప్లనేషన్లు తర్వాత, భోజనానికి వుండమన్నావుగా ఫోనులో ముందా ఏర్పాట్లు చూడు"

"నాకు దిగులెందుకు! లక్ష్మి వుందిగా యింట్లో" అంటున్న సుధతో,

"ఈజ్ షి యువర్ నర్స్ ఆర్ యువర్ కుక్?" అన్నారు శ్యామ్

"ఓహ్! రెండు కాదు . లక్ష్మి నా కంపానియన్ ఇద్దరం ఒంటరి వాళ్ళం ఒకొళ్ళకొకళ్ళు తోడు . అంతే . అమ్మా. వాళ్ళను వచ్చి వుండమంటే వాళ్ళు ఆ పొలాలు యిల్లూ ఆ వూరు వదిలిపెట్టి రాలేమన్నారు. సరే" అని చెబుతుండగా వంటింట్లో నుండి లక్ష్మి వచ్చి, వంటయిందని చెప్పింది

"ని స్నానం అయిపోయినట్టుందిగా నేను అయిదు నిమిషాల్లో రెడీ అయి వస్తాను." అనేసి లేచింది సుధ

డైనింగ్ టేబిలు మిద యిద్దరికే వడ్డించడం చూసి, "లక్ష్మీ.. తొమ్మిదయింది . నువ్వు కూడా కూర్చోరాదా శ్యామ్ ఏమి అనుకోడులే" అన్నది డాక్టరమ్మ

ఫర్వాలేదమ్మా నాకంత ఆకలిగా లేదు అన్నీ టేబిలు మిద పెట్టాను మిరు వడ్డిస్తామంటే- నేను మిక్సి వెయ్యాలి.. కొంచెం వంటింట్లో పనుంది" నసుగుతూ అన్నది లక్ష్మి

"సుధా నన్ను భోజనానికుండమని బలవంతం చేసి నువ్వు మి నర్సును చాలా యిబ్బంది పెట్టావు.. ఇంకా వద్దనంటే ఆవిడకు మరి కష్టమేమో"

"అబ్బెబ్బే . అలాంటిదేం లేదు అలాంటిదేం లేదు . నిజానికి నా వృత్తి మికు యిబ్బంది కలిగిస్తుందని"

ఓ అదా అయితే ఫర్వాలేదు . లక్షణంగా ఆ కుర్చిలో కూర్చుని మరి వడ్డించవచ్చు. ని వృత్తి నాకేం కష్టం కలిగించదు అని యింకా నాకు వండి పెట్టడం కష్టమనిపించిందేమో . అనుకున్నానులే అన్నారు ఆ అమ్మాయి ముఖంలోకి చూస్తూ

'ఛ. ఛ లక్ష్మి అలా ఏమీ అలా అనుకోదు శ్యామ్ అమ్మవాళ్ళు వచ్చినప్పుడు కూడా నేను హోటలు నుండి తెప్పిస్తానంటే తను వద్దని అందరికి వంట చేసి పెడుతుంది

లక్ష్మి వడ్డన చేస్తుండగా అన్నది సుధ

'శ్యామ్ మా నర్సింగ్‌హోమ్ చూశావుగా ఎలా వుంది?

నర్సింగ్‌హోమ్ అంత' చూడలేదు ఓపియేటరు మాత్రమే చూశాను

'అదేం? లక్ష్మి నర్సింగ్‌హోమ్ అంతా చూపించలేదా శ్యామ్‌కు'

'లేదమ్మా ఆయన వచ్చినప్పటి నుండి. ఏదో ఒక కేసుకు అటెండవడమే సరిపోయింది . సిజేరియన్ సంగతి చెప్పానుగా

అయితే శ్యామ్ యీ రోజు రాత్రి వుండిపో రేపొద్దున అంతా చూసి వెళ్ళువుగాని

. నేనింకా యీ నర్సింగ్‌హోమ్‌ను ఎక్స్‌టెన్డ్ చెయ్యాలనుకుంటున్నాను . ఆ ప్లాన్ నితో మాట్లాడాలనుకున్నాను వైజాగ్ కె జి. హెచ్ నుండి ట్రాన్స్‌ఫర్ చేసి ఎక్కడో మారుమూల వేశారు నాకు వెళ్ళాలనిపించలేదు

అప్పుడే మా అంకుల్ చనిపోవడం వాళ్ళ పిల్లలెవరూ మెడికల్ లైనులోకి రాకపోవడంతో నేను యీ నర్సింగ్‌హోమ్ తీసుకున్నాను. పక్కపక్క పల్లెటూళ్ళ వాళ్ళంతా వస్తున్నారు . బాగాను పికప్ అయింది ' డాక్టరమ్మగారు అక్కడి పరిస్థితులు సాధక బాధకాలూ వర్ణిస్తుంటే భోజనం చేస్తున్న శ్యామ్ సుందర్‌గారు అడిగారు.

'వంటంతా మి నర్సే చేసిందా .. హోటలు నుండి ఏమన్నా తెప్పించారా'



"ఏం అలా అడుగుతున్నావ్? .. లక్ష్మి వంట బాగా చేస్తుందే .. బాగులేదా యీ రోజు?" ఆశ్చర్యంగా అన్నది సుధగారు

'బాగులేకనేం... చాలా బాగుంది. . నిజానికి నా భార్య వెళ్ళిపొయ్యాక యింత కమ్మటి వంటకాలు రుచి చూడనేలేదు పైగా అన్నీ నాకిష్టమైన పదార్థాలుంటేను...'

'నీ భార్య వంటా . భలేవాడివే.. ఒకసారి నే నొచ్చినప్పుడు శారద వంట చేసింది. . బెండకాయలు నీళ్ళల్లో వేసి వుడకపెట్టి కూరచేస్తే . నవ్వుకోలేక చచ్చిపొయ్యాంకదూ? అన్నది నవ్వుతూ సుధగారు

"నేను శారద సంగతి చెప్పడంలేదు. నా రెండో భార్య సంగతి చెబుతున్నాను.. . తను వంటమనిషి రానప్పుడు వంటచేస్తే యింత కమ్మగా . " అంటుండగా సాంబారు తేవడానికని చెప్పి లోపలికి వెళ్ళింది లక్ష్మి.

"నీ రెండో భార్యా! . శారద చనిపొయ్యాక నువ్వు మళ్ళీ పెళ్ళి చేసుకున్నావా శ్యామ్?!" చాలా ఆశ్చర్యంగా అడిగింది..

"అవునని తలూపారాయన .."

"మరి ఆవిడేమయింది?"

'లేచిపోయింది."

"శ్యామ్!!"

ఇంతలో వంటింట్లో ఏదో దబ్బున పడ్డట్టు చప్పుడు కావడంతో యిద్దరూ ఛివాలునలేచి వంట ఇంటి గుమ్మం దగ్గరకు వచ్చారు.....

గుడ్డతో పట్టుకొస్తున్న వేడివేడి సాంబారు గిన్నె పడిపోయింది.

"పట్టుతప్పిందమ్మా." అన్నది లక్ష్మి డాక్టరమ్మగారి వైపుచూస్తూ. పులుసుపోయిందన్న బాధతో. లక్ష్మి కళ్ళలో నీళ్ళుతిరిగాయి శ్యామసుందర్‌గారు లక్ష్మి వైపు ఆశ్చర్యంగా చూస్తూ, "పులుసు పోతే పోయింది. . వేడివేడి పులుసు పాదం మిద పడినట్టుంది.... కాలలేదా.. " అన్నారు వంగి పాదంవైపు చూస్తూ ...

ఆయన పాదం ముట్టుకుని చూడబో తుంటే గబుక్కున తన పాదం లాగేసుకుని, "ఏమికాలేదండి. . నిజానికి అది అంత ఎక్కువ వేడికూడాలేదు . " అన్నది మొహమాటంగా ..

"ఆగు .. నన్ను చూడనీ" కటువుగా అని పాదంమిద కమిలిన భాగాన్ని తాకి చూడబో తుంటే గబుక్కున ఆయన చేతిని తోసేసి, "అహ. . వద్దు... పెద్ద వాళ్ళు కాళ్ళు ముట్టుకుంటే ఆయుక్షీణమట. నేను నీళ్ళుపోసి కడిగి ... ఆయింట్‌మెంట్ వేస్తాలెండ "అంటూ గబ గబా బాత్‌రూమ్‌వైపు నడిచింది లక్ష్మి ..

లక్ష్మి గబగబా పాదం మిద పడినవన్నీతుడిచేసి బర్నాల్ రాసుకుని వచ్చేసరికి మౌనంగా భోజనం చేస్తున్నారు యిద్దరూ....

లక్ష్మిరాగానే, "యిదో లక్ష్మి ... నువ్వుకూడా కూర్చో మాతో ... అంతగా కిచెన్‌లో ఏమన్నా పనుంటే తర్వాత చేసుకుందాం ... కూర్చో ." ఆర్డరిచ్చినట్టు అన్నది సుధ. ..

ఇంకా సందేహిస్తున్న లక్ష్మినిచూసి,

"సుధా.. నేనుంటే మి లక్ష్మి యిక్కడ వుండడానికి యిష్టపడదు ... నే వెళుతున్నానులే కూర్చో" అంటూ కంచంలో చెయ్యి కడిగేసుకొబో తున్న శ్యామ్‌సుందర్‌గార్ని మందలిస్తూ,

"లక్ష్మి నువు కూర్చో . శ్యామ్ నువ్వు నా క్లాస్‌మేట్‌వి కావచ్చు ... క్లోజ్ ఫ్రెండ్ వవుతే అవచ్చుగాని. లక్ష్మిమిద కామెంట్‌చేస్తే మాత్రం నే నొప్పుకోను.... అంతకంటే నువ్వు సగంలో చెయ్యికడుక్కున్నా మేమిద్దరం కూడా మానేస్తాం.... ని యిష్టం... ఒకళ్ళు యింటికి వచ్చారని బాధపడే స్వభావం మాత్రంకాదు లక్ష్మిది ... గారంటిగా చెబుతాను.." అన్నది డాక్టరమ్మగారు.. .

"ఓ. కే. అయామ్‌సారి... వెరిసారి.. ." అన్నారాయన...

లక్ష్మికూడా మాట్లాడకుండా కంచం తెచ్చిపెట్టుకుంది..

కొద్ది క్షణాలపాటు నిశ్శబ్దం రాజ్యం చేసింది ఆ గదిలో ...

ఆ గంభీర వాతావరణం అందరికి యిబ్బందికరంగానే వుండడంతో కాబో లు తేలిక పర్చడానికి అన్నది సుధ..

"మా శ్యామ్ యిప్పుడిలా సినిక్‌లాగా తయారయ్యాడుగాని యిదివరకు కాలేజిలో ఎంత జొవియల్‌గా ఎంత సోషల్‌గా వుండేవాడో .. చాలా పెద్ద ఫ్రెండ్స్ సర్కిల్... అమ్మాయిలయితే శ్యామ్ ఫ్రెండ్‌షిప్‌కోసం ఎంత తహ తహలాడిపొయ్యేవాళ్ళో లక్ష్మి ."

శ్యామ్‌సుందర్‌గారు చిన్నగా నవ్వారు

"ఒకప్పుడు అమ్మాయిలు నేనంటే పడిచచ్చేవాళ్ళని యిప్పుడు ఎవరికి చెప్పకు.. నవ్వుతారు వింటే" అన్నారు

"నవ్వడం ఎందుకు! . అబద్ధం చెప్పటంలేదుగా."

"అబద్ధమనికాదు.. యీనాడు యీ మనిషితో కాపురం చెయ్యలేక ఒకభార్య ఆత్మహత్య చేసుకుని, ఒకభార్య లేచిపోయి ...." అంటుంటే కల్పించుకుని–

"శ్యామ్ . .. జోక్‌కు కూడా ఒక లిమిట్ వుంటుంది డోంట్‌గో బియాండ్‌దట్ లిమిట్ ప్లీజ్"

"సుధా. . నా భార్య లేచిపోయిందని చెప్పుకోడం నాకు ప్రిస్టేజికాదు . నా అహానికి తృప్తి యివ్వదు. జోక్‌గా చెప్పుకోడానికి!

నా బాధను ఎందుకు అర్థం చేసుకోరుమిరు? .

అయినా షాపింగుకని బయలుదేరిన యిల్లాలు నేను యిల్లొదిలి వెళ్ళిపోతున్నాను వెతకద్దని వుత్తరం రాసిపెట్టి మటుమాయమైతే దానికి మికు యిబ్బంది కలిగించని మరేదన్నా పర్యాయపదాలుంటే తెలుగులో చెప్పండి. . అదేవాడుతాను" అన్నారు సుధ వైపుచూస

ఆ గొంతు చాలా కటువుగా, ఆ మాటలు చాలా పదునుగా వున్నాయి ఆ




తర్వాత లక్ష్మివైపు తిరిగి,

'లక్ష్మి. పోనీ నువ్వైనా చెప్పగలవా మరోమాట " అన్నారు .

లక్ష్మి నిముషంసేపు మాట్లాడలేదు మౌనంగా భోజనం చేస్తూంటే డాక్టరుగారు యింకా తనవైపే ప్రశ్నకు జవాబు చెప్పవేమిటన్నట్టు చూస్తుంటే నెమ్మదిగా తలెత్తి అన్నది–

"డాక్టరుగారూ... భర్తను, తనదైన యింటిని ఏ యిల్లాలూ వదిలి పెట్టదు పిచ్చిదయితే తప్ప అందులోనూ ఆదరం చూపె భర్తను ఏ కొదువాలేని కాపురాన్ని వదిలేసి వెళ్ళిపోయిందంటే ఏదో మహా బలవత్తరమైన కారణం వుండి వుంటుందేమో... "

"నా భార్యను నువ్వెరుగుదువా?" సూటిగా వచ్చింది ప్రశ్న

ఒక్క తృటికాలం ఆగి–

"ఈ మాత్రందానికి మి భార్య తెలిసుండాల్సిన పనిలేదు డాక్టరుగారు ... ఆడవాళ్ళనై వుండి ఆడవాళ్ళ మనసును అర్థం చేసుకోడానికి పరిచయమే వుండక్కరలేదు " అనేసి కంచంలో మజ్జిగ పోసుకుని తాగేసి లేచి వెళ్ళిపోయింది లక్ష్మి..

ఆ తర్వాత ఎవ్వరూ మాట్లాడలేదు.

లక్ష్మి వంటయింట్లో పని చూసుకుంటుంటే డాక్టరమ్మగారు వెళ్ళి శ్యామసుందర్ గారితో మాట్లాడుతూ కూర్చున్నారు (ఇంకా ఉంది)

## వ్యక్తిగతం



ఓలె సోయిన్‌కా (52)కి ఈ ఏడాది సాహిత్యంలో నోబెల్ బహుమతి లభించింది. ఆఫ్రికా ఖండం నుంచి ఈ బహుమతిని అందుకున్న మొట్టమొదటి వ్యక్తి ఈయన. సోయిన్‌కా ప్రముఖ కవిగా, నవలాకారునిగా, నాటక రచయితగా, విమర్శకుడిగా పేరు పొందారు. ఇంగ్లాండ్‌లోని లీడ్స్ విశ్వవిద్యాలయంలో పట్టా పొందిన ఈయన తమ మాతృదేశం దాస్య శృంఖలాల నుంచి విముక్తం అయిన వెంటనే నైజీరియాకి 1960 లో తిరిగి వెళ్ళిపోయారు. అక్కడ ఆయన ఒక నాటక బృందాన్ని నెలకొల్పి గుర్తింపు పొందారు. బయాఫ్రా కోసం పోరాటం సాగించిన వారికి సహాయపడినందుకు ఆయనని 1967 లో జైలులో పెట్టారు. పోయమ్స్ ఫ్రమ్ ది జైల్" ని 1969 లో వెలువరించటానికి ఆయన రెండేళ్ల జైలు జీవితం ఉపయోగపడింది. నైజీరియాలోని మూడు విశ్వవిద్యాలయాలలో ఆయన బోధించారు. ఇప్పుడు ఆయన సుప్రసిద్ధులైన కవులలో ఒకరు. □



ఈ ఏడాది నోబెల్ శాంతి బహుమతి అమెరికాలో స్థిరపడిన 58 సంవత్సరాల యూదు ఎలీ వీసెల్‌కి లభించింది. ఈయన కూడా ప్రసిద్ధ నవలా రచయితే. నాజీల మారణహోమంలో ప్రాణాలతో బయట పడిన వారిలో ఈయన ఒకరు. యుద్ధానంతర కాలంలో మానవ హక్కుల కోసం పాటు పడిన వారిలో అగ్రగణ్యుడు. రొమేనియాలోని ఒక చిన్న పట్టణం సిగెహెట్‌లో జన్మించిన ఈయన నాజీల ఊచకోతలో తమ తల్లిదండ్రులని, ముగ్గురు చెల్లెళ్లని కోల్పోయారు. 14 నెలల పాటు కాన్‌సన్‌ట్రేషన్ శిబిరాలలో చిత్రహింసలకి గురైనారు. ఆ శిబిరంలో తమ తొలి రాత్రి జీవితంలో మరువలేనంత భయంకరమైనదని ఆయన తమ మొదటి పుస్తకం 'నైట్'లో వివరించారు. కొంత కాలం ఏ దేశానికి చెందని వ్యక్తిగా ఉండి తర్వాత ఫ్రాన్స్‌కి, అనంతరం ఇస్రాయెల్‌కి వెళ్లారు. 1956 లో ఒక ఇస్రాయెల్ వార్తాపత్రికలో చేరారు. అయిక్యరాజ్య సమితి వార్తలని సేకరిస్తూ ప్రమాదానికి గురై దాదాపు ఒక ఏడాది పాటు చక్రాల కుర్చీకి అంకితమై పోయారు. ఆ సమయంలో ఆయన ఫ్రెంచి రవాణా పత్రాల పునరుద్ధరణ జరగకపోవటంతో అమెరికా పౌరసత్వాన్ని స్వీకరించి అక్కడే స్థిరపడ్డారు.... □

## వారఫలం

**14-11-1986 శుక్రవారం మొదలు**
**20-11-1986 గురువారం వరకు**

★ **మేషం :** అధికారమందు పెంపు ఆదాయమందు మేలు. వృత్తియందు హాయి. నూతన వ్యాపారమందు నూతనోత్సాహం. కళారంగాన ప్రసిద్ధి, పత్రికా నిర్వహణమున అనుకూలం గల వారం. సత్ఫల దాయకం. నటనయందు చాతుర్యమున్న వారికి మేలు. స్త్రీలకు : ఆనందదాయక వారం.

★ **వృషభం :** ఈ వారం నూతనోత్సాహం మీలో వెల్లివిరిస్తుంది. కార్యాచరణమునకు లోపంలేదు. ఏవో చేయని తప్పులు నెత్తిపై వేసుకోవలసి వస్తుంది. ముఖ్య బంధువులు అనుకోకుండా యింటికి రానున్నారు. ఏదో కారణంగా అయిన వారితో తెగతెంపులు చేసుకోవలసి వస్తుంది. స్త్రీలకు : ఇంటా బయటా యిబ్బందులుంటాయి.

★ **మిధునం :** రాజకీయ వాతావరణం మీకు విసుగు జనింపజేస్తుంది. విద్యా విధానాన నిరుత్సాహత చేకూరుతుంది. స్థితిగతులయందు కొంత అనానుకూలం చేకూరుతుంది. అప్రయత్నంగా ధనం అందుతుంది. 'లాటరీ' లందు ఈ రాశికి అనుకూలత హెచ్చు. స్త్రీలకు : వృత్తియందు రాణింపు, కృషియందు పెంపు.

★ **కర్కాటకం :** రాజకీయంగా మీరు వేసిన ఎత్తులు సఫలంగావు. అనుకొనేదొకటి, అయ్యేది మరొకటి. కళారంగాన అవకాశాలు చిక్కినట్లే చిక్కి మాయమవుతాయి. ఉద్యోగరీత్యా అనుకూల సమయం అని గ్రహించాలి. కృషి చెయ్యాలి. సత్ఫలం పొందాలి. స్త్రీలకు : తీవ్రంగా కళారంగాన కృషి చేస్తే మేలు.

★ **సింహం :** విద్యా విధానం పెంపుగల వారం. విశిష్ట వస్తు సేకరణకు అవకాశం. రాజకీయంగా అనుకూలం. గృహ నిర్మాణాదులయందు శ్రద్ధ. ప్రభుత్వ పరంగా రావలసిన డబ్బు అందుటకు అవకాశం ఉన్నది. స్త్రీలకు : ఉద్యోగ సంపాదనకై చేసిన యత్నాలు కొందరకు సత్ఫలితాలనిస్తాయి. శుభ వార్తా శ్రవణం. ధన విషయంగా అనుకూలం.

★ **కన్య :** ఉపయుక్తమయిన వార్తలు వింటారు. కొందరకు ఉద్యోగరీత్యా అనుకూలం. కొందరకు స్థిరాస్తియందు పెంపు. కొందరకు దూరభారాలకు పోగల అవసరం. ముఖ్య బంధువులను కలిసికొనవలసిన అగత్యం ఏర్పడుతుంది. స్త్రీలకు : వ్యక్తిగతంగా మీరు మంచిగా ఉన్న, ఏవో సంఘపరమైన నిందలు నెత్తికెక్కనున్నవి. గమనించాలి.

★ **తుల :** విధి విరామం ఎరుగని కృషి చేయవలసి వస్తుంది. అయినా ప్రయోజనం అంతంత మాత్రమే. రాజకీయవాదులకు మేలుగాదు. ఇటువంటి పరులకు మీరు యిచ్చిన డబ్బు తిరిగిరాదు. 'పరహస్తం గతం గతః' అనిగదా పెద్దల వచనం. స్త్రీలకు : ఉద్యోగరీత్యా పెంపు.

★ **వృశ్చికం :** చుట్టుప్రక్కల వారితో గొడవలు రాకుండా చూచుకొండి. అనవసరంగా మాట్లాడుట మానుకొండి. వ్యవహారం అనుకూలం గాదు గాన వృధాగా శ్రమించకండి. లేనిపోని వ్యవహారాలు నెత్తికి రాకుండా చూచుకొండి. స్త్రీలకు : కళారంగాన, రచనా విధానాన, పత్రికా రంగాన సదవకాశాలు కొందరకు లభ్యం కాగలవు.

★ **ధనుస్సు :** దూర బంధువులు, మిత్రులు హఠాత్తుగా యింటికి రాగలరు. ధనవంతుల మైత్రి శ్రేయోదాయకం. రాజకీయంగా ఎలాంటి ఎత్తులు ఎత్తకండి. కాలం కలిసిరాలేదు. అధిక వ్యయ సూచిత వారం. గృహమున తల దిమ్మెత్తించే వ్యవహారాలుంటాయి. గమనించండి. స్త్రీలకు : సర్వవిధాలా అనుకూలం, ధనలబ్ధి.

★ **మకరం :** హితులెవరో, అహితులెవరో తెలిసికొని వ్యవహరించండి. మంచి చెడుగుల గమనించి మెలగండి. ఉత్తముల సలహాలనే పాటించి మెలగండి. స్తోత్ర పాఠకులు అదే పనిగా చుట్టూ చేరుతారు. గమనించి మెలగండి. స్త్రీలకు : ఉద్యోగరీత్యా మేలు. అయినవారి వలన మేలు. ఆదాయమందు పెంపు. ఉత్సాహవంతమైన వారం.

★ **కుంభం :** ఉద్యోగ వృత్తులందు అనుకూలం. నూతన వ్యక్తుల సహవాసం, సాహచర్యాలు లభిస్తాయి. ఒకానొక విషయం నెరవేరిన తరువాత 'ధనమూల మిదం జగత్'- అని గ్రహిస్తారు. చెప్పదగినంత ఆదాయమున్నది. స్త్రీలకు : శ్రద్ధాసక్తులతో, ఒకానొక కుటుంబ వ్యవహారం చక్కజేసుకొగలుగుతారు. ఆదాయమున్నది.

★ **మీనం :** కారణమేమోగాని, కొందరతో బహు కఠినంగా మాటలాడవలసి ఉంటుంది. ఆదాయమందు హెచ్చుతగ్గులుంటాయి. అనుకూలురు, అనుకోకుండా అవొలాగు తిరుగుతారు. బ్రతిమలాడి, భంగపడి మీ నుండి డబ్బు తీసుకొని వెళ్లినవారు తిప్పి తిప్పిగాని యివ్వరని గ్రహిస్తారు. స్త్రీలకు : రాజకీయంగా అనుకూలం. నటనలో ప్రావీణ్యత గలవారికి, సంగీతమందు ప్రావీణ్యత గలవారికి మేలు.

- విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

# ‘బంగారు బాలిక’ పి. టి. ఉష దైవభక్తి

మన అందరివలె క్రీడాకారులకు కూడా దైవభక్తి ఎక్కువ. పోటీలలో పాల్గొనునప్పుడు విజయము కొరకు తమ ఇష్టదైవమువద్ద మ్రొక్కుకొనుట అలవాటు. మన ‘బంగారు బాలిక’ పి. టి. ఉష సియోలు ఆసియా క్రీడలలో పాల్గొనుటకు ముందు, తన ఇష్టదైవం గురువాయూరప్పన్ స్వామి ఆలయమునకు వెళ్ళి విజయము లభించాలి అని మ్రొక్కుకొన్నది. కేరళలో కుగ్రామం అయిన పయోలికి చెందిన పి. టి. ఉషకి త్రిచ్చూర్‌వద్ద గల గురువాయ్యూర్ గుడికి వెళ్ళటం అలవాటు. తనకు క్రీడా పోటీలలో పతకములు లభించినప్పుడల్లా ఈ గుడికి వెళ్ళేది. జకర్తా ఆసియా ఎథలిటిక్ క్రీడా పోటీలలో అఖండ విజయం పొంది, ప్రశంసలు అందుకున్న ఉష తాను సాధించిన బంగారు పతకములలో ఒకటి గురువాయ్యూర్ గుడికి యిచ్చినది. అంతకు ముందు ఒకసారి బంగారు స్పైయిక్ (మేకు) గల తన జోడు బహూకరించినది. ఈ సారి ఆసియా క్రీడలలో పాల్గొనుటకు సియోలు వెళ్ళిక ముందు గురువాయ్యూరు గుడి సాంప్రదాయం ప్రకారం మ్రొక్కుకున్నది. ఆ గుడి సాంప్రదాయము ప్రకారం మనోసిద్ధికై ‘చుట్టూ విల్లాక్కు’ అంటే గుడిచుట్టు ఒకరోజు నూనె దీపాలు వెలిగించాలి. రెండవది తన బరువుకు సమానముగా ఏదైన తూచి దేవతకు సమర్పించుకోవటము పి. టి. ఉష సియోల్‌లో స్వర్ణ పతకములు సాధించిన తర్వాత స్వదేశము రాగానే త్రిచ్చూరు సమీపమున గల గురువాయ్యూరు గుడికి వెళ్లి తన పేర ఒకరోజు గుడిచుట్టూ దీపములు వెలిగించుటయేగాక, పంచదారతో ‘తులాభారము’లో 57 కేజీలు పంచదార రాగా దానిని దైవమునకు సమర్పించినది. అంతేగాక ఉష తాను సాధించిన స్వర్ణపతకముల నమూనాలను గుడికి సమర్పించే ఆలోచన కూడా గలదట.

పి. టి. ఉష, ఆమె కోచ్ ఓ. ఎమ్. నంబియార్, మరొక ‘బంగారు బాలిక’ షైనీ అబ్రహం, త్రిచ్చూరుకు చెందిన, వాలీబాల్‌లో కాంస్య పతకము గెల్చిన సిరిల్ వల్లూర్ దైవసందర్శనకు వెళ్ళినప్పుడు త్రిచ్చూరు ప్రజలు ఘనస్వాగతము పల్కారు. ఇంటి కప్పులపై నుండి పూలవర్షము జీపులో ప్రయాణము చేయుచున్న పతక విజేతలపై కురిపించారు. అనేకకార్లు, మోటారు సైకిళ్లపై అభిమానులు వెంట వచ్చారు. ప్రాచీన కేరళ ‘పంచవద్యము’ పద్ధతిలో స్వాగతము లభించింది. ఆలయ ఏనుగులు పూలహారములతో స్వాగతం పల్కగా, బాణసంచా నగర ప్రవేశ సమయములో కాల్చబడినది. స్థానిక పాఠశాలల ఎన్. సి. సి. క్యాడెట్స్, విద్యార్థులు ఊరేగింపులో పాల్గొన్నారు.

ఆలయ పెద్దలు బంగారు లాకెట్లను అందరికి బహూకరించారు. కేరళ క్రీడాశాఖమాత్యులు


పి. టి. ఉష తులాభారం

వెల్యాయుద్ధన్ తిరువేంద్రములో సింథటిక్ ట్రాక్ రాష్ట్ర ప్రభుత్వము ఏర్పాటు చేయనున్నదని ప్రకటించారు. మన అగ్రగామి ఎథలిటిక్స్‌కు పుట్టినిల్లు అయిన కేరళలో రాష్ట్ర ప్రభుత్వము విజేతలకు నగదు బహుమతులు యిచ్చి గౌరవించటమేగాక అనేక సౌకర్యములు ఏర్పాటు చేయుటకు హామీ యిచ్చింది.

మన రాష్ట్రమునకు చెందిన విజయనగరజిల్లా వాసి జయరాం బాక్సింగ్‌లో రజిత పతకము, వాలీబాల్‌లో ముగ్గురు కాంశ్య పతకములు సాధించి రాగా వారికి కనీస, గుర్తింపు ప్రజలు, ప్రభుత్వము, క్రీడా సమాఖ్యల నుండి లభించక పోవుట విచారకరము

–ముకరమ్




కాకీ ఫేంటులో తెల్లషర్టు టక్ వేసుకున్నాడు, రాజారావు పేరుకి తెల్లషర్టే గాని, అక్కడక్కడ ముక్కు పొడుం మచ్చలతో, బాగా మాసిపోయి వుంది ఫేంటు కూడా యెన్నాళ్ళ క్రితమో యిస్త్రీ చేసినట్టుంది అతని దళసరి కళ్ళద్దాలు, ముక్కు మిదికి జారి వున్నయ్ అతణ్ణి చూస్తే, యెవ్వరూ 'ఆఫీసరు' అనుకోరు

కాని, రాజారావు ఆఫీసరు అతనా అంతస్తుకి యెలా వచ్చాడూ అన్నది వేరే విషయం!

అతని అంతస్తుకి తగ్గ వస్త్రధారణలో రాజారావుకి శ్రద్ధ లేదు ఆసక్తి అంతకంటె లేదు అతనికున్న ఆసక్తంతా ఒక్కటే – ధనార్జన! ధనార్జన కోసం అతను తొక్కని మార్గాలుండవు ఓ రూపాయి ఖర్చు చెయ్యడమంటే, అతనికి బ్లడ్‌ప్రెషర్ పెరుగుతుంది

అటువంటి రాజారావుకి, ఆఫీసు పని మీద కలకత్తా కోర్టుకి వెళ్ళాల్సిన చాన్సు వచ్చింది అయితే, కలకత్తా వెళ్ళాలంటే, డబ్బుతో పని తనకెలాగూ ఓ గుమస్తా సహాయం అవసరం గనక, యెవర్ని తీసుకెళ్ళాలా అన్న ఆలోచనల్లో పడ్డాడు అతని మస్తిష్కంలో చప్పున కాళిదాసు మెదిలాడు

కాళిదాసు, బాగా డబ్బున్నవాడు పైగా నాలుగు డబ్బులు జల్సాగా ఖర్చు బెట్టగలవాడు అతణ్ణి తన వెంట కలకత్తా తీసుకువెళ్తే, తనకి లాభసాటిగా వుంటుందనుకున్నాడు, రాజారావు వెంటనే కాళిదాసుకి కబురు పంపించాడు

ఆఫీసరు పిలుస్తున్నాడనగానే, పరుగు నడకలో వెళ్ళాడు, కాళిదాసు

'నమస్కారం సార్ ' సవినయంగా అన్నాడు, కాళిదాసు

"నమస్కారం " కళ్ళద్దాలు సర్దుకుంటూ అన్నాడు, రాజారావు

"కబురు పంపించారుట. " నసిగాడు, కాళిదాసు

"ఔనోయ్ కలకత్తా కోర్టుకి వెళ్ళాలి ఆఫీసు పని మీద నాతో పాటు ఓ నమ్మకస్తుణ్ణి, స్మార్ట్‌గా వుండేవాణ్ణి తీసుకు వెళ్దామనుకుంటున్నాను ఎవర్ని తీసుకు వెళ్దామా అని ఆలోచిస్తుంటే, నువ్వు నా మనసులో మెదిలావు ఈ అవకాశాన్ని, నీకు యిస్తున్నాను. మనం రేపే బయల్దేరాలి రిజర్వేషను గురించి నువ్వేం కంగారు పడకు నేను చేయిస్తాలే కలకత్తా కాస్ట్లీప్లేసు అయినా, వెళ్ళక తప్పదు కదా! పైగా ట్రావెలింగు అలవెన్సు దొరుకుతాయి అన్నాడు, రాజారావు

కాళిదాసు వుప్పొంగి పోయాడు డ్యూటీ మీద కలకత్తా వెళ్తే బాగానే టి ఏ డబ్బులు కిట్టుబాటవుతాయి పైగా, యేవైనా వస్తువులూ కొనుక్కోవచ్చు. అనుకున్నాడు

"థాంక్స్ సార్! మి అభిమానానికి కృతజ్ఞుణ్ణి.' అన్నాడు, మురిసిపోతూ

తన పాచిక పారినందుకు, లోలోన సంతోషించాడు, రాజారావు

"రేపు కోరమండల్‌కి వెళుతున్నాం, గుర్తుంచుకో! నేరుగా స్టేషనుకి వచ్చేయ్ "

'అట్లాగేనండి!" కృతజ్ఞతా పూర్వకంగా నమస్కరిస్తూ, నిష్క్రమించాడు, కాళిదాసు

రాజారావు, తనలో తనే నవ్వుకుని, ముక్కు పొడుం డబ్బా తీసి, ఓ పట్టు పట్టించాడు .

* * * *

రాజారావు, కాళిదాసు, కోరమండల్లో బయల్దేరారు ఇద్దరికి ఒకే చోట రిజర్వేషను చేయించాడు, 'రాజారావు. ఆ రాత్రి హాయిగా నిద్రపోయారు

తెల్లవారింది కాలకృత్యాలు ముగించుకొని, యిద్దరూ రెడి అయ్యారు

"కేటరింగు బేరర్‌కి చెప్పవోయ్ దాసూ, మనిద్దరికి టిఫిను, కాపీ తీసుకు రమ్మని ." అన్నాడు, రాజారావు

అప్పుడే చెప్పేశానండీ! వచ్చేస్తూ వుంటాడు " చిన్నగా నవ్వుతూ అన్నాడు, కాళిదాసు

రాజారావు, మందహాసం చిందించాడు "ఇలా వుండాలోయ్ హుషారంటేను! ఇదే, నీకూ మిగిలిన వాళ్ళకి తేడా!" నవ్వుతూనే కాళిదాసుని ఓ మెట్టు పైకెత్తాడు

అదే సమయంలో టిఫను, కాఫీ, పట్టుకుని రానే వచ్చాడు బేరర్ రాజారావు, కాళిదాసు, టిఫిను తీసుకుని, కాఫీ త్రాగారు

బేరర్ వచ్చి, బిల్లు యిచ్చాడు రాజారావు హుందాగా పర్సు తీసి, నూరు రూపాయల నోటు అందివ్వబోయాడు

"అంత చిల్లర యెక్కడుంటుంది సార్?" అన్నాడు, బేరర్

రాజారావు, ఆ నోటుని పర్సులో పదిలంగా దాచేస్తూ–

"కాళిదాస్,, నువ్వు యిచ్చేయవోయ్ బిల్లు, తర్వాత మనం చూసుకుందాం అన్నాడు

కాళిదాసు మారు మాటాడకుండా, బిల్లు చెల్లించాడు

బేరర్ వెళ్ళిపోయాడు

హౌరా స్టేషనొచ్చింది రాజారావు, కాళిదాసూ దిగారు నేరుగా వెయిటింగ్ రూమ్‌కి వెళ్ళి స్నానం ముగించి, క్లోక్‌రూమ్‌లో సూట్‌కేసుల్ని పడేశారు కోర్టు కేసు ఫైలు మాత్రం కాళిదాసు చేతిలో వుంది

"ఇప్పటికే చాలా వేళయ్యిందోయ్ కాళిదాస్! ఒంటిగంటకంతా మనం కోర్టులో వుండాలి లేకపోతే, మన కేసు అడుక్కి పోతుంది బస్సులూ అవీ రద్దీగా వుంటాయి లాంచీలో వెళ్తే, అక్కణ్ణించి నడవాలి మళ్ళీ అంచేత, టాక్సీ చేయించుకుందామోయ్ " అన్నాడు, రాజారావు

"అట్లాగేనండీ!' అంటూ టాక్సీ స్టాండు దగ్గరికెళ్ళి టాక్సీ చేయించాడు, కాళిదాసు

హైకోర్టు ముందే ఆగింది టాక్సీ రాజారావు నూరు రూపాయల నోటు తీశాడు

"అంత చిల్లర మా దగ్గరెక్కడిదండీ?" హిందీలో అంటూ చిన్నగా నవ్వేడు టాక్సీ డ్రైవర్

ఆ నోటుని మళ్ళీ పదిలంగా పర్సులో పెట్టేశాడు, రాజారావు

'కాళిదాసూ, విన్నావు కదా, చిల్లర లేదట నువ్వు యిచ్చేసెయ్ తర్వాత చూసుకూదాం" అన్నాడు, రాజారావు

'అలాగేనండి!' బేరమాడిన మేరకు టాక్సీ బాడుగ యిచ్చేశాడు, కాళిదాసు

కోర్టు అటెండెన్స్ అయ్యింది, కేసు వచ్చే నెలకి వాయిదా పడింది

రాజారావు, కాళిదాసు, కోర్టు ఆవరణ నించి బైట పడ్డారు రాజారావు, ముక్కుపొడుం తీసి పీల్చాడో సారి 'ఆఁ గొప్ప ఆకలేస్తోందోయ్ దాసూ! ఎందుకెయ్యదూ! మనం యేం టిఫిను చేశాం గనక? మన సౌత్ యిండియన్ మీల్సు యిక్కడో చోట దొరుకుతుంది. పోదాం. పద. అంటూ దారి తీశాడు, రాజారావు

హోటల్లోకి అడుగుబెట్టి, ఓ టేబిలు ముందు కూచున్నారిద్దరూ

"దాసూ, మీల్సు టిక్కెట్లు రెండు తీసుకోవోయ్ తర్వాత చూసుకుందాం " రాజారావు అన్నాడు

కాళిదాసుకి, రాజారావు పద్ధతేవీఁ నచ్చలేదు నూరు రూపాయల నోటుకి హోటల్లో చిల్లర దొరక్క పోతుందా? తప్పకుండా దొరుకుతుంది. తీసుకుంటే, యేం పోయింది? అనుకున్నాడు మనసులోనే అయితే, తన మనసులోని భావాల్ని బైటికి వెళ్ళగక్క లేకపోయాడు అప్పరాల్, రాజారావు గారు తన బాస్ అనుకున్నాడు

"మనకి మద్రాసు మెయిలు, సులువుగా దొరుకుతుందోయ్ దాసూ! ఏమైనా పర్చేజ్ చేస్తావా?' అడిగాడు, రాజారావు

నిజానికి, యేవో కొన్ని వస్తువులు కొనాలనే అనుకున్నాడు, కాళిదాసు. కాని, రాజారావు పద్ధతి




చూస్తుంటే, తనేం కొంటే, అతనూ అదే కొనమని చెప్పేలా వున్నాడనిపించి, ఆ తలంపుకి తిలోదకాలిచ్చేశాడు

"అబ్బే! యిప్పుడేమీ కొనదల్చుకో లేదండీ! ఈ సారొచ్చినపుడు చూద్దాం' అనేశాడు, కాళిదాసు

• రాజారావు మొహంలో నిరుత్సాహం చోటు చేసుకుంది అయినా, మరేమి అనలేకపోయాడు. కాస్తంత దూరం యిద్దరూ నడిచారు.

అప్పటికి నాలుగ్గంటలవుతోంది సాయంత్రం ఎండ తీవ్రత తగ్గు ముఖం పడుతోంది

ఫుట్‌పాత్ మీద మాంచి అరటిపళ్ళు అమ్ముతున్నారు రాజారావు దృష్టి, వాటి మీద పడింది.

"దాసూ, యెంత బావున్నాయోయ్ అరటి పళ్ళు! ఎలా యిస్తున్నాడో అడుగు ,"

కాళిదాసు వెళ్ళి అడిగాడు.

"డజను ఆర్రూపాయలట సార్!' చెప్పాడు కాళిదాసు

"ఆర్రూపాయలైతేనేం? ఎంత నదురుగా వున్నాయని? ఒక్క అరటి పండు తింటే చాలు, కడుపు నిండి పోతుంది కలకత్తా వచ్చాక, వట్టి చేతులో వెళ్ళ కూడదోయ్ ఏదో తీసుకెళ్ళాలి. ఓ రెండు డజన్లు తీసుకో " కళ్ళద్దాలు సర్దుకుంటూ అన్నాడు, రాజారావు

"అంటే, మీకో డజనూ, నాకో డజనాండీ?' యీ సారి కాస్త జాగ్రత్త పడినట్టుగా ప్రశ్న వేశాడు. కాళిదాసు



"నువ్వూ కొనాలనుకుంటే, మరో రెండు డజన్లు తీసుకో వోయ్. మళ్ళీ మళ్ళీ దొరుకుతాయా యిల్లాంటివి చెప్పు ."

కాళిదాసు గుండె గుభేలు మంది. వీటికీ నూర్రూపాయల వోటే చూపిస్తాడేమిటి చెప్మా..

అనుకున్నాడు మనసులో.

"సంచి లేదుకదా సార్?" చిన్న పొడి వేశాడు.

ఈ విషయాల్లో రాజారావు చాలా జాగ్రత్తగా వుంటాడని కాళిదాసుకి తెలీదు పాపం. అందుకే, ఆ పొడి వేశాడు.

"ఇదిగోనోయ్, నేను తెచ్చానులే సంచీ..... " అంటూ ఫెంటు జేబుల్లోంచి తీశాడు రాజారావు ఓ సంచీ.

ఆశ్చర్య పోయాడు, కాళిదాసు. రాజారావు, ముందుగానే ప్లాను వేసుకుని వచ్చినట్టు అర్థం చేసుకున్నాడు. నాలుగు డజన్ల పళ్ళు తీసుకుని సంచిలో వేశాడు.

"మొత్తం యిరవై నాలుగు రూపాయలయ్యింది సార్!" అన్నాడు. నూరు రూపాయల నోటు చూపిస్తే. చిల్లర తీసుకుందామని, కాళిదాసు వుద్దేశం. కాని–

"నూర్రూపాయల నోటుకి వాడి దగ్గర చిల్లర వుండదు లేవోయ్. నువ్వు యిచ్చేసెయ్. తర్వాత చూసుకుందాం." అన్నాడు, రాజారావు.

కాళిదాసుకి యేడుపొచ్చినంత పనయ్యింది. కాని, యేడవలేదు. ఏం జేస్తాడు? తానూ, అతనిలా నూర్రూపాయలనోటే చూపిస్తే బావుండును. కాని, చిల్లరనోట్లు మార్చి తెచ్చినట్టు గురుడుకి తెలుసునాయె. మరో మార్గం లేక, యిరవై నాలుగు రూపాయలూ యిచ్చేసి సంచి పట్టుకున్నాడు, కాళిదాసు.

"టాక్సీ?" అంటూ రాజారావే కేకవేశాడు.

టాక్సీ వచ్చి ఆగింది.

"హౌరా స్టేషనుకి పోనియ్యి..... " హిందీలో చెప్పాడు రాజారావు.

ఇద్దరూ కూర్చున్నారు. హౌరా వచ్చేశారు, కొన్ని నిమిషాల్లో.

"దాసూ..." దిగుతూ అన్నాడు, రాజారావు.

"టాక్సీ బాడుగ యిచ్చేస్తా లెండి సార్!" అతని అభిప్రాయం కనిపెట్టి, తనే సమాధానం చెప్పాడు, కాళిదాసు. .

పర్సులోంచి ఆర్రూపాయలు తీసి డ్రైవరుకి అందించాడు. టాక్సీ వెళ్ళిపోయింది.

"అబ్బ! ఎంత యెండగా వుందోయ్ దాసూ.... " అన్నాడు, రాజారావు.

"చెప్పాలంటే, యెండ తీవ్రత తగ్గిందండీ."

"తగ్గిందనుకో! అయినా, విపరీతంగా దాహమేస్తోంది. నాలుక, పిడచ గట్టిందనుకో! ఇక్కడ మంచినీళ్ళు వుప్పగా వుంటాయి, అంచేత, లిమ్కా కూల్‌డ్రింకు తీసుకుందాం పద..... " కూల్ డ్రింక్స్ స్టాల్ కేసి దారితీశాడు, రాజారావు. అతణ్ణి అనుసరించక తప్పలేదు కాళిదాసుకి.

"దో లిమ్కా దీజియే..... " రాజారావే ఆర్డరిచ్చాడు.

చల్లగా వున్న లిమ్కా చెరోటి తీసుకున్నారు. "హమ్మయ్య! ఇప్పుడు కాస్త హాయిగా వుంది. డబ్బులిచ్చేసెయ్ దాసూ! తర్వాత చూసుకుందాం.... "అదేపాట పాడాడు, రాజారావు.






ఒకని జెరిచెదమని యుల్లమందెంతురు
తమదు చేటెఱుగరు ధరను నరులు
తమ్ము జెఱుచువాడు దైవంబుగాడొకో
విశ్వదాభిరామ వినురవేమ.

## నూర్రూపాయల నోటు

కాళిదాసు, యేం చెయ్యగలడు గనక? రెండు టిక్కెట్లకి డబ్బులిచ్చేశాడు

కాస్సేపు వెయిటింగు రూమ్‌లో విశ్రాంతి తీసుకున్నాక, క్లోక్ రూమ్ నించి సూట్‌కేసుల్ని తెచ్చుకుని, సాయంత్రం టిఫెనుకి బయల్దేరారు యిద్దరూను

పొరాటా, కూర, తీసుకుని, లస్సీ త్రాగారు 'బిల్లు చెల్లించేయ్ దాసూ! మనం తర్వాత చూసుకుందాం'.

కాళిదాసుకి వొళ్ళు మండి పోతోంది కాని యేమీ అనలేక పోతున్నాడు బిల్లు చెల్లించాడు

ప్లాట్ ఫారమ్మీదికి వచ్చేశారు మెయిల్లో రెండు బెర్తులు రిజర్వేషను దొరికింది

ఆ రాత్రి హాయిగా నిద్రపోయారు బండిలో

తెల్లారాక, పలాసాలో టిఫను, కాఫీ ముగించారిద్దరూ వాటి బిల్లు కూడా కాళిదాసే చెల్లించాడు

వాల్తేరులో దిగాక అన్నాడు రాజారావు కాళిదాసూ, మన ట్రిప్పు హాయిగా సాగిందోయ్ నీలాటివాడు వెంట వుంటే, యిబ్బంది అంటూ యేమీ వుండదు ఖర్చంతా యెంతయ్యిందో, రాసి యివ్వు రేపు నూర్రూపాయల నోటు మార్చి యిచ్చేస్తాను అని

"అలాగేసార్!" సవినయంగా అన్నాడు కాళిదాసు

కాళిదాసు తన రెండు డజన్ల అరటి పళ్ళు తీసుకుని.

మరి, వస్తానుసార్! బస్సులో వెళ్ళి పోతాను యింటికి" అన్నాడు

రాజారావు సన్నగా నవ్వేడు

ఇంత పిసినారి వెప్పుడయ్యావోయ్? రైలు ప్రయాణం చేశాక, బస్సులో ప్రయాణం చెయ్యడం, అంత సుఖమనుకుంటున్నావా? హాయిగా ఓ ఆటో యేర్పాటు చెయ్యి మా యింటి దగ్గర నన్ను డ్రాప్ చేసి, నువ్వెళ్ళి పోదువుగాని " అన్నాడు

కాళిదాసు, మరేం మాట్లాడలేక పోయాడు ఆటో యేర్పాటు చేసుకుని, యిద్దరూ బయల్దేరారు

* * * * *

మర్నాడు కాళిదాసు ఆఫీసుకొచ్చి నపుడు, రాజారావు ఖర్చంతా ఓ కాగితం మీద రాసి, అతని కిచ్చాడు ఆ కాగితం వేపు కాస్సేపు చూశాడు, రాజారావు ఏదో తాను మాట వరుసకి చెప్పినా, కాళీదాసు రాసిస్తాడని అతనూహించలేదు.

సరేలేవోయ్ దాసూ! నూర్రూపాయల నోట్లు మార్చి యిస్తాలే' అన్నాడు

కాళిదాసు అప్పటికి వెళ్ళిపోయాడు

రాజారావు అలా అనేశాడే గాని, కాళిదాసుకి ఆడబ్బు యివ్వనే లేదు

కాళిదాసు అడగనూలేదు నలుగురు స్నేహితులతో చెప్పుకుని బాధపడ్డాడు మరిచి పోలేని ఆ అనుభూతులే అతనికి మిగిలినయ్

* * * * *

మరి కొద్ది రోజుల తర్వాత, కాళిదాసుని పిల్చాడు, రాజారావు

'మళ్ళీ కలకత్తా వెళ్ళాల్సి వుందోయ్ దాసూ! నీ పేరే నేను సజెస్టు చేస్తున్నాను' చెప్పాడు రాజారావు

కాళిదాసుకి షాక్ తగిలినట్టయ్యింది రాజారావు వెంట వెళ్ళడం అతనికి యిష్టం లేకపోయింది

నాకు, వీలుపడదు సార్!' ముక్తసరిగా అన్నాడు.

"ఏం? యీసారి షాక్ తినడం, రాజారావు వంతయ్యింది

ఏం కారణం చెప్పాలో, చప్పున తట్టలేదు కాళిదాసు మెదడుకి ఏదో చెప్పాలిమరి'

మా ఆవిడకి డెలివరీ టైమ్ సార్' అంచేత రాలేను

అబద్ధం చెప్పాడు, కాళిదాసు

రాజారావు మరేం అనలేక పోయాడు

"అలాగా! సరేలే! ఇంకెవరినో తీసుకెళ్తా ..

నీరసంగా అన్నాడు, ముక్కుపొడుం పీలుస్తూ.

బ్రతుకు జీవుడా, అనుకొని బైట పడ్డాడు, కాళిదాసు ఆ నాటి సంఘటనలన్నీ అతని మెదడులో గిర్రున తిరిగినయ్ నవ్వుకున్నాడు. రాజారావు దగ్గరున్న నూర్రూపాయల నోటే గుర్తు కొచ్చిందతనికి □

# మరొకసారి ఎల్ ఐ సి ద్వారా రికార్డ్ బోనస్

ఒక క్రొత్త శిఖరారోహణలో
ఎల్ ఐ సి బోనస్

ఎండోమెంట్స్ మరియు హోల్ లైఫ్ (జీవితాంతపు) పాలసీలకు లాభాలతో
**30 వార్షిక బోనస్‌గా** ఎల్ ఐ సి సగర్వంగా ప్రకటిస్తోంది
ఈ బోనస్ 1986 మార్చి 31 తా॥ నాటికి చూపే ఆస్తి, అప్పులపై
**ప్రత్యేకంగా విలువ కట్టబడి** ప్రకటించ బడినది

ప్రకటించ బడిన బోనస్ రేట్లు

| | |
|---|---|
| **జీవితాంతపు పాలసీ.** | ఒక సంవత్సరానికి రూ. **1000** భీమాపై రూ **65** చొప్పున |
| **ఎండోమెంట్ పాలసీ·** | ఒక సంవత్సరానికి రూ. **1000** భీమాపై రూ **52** చొప్పున |

బోనస్ ఒక సంవత్సరము **లోపలే** ప్రకటించ బడుతుంది ఎలాగంటే—అధిక బోనస్ ప్రకటన తేది 1985 మార్చి 31 తా॥ నాటకి విలువ కట్టబడిన ఆస్థి అప్పుల పై ఆధారపడి వుంటుంది

కార్పొరేషన్ క్రొత్త వ్యాపారాలు అభివృద్ధి చెందుట, ఆర్థిక వ్యవహారలను జాగ్రత్తగా నిర్వహించుట, వ్యయ నిర్వహణ ప్రామాణికలు, మరియు మూల ధనము పై పొందిన అధిక రాబడి వలన ఈ సంవత్సరము రికార్డు బోనస్ ఇవ్వ గల్గుతుంది

అంతే కాకుండా శాఖలకు వికేంద్రీకరించ బడిన కార్యనిర్వహణాధికారముల ఫలితంగా వృద్ధి పొందిన సేవ మరియు ఖాతాదారులకు కావలసిన సంతృప్తిని కల్గిస్తుంది.

అర్హతగల పాలసిలకు ఈ రికార్డ్ బోనస్ మరియు ఆకర్షణీయమైన చివరి (అదనపు) బోనస్ మరింత రక్షణ, భద్రత గల్గించేవే జీవిత భీమా అని వేరే చెప్ప నవసరమే లేదు.

మరి మీకు, మీ కుటుంబానికి మరింకా జీవిత భీమా చేసికోటానికి ఇదే అనుకూల సమయం.



## లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

**30 సంవత్సరాల ప్రజా సేవ.**

daCunha/LIC/200/86 TL

# కాన్సర్‌ను నయం చేయడం అతి సులభం!

## సంచలనం సృష్టిస్తున్న నార్డెన్‌స్ట్రామ్ విద్యుత్ చికిత్సా విధానం!

స్టాక్‌హోమ్‌లోని కారోలిన్‌స్కా వైద్య సంస్థకు చెందిన బొజార్న్ నార్డెన్ స్ట్రామ్ అనే రేడియాలజీ వైద్య నిపుణుడు జీవ వైద్యశాస్త్ర రంగాన్ని విస్మయపరిచే సరికొత్త "జీవవిద్యుత్ సమతుల్యతా సిద్ధాంతాన్ని" ప్రతిపాదించాడు. ఈ ప్రతిపాదన ఎన్నో సందేహాలకూ సంధిగ్ధాలకూ దారి తీసింది. విశ్వ వ్యాప్తంగా ఈ సిద్ధాంతాన్ని గురించి ఇప్పుడిప్పుడే అందరూ చర్చిస్తున్నా ఎవరూ దీనిని నిర్దుష్టంగా ఆమోదించడానికి ముందుకు రావడం లేదు. పయిగా ఈ సిద్ధాంతం త్వరలోనే వీగిపోతుందని వాదించే వాళ్ళు రోజు రోజుకీ ఎక్కువవుతున్నారు కూడా! సిద్ధాంత భావన ఇలా ఉండగా, ఈ "జీవ విద్యుత్ సమతుల్యతా సిద్ధాంతాన్ని ఆధారంగా చేసుకొని "విద్యుత్ప్రవాహ విచికిత్స" ద్వారా రొమ్ము కాన్సర్, ఊపిరితిత్తుల కాన్సర్‌లను అతి సులువుగా నయం చేయవచ్చునని ప్రయోగ పూర్వకంగా తగిన సాక్ష్యాధారాలతో సహా నార్డెన్‌స్ట్రామ్ నిరూపించ గలిగారు. మవులికమైన అనుమానాలు ఎన్ని ఉన్నప్పటికీ విద్యుత్ చికిత్స ద్వారా కాన్సర్‌ను నయం చేసే నార్డెన్‌స్ట్రామ్ పద్ధతి శాస్త్ర ప్రపంచాన్ని దిగ్భ్రమలో ముంచిందనే చెప్పాలి.

కాన్సర్ కణాలలోకి సన్నని సూదులని దింపి, వాటి ద్వారా గ్రహించిన కణపొరల నుంచీ కణ ఉపాంగాల నుంచీ కాన్సర్ స్థాయినీ తీవ్రతనూ నిర్ణయించే పద్ధతికి మొదటిసారిగా శ్రీకారం చుట్టింది నార్డెన్ స్ట్రామే! రెండు దశాబ్దాలకు ముందు ఈ పద్ధతి పలువురి విమర్శలకు గురి అయినా ఇప్పుడు ప్రపంచ పర్యంతంగా నడుస్తోంది. పాతికేళ్ళ పరిశోధనా అనుభవాన్ని తులనాత్మకంగా కాచి వడబోయగా రూపొందిన సిద్ధాంతమే "జీవ విద్యుత్ సమతుల్యతా సిద్ధాంత"మని నార్డెన్‌స్ట్రామ్ అంటారు!

ఈ "జీవ విద్యుత్ సమతుల్యతా సిద్ధాంతం" ప్రకారం మానవదేహం జీవ విద్యుత్ ప్రకంపనాల తులాస్థితికి సంకేతం అని చెప్పవచ్చు. అంతర్లీనంగా ఆవరించి ఉంటే ఈ విద్యుద్వలయం గాయం వల్ల కానీ రోగం వల్ల కానీ ఘాతం వల్ల కానీ సాధారణంగా నిర్వర్తించే అతి చిన్న జీవక్రియ వల్ల కానీ ప్రేరేపించ బడుతుంది. ఈ ప్రేరేపణ ప్రభావం సమతూకంలోకి వస్తే మానవ దేహం ఆరోగ్యంగా ఉందని అర్థం. అంటే ఏ విధంగా వచ్చిన అనారోగ్య సూచకమైనా మటుమాయమై పోయిందని భావించ వచ్చు. అలాకాక ఈ విద్యుత్ ప్రేరేపణ వల్ల జీవతులాస్థితి దెబ్బ తింటే రోగం లేదా జబ్బు బాగా ముదురుతోందని అనుకోవాలి. ఈ ప్రతిపాదన చాల సూక్ష్మమైనది. రక్తనాళాలు విద్యుద్వాహకాలుగా వినియోగ పడితే రక్తం విద్యుత్ మార్గంగా రూపు దాల్చుతుంది. రక్తనాళాలు అధిక విద్యున్నిరోధక శక్తిని కలిగి ఉండి మిగిలిన దేహభాగాలకు రక్షణను కలిగిస్తాయి. ఇకపోతే రక్త కేశ నాళికలు విద్యుదావేశాలను తటస్థీకరించే కేంద్రాలుగా వ్యవహరిస్తాయి. కణపొరలు ఎలక్ట్రోడులుగా పని చేస్తే ధ్వంసం కాబడే కణాలు విడుదల చేసే శక్తి "ఎలక్ట్రోమోటివ్ ఫోర్స్"గా తల దాల్చుతుంది. నార్డెన్‌స్ట్రామ్ ప్రతిపాదించిన "జీవ విద్యుత్ సమతుల్యతా సిద్ధాంతానికి" ఇది స్థూల వివరణ! ఈ సిద్ధాంత వివరణ పుస్తకరూపంగా 1983లో ప్రచురింపబడినప్పటికీ ఎన్నో కారణాల వల్ల అది ప్రచారం కాలేక పోయింది!!

నార్డెన్‌స్ట్రామ్ సిద్ధాంతాన్ని అంగీకరించడానికి ఎవరూ సిద్ధంగా లేరు కాని ఖండించడానికి వీలు లేకుండా ఉన్నదన్నమాట మాత్రం చాల చోట్ల వినబడుతోంది. మానవదేహంలో విద్యుత్ ప్రవాహ తరంగాలుంటాయని రెండు వందల ఏళ్ళకు ముందే తెలిసినా నాడీకణ వ్యవస్థకు సంబంధించిన విద్యుత్ ప్రచోదనాలు, కణాల మధ్య నిరంతరంగా ప్రయాణం చేసే ఋణ, ధన, అయానులు, రక్త

## విద్యుత్ చికిత్సా విధానం!




చికిత్సకు ముందు — చికిత్స తరువాత

ప్రవాహ వేగంలోని మార్పులు- ఈ విద్యుత్ తరంగాలకు కారణాలుగా ఊహించ బడ్డాయి. అంతవరకే! అంతేకాని విద్యుత్ సమతాస్థితి జీవ తులాస్థితికి ప్రత్యామ్నాయంగా పని చేస్తుందన్న పరికల్పన మాత్రం ఇంతకు ముందు లేదు. ఈ ఆలోచన స్పష్టంగా నార్‌డెన్‌స్ట్రామ్‌దే!

నార్‌డెన్‌స్ట్రామ్‌కు ఎటువంటి ప్రోత్సాహమూ లేకపోయినప్పటికీ ఆయన తనపట్టును సడల నివ్వలేదు. తాను ప్రతిపాదించిన "జీవ విద్యుత్ సమతుల్యతా సిద్ధాంతం" సరియైనదేనని నిరూపించడానికే ఆయన పూనుకొన్నారు. నిమ్నక్షీరదాలలో జరిపిన ప్రయోగాలు విజయవంతం కావడంతో కాన్సర్ సోకిన వారిపై ప్రయోగాలు జరపడానికి నార్‌డెన్‌స్ట్రామ్ నిర్ణయించుకొన్నారు. ఆ మేరకు ఇప్పటి వరకూ 80 మందిని పరీక్షించి (వీరందరూ రొమ్ము కాన్సర్ కాని, ఊపిరితిత్తుల కాన్సర్ కాని సోకిన వారు) వారిపై ప్రయోగాలు జరిపి తొంభై శాతం వరకు విజయాన్ని చవి చూచారు.

సూదుల స్థాయిలో ప్లాటినమ్ ఎలక్ట్రోడులను కాన్సర్ కణాలలోకి గుచ్చి పది వోల్టులకు తక్కువగా విద్యుత్తును గంట నుంచి మూడు గంటల వరకూ పంపి కొన్ని నెలల తరువాత పరిస్థితిని సమీక్షించడం నార్‌డెన్‌స్ట్రామ్ విద్యుత్ ప్రక్రియలోని మూల ఘట్టం. ఎక్కువ వోల్టేజీ వల్ల సత్ఫలితాలు కలగడం లేదని ఆయనే చెప్పారు. విద్యుత్ ప్రక్రియ వల్ల క్రింది చర్యలు సునాయాసంగా జరుగుతాయని నార్‌డెన్‌స్ట్రామ్ వెల్లడించారు.

★ తెల్ల రక్త కణాలు ఋణ విద్యుదావేశాన్ని కలిగి ఉంటాయి కాబట్టి అవి ధన ధ్రువం వైపుకి ఆకర్షించ బడుతాయి. ఈ ధన ధ్రువాన్ని వ్యాధి సోకిన కణంలోకి దింపితే తెల్ల రక్త కణాలు ఆ కణం దగ్గర బాగా గమిగూడి వ్యాధి కారకాలతో గట్టిగా పోరు సలిపే అవకాశం ఎంతైనా ఉంటుంది.

★ విద్యుత్ చికిత్స వల్ల వ్యాధి సోకిన కణాలకు రక్తాన్ని సరఫరా చేయడాన్ని బాగా నియంత్రించ వచ్చు. విద్యుత్ ప్రభావం వల్ల వ్యాధి సోకిన భాగంలోని రక్త కణాలు దెబ్బ తింటాయి. పయిగా అక్కడ ఆక్సిజెన్ లభ్యం కాదు. ఈ కారణం చేత త్వరితంగా ఎదిగే శక్తి ఉన్నప్పటికీ కాన్సర్ కణాలు ఎదగలేక పోతాయి!

★ ధన ధ్రువం క్యాన్సర్ సోకిన కణాల నుంచి నీటిని తొలగించడం వల్ల ఆ కణాలు కుంచించుకొని పోతాయి. ఈ కారణం వల్ల లోపల ఉండే రక్త నాళాలు దెబ్బతిని రక్త ప్రవాహం నిలిచి పోతుంది. దీంతో కాన్సర్ కణాల ఎదుగుదల స్తంభిస్తుంది.

★ ఎలక్ట్రోడుల వద్ద జరిగే రసాయనిక చర్యల వల్ల ఉత్పన్నమయ్యే వాయువుల పీడనం అధికం కావడం వల్ల కాన్సర్ కణాలు ప్రిదిలిపోయే స్థితి ఏర్పడుతుంది.

విద్యుత్ చికిత్స నార్‌డెన్ స్ట్రామ్ చెబుతున్నట్లు తేలికగానే కనిపిస్తుంది కాని అది ఇంకా


బొ జార్న్ నార్‌డెన్‌స్ట్రామ్

ప్రమాణీకరణం చెయబడలేదు. పైపెచ్చు ఈయన పరిశీలించిన వారంతా ఊపిరితిత్తుల కాన్సర్ వచ్చినవారు. లేదంటే వక్షోజాలకు కాన్సర్ సోకిన వాళ్ళు. అంతే కాని మిగతావారుకాదు. రకరకాల కాన్సర్‌లు ఉన్నాయి. అవి రావడానికి ఎన్నో కారణాలు ఉన్నాయి. అన్నింటికీ ఈ విద్యుత్ చికిత్సే సరిపోతుందని అనుకోవడం శాస్త్ర సమ్మతం కాబోదు. పయిగా నార్‌డెన్ స్ట్రామ్ తన విద్యుత్ చికిత్స ద్వారా నయం చేసిన అతి పెద్ద కాన్సర్ కంత పరిమాణం నాలుగు సెంటి మిటర్లకు మించలేదట! అందుకనే ఆయనని "జీనియస్"గా గుర్తించి, గౌరవిస్తున్న ఆయన సహచరులు ఫోల్కె పెట్టేర్‌సన్, ఎలిసాబెట్ బొ జార్ కోమ్‌లు ఆయన సిద్ధాంతం కాని, విద్యుత్ చికిత్సా విధానం కాని పూర్తిగా వెలుగులోకి రావాలంటే ఇంకా ఎంతో పరిశోధన అవసరమని అంటున్నారు. వీరి మాటలతో ఏకీభవించడం విజ్ఞులైన శాస్త్రవంతుల అభిమతం కాగలదు.

కాన్సర్‌కు రసాయనిక చికిత్స, రేడియో చికిత్స చేస్తున్నట్లే విద్యుత్ చికిత్స కూడా చేయవచ్చు. 85 ఏళ్ళుగా రంగంలో ఉన్న రేడియోచికిత్సే ఇంకా ఈనాటికీ సరిగా నిర్ధారించ బడలేదు. అటువంటిది రెండు, మూడేళ్ళ క్రితమే ఒక రూపాని కొచ్చిన నార్‌డెన్ స్ట్రామ్ విద్యుత్ చికిత్స పూర్తిగా దోషరహితమైందని స్వీకరించ డానికి గాని, లోప భూయిష్ఠ మైందని తోసి పుచ్చడానికి కాని ఎలా వీలు కుదురుతుంది? విద్యుత్ చికిత్సా విధానం ఇంకా సందేహాలలో ఉండగానే, ఈ చికిత్సా విధానానికి రేడియోచికిత్సను, రసాయనిక చికిత్సను కూడా ముడిపెట్టాలని నార్‌డెన్ స్ట్రామ్ నిర్ణయం తీసుకోవడం. అందుకు తగిన చర్యలు ప్రారంభించడం మరింత ఆశ్చర్యాన్ని గొలుపుతుంది.

శాస్త్ర పరిశోధన ఏ ఒక్కరి స్వంత విషయం కాదు. దాని పరమ ప్రయోజనం మానవాళి క్షేమమే కావాలి. ఏ విషయంలోనూ తూష్ణీంభావం కాని, దూకుడు స్వభావం కానీ మంచిది కాదు.

నార్‌డెన్‌స్ట్రామ్ సిద్ధాంతాన్ని, చికిత్సా విధానాన్ని వివిధ దేశాల నిపుణులు రకరకాల పరీక్షలకు సరి చేసి సరియైనదే నని రుజువు చేయగలిగితే, అంతకు మించి ఎవరు మాత్రం కోరుకునేది ఏముంటుంది?

–డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

వక్షోజానికి సోకిన కాన్సర్‌కు విద్యుత్ చికిత్స చేస్తున్న దృశ్యం.






మామూలుగా భోజనాల టైంలో అందరూ ఒక చోట చేరారు.

"ఏమిటి మేడం యివాళ చాలా డల్‌గా వున్నారు" కమల నెమ్మదిగా కదిపింది.

"అబ్బే ఏం లేదు కమలా ఆ ట్రాన్సుపోర్టు నుండి రిప్లయ్ వచ్చింది".

"ఇంటర్వ్యూకేనా? నే చెప్పలా మేడం మీకా జాబ్ తప్పక వస్తుంది." కమల కళ్ళు ఆనందంగా మెరిశాయి. చూస్తున్న పావనికి చాలా ఆశ్చర్యం. తన కోసం వీళ్ళంతా యెంత తాపత్రయ పడుతున్నారు!

"వస్తుందంటావా?" పావని అనుమానంగా ప్రశ్నించింధి.

"మీరిలా అనుమానించవలసిన పనే లేదు తప్పకుండా వస్తుంది."

"ఎప్పుడు మేడమ్ యింటర్వ్యూ?" కమల మళ్ళీ ప్రశ్నించింది.

"రేపు."

"తప్పకుండా వెళ్ళండి మేడమ్" కమల నొక్కి చెప్పింది.

"అలాగే నమ్మా."

విషయం తెలిసిన ప్రిన్సిపాల్ మీనా పావని కోసం కబురు పంపింది. పావని వచ్చింది.

"కూర్చో పావని."

"పరవాలేదు చెప్పండి మేడమ్."

"బాస్ ట్రాన్సుపోర్టు నుంచి యింటర్వ్యూ వచ్చిందట?"

"ఔను మేడం."

"శాలరీ బాగుంది కనీసం యీ జాబ్ అయినా దొరికితే కొంత వరకూ నీ కష్టాలు తీరినట్లే. భగవంతుడు యీసారయినా చల్లగా చూడాలి" వింటూన్న పావని ముఖంలో వింత మార్పు.

"ఎంత మంచి మనసులు వీళ్ళవి. తన కష్టాలు తొలగాలనీ తనకు మంచి రోజులు రావాలనీ కోరుకునే వాళ్ళతో కలసి వుండడం కంటే యేం కావాలి అనుకుంటూ "నిజంగా మీదెంత మంచి మనసు మేడం. నా కష్టాలు మీవిగా భావించి వాటిని తొలగించడానికి శాయశక్తులా కృషి చేస్తున్నారు. మీకు నా ధన్యవాదాలు" మీనా ముఖంలో మార్పు.

"నీ హృదయం మంచిది గనుక నీ కలా అనిపిస్తున్నది. అంతేగాని నేను చేసిందేముంది?"

"భలేవారే యింత కన్నా యేం చేయాలి? మీరెంత కృషి చేశారో నాకు తెలుసు కాని నా దురదృష్టం వెంటాడుతూంటే మీరేం చెయ్యగలరు?" పావని కృతజ్ఞతగా చూసింది.

* * * * *

బాస్ ట్రాన్సుపోర్టు కంపెనిలో దాదాపు ఓ అరడజన్ మంది అందమయిన అమ్మాయిలు యింటర్వ్యూ నిమిత్తం కూర్చొని వున్నారు. పావని అడ్రసు తెలుసుకుని ఆ భవంతి ఆవరణలో అడుగు పెట్టింది. అతి ఆధునికంగా కట్టబడిన ఆ భవంతి యెంతో అందంగానూ ఆడంబరంగానూ వుంది. భవనాని కన్నివైపులా పెద్ద వరాండా, చుట్టూ అద్దాల కిటికీలు. కిటికీలకూ ద్వారాలకూ విలువయిన కర్టెన్లూ ఫోర్టికోకి ప్రక్కగా రకరకాల క్రోటన్సూ, పూలమొక్కలూ; చూడడానికి ఒక సినిమా సెట్టు లాగా వుంది.

"అమ్మా మీరూ యింటర్వ్యూకే వచ్చారా?" ఓ వ్యక్తి ప్రశ్న.

"ఔను బాబూ" పావని జవాబు

"అలా లోపల కూర్చోండమ్మా" దారి చూపించాడు. లోనికి నడిచిన పావని అక్కడో ఆరుగురు కూచొని వుండటం చూసింది. నెమ్మదిగా తానూ వారి ప్రక్క ఒదిగి కూర్చుంది.

"అమ్మా కాఫీ తీసుకోండి" బ్రూ కాఫీ వరుసనే అందిస్తున్నాడొక వ్యక్తి. ఆశ్చర్యపోయింది పావని. యిలా యింటర్వ్యూల్లో కాఫీ కూడా యిస్తారా? కమల అన్నట్లు యిది నిజంగా మంచి కంపెనీ లాగా వుందే అనుకుంది.

"గాయత్రి ఎవరమ్మా?"

"నేను" నిలబడిందో అమ్మాయి.

"మీరు లోనికెళ్ళండి" వెళ్ళింది. యిదే విధంగా ఓ అరగంటలో ఆరుగురూ వెళ్ళి వచ్చారు. యిక మిగిలింది పావని మాత్రమే.

"పావని."

"నేనే బాబూ."

"వెళ్ళండమ్మా" లోనికెళ్ళింది. ఆఫీసు చాలా బాగుంది. చాలా మంది టేబుల్స్ ముందు కూర్చొని వర్కు చూచుకుంటున్నారు.

"యీ గదమ్మా" స్ప్రింగ్ డోర్ తెరుస్తూ అన్నాడు. పావని లోని కడుగు పెట్టింది.

"గుడ్ మార్నింగ్ సార్."

జరిగిన కథ – 9 : రాజ రికమెండేషన్‌తో విజయ్‌కి రిజర్వ్ బాంకులో జాబ్ వచ్చింది. రాజ అమెరికా వెళ్ళేముందు వచ్చి పావని కుటుంబాన్ని చూసి వెళ్ళింది. అనంతరావు ఆత్మహత్య చేసుకున్నాడు. విజయ్ మద్రాసుకి వెళ్తున్న రైల్లో భయంకరమైన శబ్దం అయ్యి విజయ్ మెదడు మొద్దుబారి స్తంభించిపోయింది. రైలు యాక్సిడెంట్‌లో విజయ్‌కి చూపు పోయింది. దినేష్ అనంతరావు పెద్ద చెల్లెలు జానకిని వివాహం చేసుకున్నాడు. ప్రిన్సిపాల్ ఎంత ప్రయత్నం చేసినా లేడీస్ కాలేజిలో పావనికి ఉద్యోగం రాలేదు. జానకి, దినేష్‌ల దాంపత్య జీవితం సుఖంగా గడచి పోతోంది. పావనికి ట్రాన్స్‌పోర్ట్ కంపెనీ నుంచి ఇంటర్వ్యూ వచ్చింది.

"ఎస్ టేక్ యువర్ సీట్" అంటూ వింతగా నవ్వుతూ కళ్ళజోడు తీశాడు బాస్. కుర్చీలో కూచోబోతున్న పావని ఆశ్చర్యంగా-

"నువ్వా?" అంది.

"ఆహా నేనే ఆశ్చర్యంగా వుందా? ఫరవాలా కూర్చో".

"మదన్" నవ్వుతున్న అతని ముఖంలోకి చూడలేక పోయింది. ప్రక్కనే పిడుగులు పడుతున్నట్లు కంగారు పడింది.

"పావనీ .. ఓ సారి కాలేజీ బ్యూటీవి కదూ చాలా సంవత్సరాలయింది చూసి ఎలా వున్నావు? ఏం చేస్తున్నావు? నీ అందం ఏమంటుంది?" అంటూ అదోలా మత్తుగా చూస్తూ తన సీటులో నుంచి లేచాడు.

"ఇది నీ ఆఫీసని తెలియదు."

'తెలిస్తే వచ్చే దానివి కాదా?

"చచ్చినా."

"చస్తే ఎలా రాగలవ్? బ్రతికుంటేనే గదా ఎప్పటికయినా కలుసుకొనేది" దగ్గరగా వస్తూ అంటున్న అతని ముఖంలోకి అసహ్యంగా చూసింది

"సెలవు" వెనుతిరిగింది.

"ఉండూ అన్నిటికీ అంత తొందరయితే ఎట్లా? రావటం పోవటం రెండూ నీ యిష్టమేనా?"

దెబ్బతిన్న పక్షిలా చూసింది పావని.

"భయపడకు కూర్చో మాట్లాడవలసిన విషయాలు చాలా వున్నాయి."

"నాకేమీ లేవు "

'అదో అదే వద్దు నీలో ఏ మార్పు రాలేదే? పరిస్థితులు నిన్ను మార్చలా?"

"చాలా మార్చాయి "

"మరికేం? అన్నట్లు వుద్యోగం చెయ్యవలసిన అవసరం చాలా వుందా?" సిగిరెట్టు వెలిగిస్తూ అడిగాడు.

"వుంది నిన్ను చూశాక ఆ అవసరం లేదనిపించింది."

"నేనేమన్నా పులినా? లేక దయ్యాన్నా?"

"అంత కంటే ఎక్కువే."

సరే యింతకూ కాఫీయా. "

"ఏదీ వద్దు."

"అలా అంటే ఎలా? మర్యాద చేయటం నా విధి."

". ......"

"వుద్యోగం నీకే నెలకు రెండు వేలు జీతం."



# పావని

" .. ....." అదోలా చూసింది "

"యింతకూ నీవు చేయవలసిన పనులేమిటో తెలుసా" కాలి సిగిరెట్ తన బూటు కాలి క్రింద వేసి రాస్తూ "యే అందం చూసుకొని గర్వంతో విర్ర వీగావో, ఏ అందాన్ని చూసుకుని మిడిసి పాటుతో నన్ను అవమానించావో ఆ అందాన్ని కాసేపు నా కరవు తీరా అనుభవించనిస్తే చాలు ఆనాటి నుంచీ ఒక వైపు నీపై నెలకొన్న వ్యామోహమూ రెండవ వైపు నీవు నాకు చేసిన అవమానమూ రెండూ నన్ను కుమిలింపజేస్తున్నవి చాలా సంవత్సరాలుగా పట్టి పీడిస్తున్న వాంఛ తీర్చుకోవడానికే నీవు నా దగ్గరకు వచ్చావు" అంటూ దగ్గరకు వచ్చి పావని భుజం మీద చేయి వేశాడు.

"ఆగు మదన్ ఆగు. పరిస్థితులు ఆసరాగా తీసుకొని నీ వేదో మాట్లాడుతున్నావు. ధన బలంతో మదం బట్టిన నీకు మంచిచెడ్డల తారతమ్యమే తెలియడం లేదు నేను ఒక భర్తకు భార్యను యిద్దరు బిడ్డలకు తల్లిని. నువు చెప్పే నీచపు పనులు చేయదలచుకుంటే యిలా వుద్యోగం వెతుక్కుంటూ వచ్చి యుండనని నీకర్థం అయ్యుండవలసింది. యిలాంటి మాటలు మరొసారి అన్నావంటే మర్యాద దక్కదు." కళ్ళు చింత నిప్పుల్లా మారగా గర్జించింది పావని. పావని మాటలు విని వికృతంగా నవ్వాడు మదన్

"నేను నిన్నేం పెళ్ళాడబోవడం లేదు. పది నిమిషాలు కళ్ళు మూసుకొని నా కోరిక తీర్చావంటే నీకు రెండు వేల రూపాయల జీతం గల వుద్యోగమూ . దానివల్ల నీవూ, నీ పిల్లలూ, నీ భర్తా అనుభవించే సుఖమయిన జీవితమూ.. ఆలోచించుకో."

"నోర్ముయ్."

"మూయిస్తాను" అంటూ పావని పైట చెరగు పట్టుకుని తన వైపుకు లాక్కుని రెండు చేతులతో కౌగిలిలో బంధించి ముద్దు పెట్టుకో ప్రయత్నించాడు. అపరకాళిగా మారి కోపంతో, అసహ్యంతో పళ్ళు తెలియని పావని చేతికి దొరికిన సామానంతా అతనిపై విసరి కొట్టి కొరికి రక్కి అసుర ప్రయత్నంతో తప్పించుకొని బయటపడింది.

అవమాన భారంతో పుట్టెడు దుఃఖంతో యిల్లు చేరిన పావని నిస్తేజంగా కూలబడిపోయింది. చిక్కబట్టుకున్న ధైర్యం సడలిపోగా కుమిలి కుమిలి యేడ్చింది. యింత అవమానం జరిగాక తానెందుకు బ్రతకాలి? యింకా యిలాంటివి భవిష్యత్‌లో ఎన్ని యెదుర్కోవలసి వస్తుందో? సంవత్సరాల తరబడి యెదురు దెబ్బలు తింటూ నెట్టుకు రావడమే గాని తన జీవితంలో వెలుగనేది గగన కుసుమమయిపోయింది. దురదృష్టవంతురాలయిన తను తొలగిపోతే .... దృష్టి లేని విజయ్, అమాయకులయిన పిల్లలూ యేమౌతారు? వాండ్ల గతి ఏమిటి? పరమేశ్వరా నాకేది దారి? తల బ్రద్దలైపోతున్నది. వేయి సమ్మెటలు ఒక్కసారి తలపైన విరుచుక పడినట్లున్నది. కండ్లు తెరచి చూస్తున్నా కనిపించడం లేదు. శూన్యం, గాఢాంధకారం. ఆశాకిరణం ఏ ప్రక్కనయినా లేదు లేదు. నేనే అదృష్టహీనురాలిని. నా వల్లనే విజయ్ బ్రతుకు బండ బారింది. నేను లేకుంటే విజయ్ బాగుపడతాడు. విజయ్‌కేం లక్షాధికారి. తన వల్లనే సంపదకు దూరమయాడు. తను లేకపోతే . పిల్లలూ, విజయ్ దశ తిరుగుతుంది. అంతే తిరుగులేదు. వేరే దారి కూడా లేదు. దృఢ నిర్ణయాని కొచ్చింది.

తన గుండెల్లోని బాధ, నిర్ణయం పైకి కాస్తయినా కనుపించ నివ్వలేదు. వంట చేసి పిల్లలకూ భర్తకూ పెట్టింది. పిల్లలు నిద్రపోయారు. యిద్దరినీ తనవి తీరా ముద్దు పెట్టుకుంది. ఏడ్చింది. భర్త ముఖంలోకి చూసింది. నన్ను క్షమించండి. నన్ను క్షమించండి. మనసులోనే పదే పదే అనుకున్నది. మనసును గట్టిపరచుకొని అడుగులో అడుగు వేసుకుంటూ బయటికి నడిచింది పావని.

* * * *

పెద్దగా ధ్వని చేసుకుంటూ గమ్యాన్ని చేరాలనే సంకల్పంతో దూసుకు వస్తుంది గోదావరి ఎక్స్‌ప్రెస్. ఆ రైలు కెదురుగా నడుస్తుంది ఓ స్త్రీ.

"డ్రైవర్ త్వరగా పోనీ ఎవరో స్త్రీ ఆత్మహత్యకు ప్రయత్నిస్తున్నట్లుంది" ఆత్రంగా అన్నాడు పోలీసాఫీసరు. జీప్ వేగం పెరిగింది. కన్ను మూసి తెరచేంతలో రైల్వే లైను ప్రక్కనే ఆగిన జీప్ నుండి దూకి పరుగెత్తి ఆమెను ప్రక్కకు లాగి వేశాడా ఆఫీసరు వెంట్రుక వాసి మేరలో తప్పిపోయిన ప్రమాదాన్ని గూడా గుర్తించలేని ఎక్స్‌ప్రెస్ వేగంగా వెళ్ళిపోయింది

"అయ్యో నాకు చావు కూడా దొరికే అదృష్టం లేదా? నన్నెందుకు రక్షించారు?"

"ఆత్మహత్యకా" నోరు పెగల్లేదు.

"కాదు నా పాలిటి స్వర్గం. దాన్ని కూడా పొందకుండా చేశారు. నేనీ కష్టాలు భరించలేను. నా బ్రతుకే చీకటయి పోయింది."

"చూడమ్మా కష్టాలు సంభవించటం మానవుల కందరికీ సహజమే."

"ఏది సహజం? దీనికి ఆది అంతమూ లేదా? బ్రతుకంతా బాధలేనా?"

"భలేవారే అప్పుడే ఓర్పూ ధైర్యమూ కావాలి. రండి" నెమ్మదిగా చీకటిలో నుండి లైటు కాంతిలోకి వచ్చి వకరి ముఖం మరొకరు చూచుకొని ఆశ్చర్యపోయారు. ఆమె ఒకప్పటి కాలేజీ బ్యూటీ, అతను బెంగాలీ విద్యార్థి.

"పావనీ నువ్వా!"

"దినేష్ నీవా" కన్నీరు.

"పావనీ ఏమిటిది? నా దురదృష్టమా? ఖర్మా? నేను నేను నాతో చదువుకొన్న సహచరులనందర్నీ యిలాంటి భయంకర పరిస్థితులలోనే కలుసుకోవలసి రావడం విచిత్రంగా లేదూ?" అతని కంఠంలో చెప్పలేని బాధ.

"దినేష్ అది నీ ఖర్మ కాదు నాది" వైరాగ్యం వుట్టిపడింది పావని మాటల్లో.

"పావనీ నీకో అన్నగా అడుగుతున్నాను. ఎందుకిలాంటి నిర్ణయాని కొచ్చావ్? నేను నీ గురించి ఎంతో గొప్పగా".... నోరు మూగపోయింది.

"దినేష్ బాధ పడుతున్నావా?"

"పావనీ నాతో రా" నడిచాడు. యిద్దరూ జీప్ వరకూ నడిచారు. ఆ పదడుగుల్లోనే దినేష్ తనకు అక్కచెల్లెళ్ళు లేరనీ నీవే నా సోదరిగా తలచుకుంటున్నా జరిగిందేమిటో చెప్పమనీ లాలనగా అడిగాడు పావని నిట్టూర్పు విడుస్తూ జరిగిందంతా వివరంగా చెప్పి-

"చెప్పు దినేష్ యింకా నన్ను బ్రతకమంటావా? వద్దు దినేష్ వద్దు నేనీ అవమానాలు యిక భరించలేను" అంటూ భోరున యేడ్చింది.

"పావనీ నీకా యిన్ని కష్టాలు! విజయ్‌కా ఆ స్థితి! నో ఒక్క నాటికీ అలా జరగటానికీ వీల్లేదు. నువ్వెప్పుడూ చిరునవ్వుతోనే వుండాలి నేను నీ అన్నయ్యను. నే నున్నంత వరకూ నువ్వు కష్టపడ కూడదు. యెంత ఖర్చు అయినా ఫరవాలేదు విజయ్‌కి ఆపరేషన్ చేయిస్తాను. నన్ను నమ్మమ్మా" కన్నీరు కారుతుండగా అన్నాడు.

"దినేష్!!"

"అలా అనకమ్మా అన్నయ్యా అను. రామ్మా వెళదాం" జీపెక్కారు. నేరుగా పావని యిల్లు చేరి విజయ్‌ని చూచి దినేష్ యెంతో బాధ పడ్డాడు. "నేనున్నాను విజయ్. కలసి చదువుకున్నాం. ఒకరికొకరం తోడునీడగా బ్రదుకుదాం" అంటూ ధైర్యం చెప్పాడు.

ఆ రాత్రి విజయ్ మనసులో పెను తుఫాను చెలరేగింది. ఆ అలల ధాటికి తట్టుకోలేకపోయాడు. తను గోల్డ్ మెడల్ విద్యార్థి. దినేష్, మదన్ వీళ్ళంతా చదువురాని వాళ్ళుగానే నిలబడ్డారు. కాని విధి వారిని కన్నబిడ్డల మాదిరి కాపాడి తనను సవతి బిడ్డలా విసరి కొట్టింది నో... తన జీవితంలో వెలుగు మచ్చుకు గూడ కనిపించబోదు. వ్యర్థ జీవితం యెన్ని నాళ్ళు బ్రతికి యేం ప్రయోజనం? చాలు యితరుల సానుభూతి సహకారాలతో జీవచ్ఛవం లాగా బ్రతకడం తలచుకుంటేనే దుర్భరంగా వున్నది వద్దు తనకీ జీవితం వద్దు. తన భారం తగ్గినట్లయితే పావనికయినా కాస్త వెసలుబాటు కలుగుతుంది. యిలా ఆలోచనల్లోనే అర్థరాత్రి అయిపోయింది.

ఉదయం ఖాళీ మంచం చూచి బావురుమంది పావని. తన ఆసరా లేందే మంచం దిగని విజయ్ మంచం మీద లేకపోవడంతోటే అర్థమయిపోయింది పావనికి. అభిమానవంతుడయిన విజయ్‌ని తను కాపాడుకో లేకపోయింది. దినేష్ విజయ్ కోసం యెన్నో చోట్ల గాలించాడు. ఫలితం కనిపించలేదు. బ్రతికి వున్నాడా? ఆత్మహత్య చేసుకున్నాడా? యేమీ తెలియక పావని మెదడు మొద్దుబారి పోయింది. (ఇంకా ఉంది)

# "లవంగ నూనె లేని టూత్ పౌడరు నాకు పనికిరాదు"



"నాకిష్టమైన టూత్‌పౌడరు ప్రామిస్. ఎందుకేమిటి, దీన్లో లవంగ నూనె ఉంది! అందుకే ఇది ఊరూరా పేరు మోసింది. లవంగ నూనెలో రెండు గొప్ప సుగుణా లున్నాయి. ఇది చిన్నచిన్న బాధలనుంచి పళ్లను సదా కాపాడుతుంది. పైగా పళ్లకు చెడుపుచేసే సూక్ష్మజీవులు దీనిదెబ్బకు నశించిపోతాయి.

ఇందువల్ల పళ్లు గట్టిగా ఉంటాయి. దీని మరొక గొప్ప గుణమేమిటంటే, ఇది నోటిని తాజాగా, సువాసనగా ఉంచుతుంది. అంటే మనం మాట్లాడుతుంటే ఎదుటి వాళ్లు మొహం తిప్పుకోరన్నమాట!

మరొక ముఖ్య విషయమేమిటంటే, ప్రామిస్‌లోని సద్గుణాలతో పోలిస్తే దీని వెల చాల తక్కువ. దీనిపైన పెట్టిన పైసపైసకూ మనకు ఫలితం దక్కుతుంది.




30 గ్రా. పౌచ్‌లో కూడా లభిస్తుంది.

నన్నడిగితే ప్రామిస్ టూత్‌పౌడరే తెచ్చుకోమంటాను. ఇది లవంగ నూనెతో నిండినది. బల్సారా వారు ఎంతో ఆలోచనతో సృష్టించినది".

## లవంగ నూనెతో అద్భుత సృష్టి

# ప్రామిస్ టూత్‌పౌడర్



బల్సారా—
టూత్ పేస్ట్ విశేషజ్ఞులు



CHAITRA-B BLS 828 TEL




### జి. ఎన్. ఆర్., రామకృష్ణాపురం

★ సినిమాలవల్ల యువతీ యువకులు చెడిపోతున్నారంటా. మిరేమంటారు?

● చెడిపోవడానికి సినిమాలే అక్కరలేదు. మంచి ఎగ్జాంపుల్స్ లేక కూడా చెడిపోవచ్చు! పెద్దల ప్రవర్తన ఎలా వుంటూందో చూడరా పిల్లలు?!

### కె. బి. ఎమ్., కోటబొమ్మాళి

★ పెళ్ళి కాకుండా కలిసి ఉన్న వారిని సమాజం చిన్న చూపు చూస్తుంది ఎందుకని?

● పెళ్లి చాలా పవిత్రమైనదన్న నమ్మకం పోక!

★ ఆత్మీయతకు అర్థం ఏమిటి?

● ఎదుటి మనిషిని చూసి సంతోషించడం.

★ విద్య గొప్పదా? వృత్తి గొప్పదా?

● వృత్తికి చేయూతనిచ్చే విద్య గొప్పది.

★ స్త్రీలందరూ దుర్మార్గులపై ప్రతిఘటిస్తే ఈ దేశం ఎప్పుడో బాగు పడేది. మిరేమంటారు!

● అప్పుడు జనం వుండే వారు కాదు!

### జె. ఏ; అల్లూరు

★ వరద బాధితుల సహాయ ప్రకటనలో పోటీలు పడిన సినీ తారల హృదయావేదన హర్షించ తగ్గది కదా?

● తప్పకుండాను. ఎటొచ్చీ- ఫుల్ పేజీ ప్రకటనకి బదులు ఆ డబ్బు విరాళానికిస్తే యింకా బాగుండేది కదా! (కాని ప్రకటన- ప్రచారం లేనిదే సినీ జీవులు బ్రతకలేరు!) మంచిపనికి పోటీ పడడం చూడముచ్చటే కద.

### ఆర్. ఎమ్. ఎస్. ఆర్; అంబుసోలి

★ ఎక్కువగా జీవితంలో దెబ్బ తిన్న వాళ్ళు- ఆడ? మగ?

● ఎవరు దెబ్బ తిన్నా బాధ పడేది-ఇద్దరూను!

★ జీవితాన్ని ఎలా తీసుకుంటే బాగుంటుంది?

● యాసిఇట్ కమ్స్!

★ జీవితం దేవుడిచ్చిన వరం. మరి మరణం?

● అదీను. శాశ్వతంగా బ్రతికేస్తూ వుండడం ఎంత బోరో వూహించకలరా?!

### బి. వి, ఆర్. ఎమ్; హైదరాబాదు

★ సినిమాలలో మి పాదాల దగ్గర యింత చోటు యివ్వండి లాంటి డైలాగులు చెప్పించి స్త్రీ జాతిని కించపరుస్తున్నారెందుకు?

● అలాంటివి సినిమాల్లోనే సాధ్యం కనుక. సినిమా నాయకుల పాదాల దగ్గర ఒకరికేమిటి ఇద్దరికి కూడా వుంటూంది స్థలం!

### ఎస్. ఎస్. బొబ్బిలి

★ అమ్మాయిల వస్త్ర ధారణే మాన భంగాలకు మూలం.

● ఏదో వంక కావాలి కనుక- అలా అనుకోడం! వయసు- వస్త్ర ధారణ- సెక్సు మానియాక్స్‌కి అడ్డం కాదని తెలియడం లేదా వార్తలవల్ల?

### ఎస్. డి. ఎమ్; ఒంగోలు

★ ప్రేమ, దోమ పేరుతో మగవాడిని సర్వ నాశనం చేసే ఆడదాన్ని వెనకేసుకురాటాన్కి మికుసిగ్గు కల్గటంలే?

● లేదు. ప్రేమ పేరు చెప్పి పెళ్ళంటే పారిపోయే మగవారిని చూస్తేనే నాకు సిగ్గుగా వుంటుంది!

★ మనిషి జీవితానికి సార్థకత పెళ్ళితో లభిస్తుందా?

● లభించదు. చేద్దామనుకున్న పని విజయవంతంగా చేయి కల్గిన నాడు లభిస్తుంది.

### ఎస్. జె. హెచ్; తంబళ్ళపల్లి

★ కలిమి కల లోభి ఎలాంటివాడు?

● తేనె టీగలాంటివాడు. కూడబెట్టడమేగాని అనుభవించడం తెలియని నిర్భాగ్యుడు!

★ పరిమిత కుటుంబం ఎటువంటిది?

● సాంసారిక జీవితం భారం అనిపించనిది. 

# కోటయ్య అనుభవం- కోటయ్య నోటనే విందాం



కోటయ్యా సూరయ్యా ఇరుగు పొరుగు ఊళ్ల రైతులు. ఎన్నాళ్లనుంచో మిత్రులు. ఒకసారి అనుకోకుండా కలిశారు...




























SAA/NIA/2802/TL

పూర్తి వివరాలకై మీకు దగ్గరలోని న్యూ ఇండియా కార్యాలయానికి విచ్చేయండి. లేదా ఏజెంటును కలవండి.



న్యూ ఇండియా ఎష్యూరెన్స్

(జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా అనుబంధ సంస్థ)

నష్టాలలో మీకు నమ్మకమైన ఆధారం — భీమా!

# పేదభార్యకోరిక

చింతా రాంబాబు

"ఏమండీ, ఈ రోజు పై తరగతి టిక్కెట్టు తీసుకొని మనం కల్సి సినిమా చూడాలండి."

గోపాలం భార్యవైపు ప్రశ్నార్థకంగా చూశాడు!

"మన పెళ్ళయిన దగ్గర్నుండి నా మనసులో దాచుకొన్న కోర్కెండి ఇది." గోపాలం మనసు చలించి భార్యవైపు బాధగా చూశాడు.

"అంత డబ్బుపెట్టి ఆ టిక్కెట్టు కొనటం మన తాహతుకి మించినదే అయినా ఈ ఒక్కసారికి నా కోర్కె మన్నించండి."

ఈసారి గోపాలం పూర్తిగా కదిలిపోయాడు.

తమ పెళ్ళయిన ఈ రెండేళ్ళల్లో భార్యకోరిన మొదటికోర్కె! అడిగినా తీర్చలేని ఆర్థిక పరిస్థితి తనది. అర్థం చేసుకొని అడగటం మానేసింది. ఈ రోజే ఏమిటో ఇలా బయటపడింది. అయినా కల్సి కూర్చోటం మినహాయించి ఎప్పుడన్నా సినిమాలకి వెళ్తూనే వుంటారు.

"ఏమండీ, ఈ చిన్న కోర్కె తీర్చలేరా?" రెట్టించింది రాజేశ్వరి.

గోపాలం వెంటనే సమాధానం చెప్పలేకపోయాడు. ఆమె మనస్సేమిటో అర్థంచేసుకోటానికి ప్రయత్నించసాగాడు. వాళ్ళందరికది అతి చిన్న కోర్కె! కాని, తమలాంటి వాళ్ళకది చాలాపెద్ద కోర్కెక్రిందే లెఖ్ఖ! సినిమాకోసం పదిరూపాయలు ఖర్చుపెట్టటమన్నది, ఒక పదిరోజులపాటు పంచభక్ష్య పరమాన్నాలతో చేసుకోవటం లాంటిది. అలాంటిది ఆమె అడిగిందని ఎలా ఒప్పుకోగలడు?

"కావలిస్తే నువ్వెళ్ళిరా రాజేశ్వరీ, డబ్బులిస్తాను" అన్నాడు.

"రూపాయి పావలా ఇస్తారు! నేల టిక్కెట్టుకి నేనొక్కదాన్నే వెళ్ళిరావాలి. అదేగా మీరు చెప్పేది." కొద్దిగ కోపంగా ధ్వనించిందామె కంఠం!

"పోనీ, నేను కూడ వస్తానులే" అన్నాడు సముదాయింపుగా.

"వచ్చి ఏం లాభం? మీరొకచోట నేనొకచోట కూర్చోవాలి. ఎప్పుడన్నా వెళ్తే యిదేగా జరిగేది. ఈ సారికి మాత్రం కల్సికూర్చొనే టిక్కెట్టు తీసుకోవల్సిందే" పట్టుబట్టింది రాజేశ్వరి.

భార్యతో కల్సి సరదాగా చూడాలని తనకిమాత్రం వుండదా? సాధ్యంకాక సమాధానం చెప్పలేకపోతున్నాడు కానీ! పెళ్ళికిముందు ఇలాంటివే తనూ ఎన్నో కలలుకన్నాడు. కుటుంబం దారిద్ర్యంలో పడిపోవటంతో ఆవన్నీ చంపేసుకొన్నాడు.

"ఈ 'శ్రీమతి శ్రీవారు' సినిమా చాలా బాగుందటండీ! భార్యాభర్తలిద్దరూ కల్సిచూస్తే ఇంకా బాగుంటుందట! మన చుట్టుపక్క వాళ్ళంతా చూసేశారు కూడ. నాకోసం ఒక్క పదిరూపాయలు ఖర్చుపెట్టలేరా?" ఈసారి రాజేశ్వరి కంఠం దీనంగా ధ్వనించింది.

పరిస్థితి గోపాలంకి కూడ బాధగానే వుంది. అయినా ఏం చెయ్యగలడు? డబ్బుతో పని! అసలు డబ్బులేని వాళ్ళకలాంటి 'హైక్లాస్' కోరికలు వుండకూడదు. వుంటే తనలాంటి బడుగుభర్తలు తట్టుకోలేరు.

"రాజేశ్వరీ, నెల్లాళ్ళక్రితం మా అమ్మ కళ్ళద్దాలు కిందపడి అందులో ఒక అద్దం బ్రద్దలయి పోయిందన్న సంగతి నీకుకూడ తెల్సుగా! ఈ పదికి ఇంకో అయిదు వేసుకొంటే అద్దం వస్తుంది. ఆ రోజునుండి ఈ రోజువరకూ పదిహేను రూపాయలు మిగిల్చి ఆ అద్దం వేయించలేకపోయాను. మొన్నరాత్రి చీకట్లో సరిగ్గా కన్పించక కిందపడి, నుదుటికి పెద్దబొప్పికూడ కట్టింది. అయినా ఆమె అద్దం వేయించమని నోరు తెరచి అడగలేకపోయింది. ఆ రాత్రి ఒక కొడుకుగా నేనెంత కుమిలిపోయానో చెప్పలేను. ఇంకో వందసార్లు పడి వందబొప్పులుకట్టినా ఆమె అడుగదు. ఎందుకంటే మనింటి పరిస్థితి. నా గురించి ఆమెకి తెల్సుకాబట్టి! నిన్ను చెప్పుతున్నానని అనుకోకు! ఏది ముఖ్యమో ఆలోచించు" అన్నాడు నచ్చచెప్పే ధోరణిలో.

రాజేశ్వరికి ఉక్రోషంతో ఏడుపు వచ్చేసింది. నిజమే మరి! ఇలా అందరి బాధలు గురించి ఆలోచిస్తూపోతే మరి తనకోర్కె ఎప్పటికి తీరేను? పైగా సినిమా ఈరోజుతో ఆఖరు. ఏడుస్తూ గిర్రున లోపలికి పరిగెత్తింది.

గోపాలం తేరుకోటానికి చాలా టైము పట్టింది. అసలు రాజేశ్వరిది పిచ్చికోర్కె కాకపోతే మరేమిటి? తన చిన్నతనంనుండి తామంతా నేలటిక్కెట్టుకి అలవాటు పడ్డవాళ్ళే! తల్లీ తండ్రితో వెళ్ళినా వేర్వేరుచోట్ల కూర్చొనేవాళ్ళు! ఏనాడు ఎవరూ ఇలా కల్సి కూర్చోటం గురించి ఆలోచించలేదు.

కాలంలో వ్యత్యాసం వుంది కాబట్టి భార్యకోర్కె తీరుద్దామంటే తనుమాత్రం ఏం చెయ్యగలడు? అకస్మాత్తుగా తండ్రిపోవటంతో ముగ్గురుతమ్ముళ్ళకి ఒకచెల్లికి బాధ్యత వహించవల్సి వచ్చింది. చదువైతే చదువుకొన్నాడు కాని చేసేది ప్యూను ఉద్యోగం. వచ్చే ఆరొందలతో ఎలాగో కుటుంబాన్ని నెట్టుకొస్తున్నాడు. తమ్ముళ్ళు కాస్త చేతికి అందివచ్చేవరకూ సరదాలు. షికార్లు చంపుకొన్నాడు. భార్యాకూడ అలాగే సహకరించేది కూడ! ఏమిటో ఈసారే పట్టుపట్టేసింది.

నిజం చెప్పాలంటే, ఆమెకి....

తనని కట్టుకొన్న పాపానికి కడుపునిండా అన్నంలేదు. అయినా అడగలేదు!

అలాగే కట్టుకొనేందుకు సరైన బట్టలేదు. అయినా అడగలేదు!!

వున్న ఒక్కగదిలో అందరి మధ్య సర్దుకుపడుకొంటోంది. అయినా అడగలేదు!!!

ఈనాటికి నోరుతెరచి అడిగింది.

అడిగి లేదన్పించుకొన్నందుకు పాపం ఎంత బాధపడుతుందో ఏమో!

ఏం చెయ్యటం? తల్లికి కళ్ళద్దం వేయించకుండా ఇలా సినిమాకెళ్తే అమ్మ ఏమనుకొంటుంది? తనని నిర్లక్ష్యం చేశాననుకోదు? ఆమె అటువంటి మలదు తన మనస్సు ఒప్పుకోదు.

దూరంగా భార్య ఏడుపు వెక్కిళ్ళ రూపంలో విన్పిస్తూంది.

ఎటూ తేల్చుకోలేని గోపాలం మనసు మథనపడసాగింది.

చివరికి ఫస్టుకి జీతం రాగానే తల్లికి కళ్ళద్దాలు వేయించిన తరువాతనే మిగిలిన విషయాలు చూడాలని మనసు సరిపెట్టుకొని, భార్య కోర్కె తీర్చటానికే నిర్ణయించుకొన్నాడు.

"రాజేశ్వరీ నేనెళ్ళి ఫస్టు షోకి అడ్వాన్సు టిక్కెట్లు తీసుకొస్తాను, రెడీగా వుండు" అన్నాడు ఆమెకి దగ్గరగా వెళ్ళి.

"నిజమేనండీ" అంది రాజేశ్వరి బింకంగా కళ్ళనీళ్ళు తుడుచుకొంటూ—

"నువ్వొద్దన్నా తీసుకురావటానికే నిర్ణయించుకొన్నాను. నీ కిష్టమైంది కాకుండా, నా కిష్టమైన చీర కట్టుకొని రెడీగా వుండు" అన్నాడు భార్యని ఉత్సాహపరుస్తూ.

"నెల చివరి రోజులు వున్న ముప్పై రూపాయలతో సరుకులు తెచ్చేశారు. ఇంకా పది రూపాయలున్నాయా మీ దగ్గర?" అడిగింది రాజేశ్వరి సందేహంగా.

"అవన్నీ నీకెందుకు? టిక్కెట్లు తెస్తాను. రెడీగా వుండు" అనేసి బయటికి నడిచాడు గోపాలం.

నిజం చెప్పాలంటే గోపాలం దగ్గర రెండు రూపాయలు పైన చిల్లర మిగిలాయి. జీతం రావటానికింకా మూడు రోజులుంది. వీటితోనే ఈ మూడు రోజులు గడిపి వెయ్యాలనుకొన్నాడు. ఇప్పుడు ఈ అనుకోని అవాంతరం!

పోనీ, ఎవర్నన్నా అప్పు అడగటానికి ఇప్పటికే చాలా మందికి బాకీ పడి వున్నాడు. తీర్చలేక మొఖం చాటేస్తున్నాడు కూడ!

ఇంకా వేరే మార్గం లేక తనకున్న ఒకే ఒక ఆస్తి పాత సైకిల్! దాన్ని తీసికెళ్ళి సైకిల్ షాపులో కుదువబెట్టి పది రూపాయలు తీసుకొన్నాడు. దానితో సినిమా హాలు కెళ్ళాడు.

రాజేశ్వరికి భర్త చేత పది రూపాయలు ఖర్చు పెట్టిస్తున్నందుకు ఒక పక్క బాధగా వున్నా, మరొక పక్క ఇన్నాళ్ళకి తన కోర్కె నెరవేరబోతున్నందుకు సంతోషంగా కూడ వుంది.

చిన్నగా పాటలు పాడుకొంటూ 'చక - చకా పనులు చేసుకోసాగింది.

ఆమె పేద కుటుంబంలో జన్మించినా, ఫీజులు లేవు కాబట్టి పదో క్లాసు, వరకూ చదువుకొంది. ఈ చదువుతో పాటు కథల పత్రికలు కూడ చదివేది. ఆ కథల్లో నుండి తన స్థాయికి తగ్గట్టుగా తన దాంపత్య జీవితం గురించి చిన్న చిన్న అభిప్రాయాలు ఏర్పరచుకొంది.

భర్తతో ఎప్పుడన్నా, సరదాగా సినిమాలకి, షికార్లు కెళ్ళాలని, కాస్త ఎక్కువగా డబ్బులున్న రోజు హోటల్ కెళ్ళాలని, ఏవో ఇలాంటి చిన్న చిన్న కోర్కెలు.

కాని, కాపురాని కొచ్చిన తరువాత ఇది కూడ 'గగన కుసుమా'లని తెల్సిపోయింది.

హోటల్ కోసం ఖర్చు పెట్టే అయిదు రూపాయలతో ఇంట్లో టిఫిన్ చేసుకొంటె కుటుంబమంతా తినవచ్చునని, సినిమాకి ఇద్దరి కోసం ఖర్చు పెట్టే పది రూపాయలతో కింది తరగతి కెళ్తే ఇంట్లో అంతా చూడవచ్చునన్న మనస్తత్వం భర్తది.

భర్త మనసెరిగి తనలాగే సర్దుకుపోసాగింది.

కల్సి కూర్చో లేకపోయినా సినిమాకి ఇద్దరూ కల్సి వెళ్ళటానికి కూడ ఈ ఇంట్లో సాధ్యపడేది కాదు.

పిల్లలు నిద్రపోయారు కదాని సెకండు షోకి బయల్దేరితే, తీరా బయల్దేరే సమయానికి ఎలా కనిపెట్టే వాళ్ళో లేచి కూర్చొనేవాళ్ళు! వదిలేసి వెళ్ళటానికి అంతా చిన్నవాళ్ళు! అరచి గోల చెయ్యటంతో మానేసేవాళ్ళు! ప్రాణం ఉసూరుమనేది. అయినా ఎప్పుడన్నా రెండు మూడు నెలల కొకసారి అంతా కల్సి వెళ్తారు. ఎప్పుడన్నా ఇద్దరూ బయల్దేరితే ఇలా నానారభస అయ్యేది!

ఒకొక్కసారి అనుమానంతో నిద్రపోకుండా కాపలా కూడ కాసేవాళ్ళు!

ఎలాగో తిప్పలు పడి బయటపడ్డా ఏం లాభం?

వెళ్ళేది నేల క్లాసు కావటంతో ఇద్దరూ చెరికొక వైపు కూర్చొనే వాళ్ళు! ఆడవాళ్ళకి మగవాళ్ళకి మధ్య ఒక పొడుగాటి చెక్క అడ్డు గోడగా వుంటుంది! సినిమా ప్రారంభం ముందు, మధ్యలోను దాని మీద కూర్చొని మగవాళ్ళు చేసే ఆగడాలకి అంతు వుండదు.

ఇంటర్వెల్లో భర్త ఏదన్నా చిరుతిండి కొని మధ్య చెక్క దగ్గరకి వచ్చి అందిస్తుంటే సిగ్గుతో చితికిపోయేది! అందరూ తన వైపే చూస్తున్నారేమోనన్న ఒక విచిత్రమైన భావంతో కుంచించుకుపోయేది.

చాలా మంది ఇటూ అటూ నుంచి అందిపుచ్చుకొంటుంటారు. అయినా తనకో అదో రకమైన భయం, బెరుకు.

పై క్లాసులో నవ్వుతూ, తుళ్ళుతూ కూర్చొన్న జంటలని చూస్తే వాళ్ళ మీద చెప్పలేని అసూయ, కోపం కల్గేవి. అలాగే తన పేదరికం మీద ఏవగింపు వేసేది. మనసులో యేదో చెప్పలేని బాధ, కసి!

ఒకే ప్రదేశంలో వుండి, ఇలా భార్యాభర్తలిద్దరూ వేర్వేరుగా కూర్చోవల్సి వచ్చిన తమ దుస్థితికి తన మీద తనకే జాలి వేసేది.

ఈ బాధ ఎవరితో చెప్పుకోలేనిది వర్ణనాతీతం!

దీనికి కారణం పేదరికమే కాబట్టి, ఈ క్రింది తరగతిలో కూర్చొన్న తమ లాంటి భార్యాభర్తలందరూ ఒక్కసారిగా డబ్బున్న





వాళ్ళయిపోతే ఎంత బాగుండునని అనుకొనేది మనసులో.

"టిక్కట్లు దొరికాయ్ బయల్దేర"మంటూ గోపాలం రావటంతో రెండున్నర గంటల సేపు భర్త భుజాలపై అలవోకగా వాలి సినిమా చూస్తున్న దృశ్యం రాజేశ్వరి కళ్ళ ముందు మెదిలింది.

ఇది తన పెళ్ళయిన దగ్గర్నుండి ఊహించుకొన్న సుందర స్వప్నం!

చాలా మంది భార్యలు అందులోని అనుభూతి అనుభవిస్తున్నా తనికి అందుబాటులో లేనిది.

ఈ నాటికి తనూ అందుకోబోతుంది.

ఆమెకి గాలిలో తేలిపోతున్నట్లుగా వుంది! ఉత్సాహంతో వళ్ళంతా ఉరకలు వేయసాగింది!!

భర్త వెంట సైకిల్ లేకపోవటం చూసి ప్రశ్నించింది. ఫ్రెండికిచ్చానని అబద్ధమాడేశాడు గోపాలం! సినిమాకెళ్ళే సందడిలో ఇంకా దాని గురించి ఆలోచించలేదు రాజేశ్వరి.

మల్లెపూల కోసం భర్త చేత ఇంకో అర్ధ రూపాయి ఖర్చు పెట్టించి, మళ్ళీ ఆ పూలు అతని చేతే తల్లో పెట్టించుకొని మరీ బయల్దేరింది!

దారి పొడుగునా రాజేశ్వరి ఆపకుండా కబుర్లు చెప్పింది.

బయటకొస్తే భర్త చెయ్యి తగిలితేనే సిగ్గుపడిపోయే భార్య ఈ రోజు తన మీద పడి మరీ నడుస్తుంది!

ఆమెలో అంత ఉత్సాహాన్ని, ఆనందాన్ని ఏ నాడు గమనించలేదు గోపాలం!

సినిమా చివరి రోజు కావటంతో పై తరగతి టిక్కట్లు అయిపోయాయి! నేల టిక్కట్లు మాత్రం ఇంకా యిస్తునే వున్నారు! ఈ సినిమాకి 'క్లాసు సినిమా'గా ముద్రపడింది.

సినిమా ప్రారంభం కావటానికి ఇంకో పావు గంట టైము వుండటంతో ముందుగా టిక్కట్లు తెచ్చుకొన్న వాళ్ళు రాబోయే సినిమా వాల్ పోస్టర్లు చూస్తూ తీరుబడిగా పచార్లు చేస్తున్నారు.

దొరకని మొఖాలు అసహనంగా అటు ఇటూ తిరుగుతున్నాయి. ఆ మొఖాల్లో చివరి క్షణంలోనైనా దొరుకుతాయేమోనన్న ఆశ!

అలా తిరుగుతున్న మొఖాల్లో ఒక మొఖాన్ని చూసి గోపాలం ఉలిక్కిపడ్డాడు.

ఆయన గోపాలం పై ఆఫీసరు!

వెంట భార్య కూడ వుంది. వాళ్ళకి టిక్కట్లు దొరకలేదన్న సంగతి తెల్సిపోతూనే వుంది.

ఆయన కంటపడితే వున్న రెండు టిక్కట్లు పూడపెరుక్కోవచ్చు!

అడిగితే కాదనటానికి వీలులేదు.

ఆయన కళ్ళపడకుండా జనాల్ని చాటుచేసుకొంటూ భార్యతో మెల్లిగా హాలులో పలికి నడవసాగాడు.

ఒక్కసారి అదృశ్యమై హాల్లో పడిపోతే ఎంత బాగుండునని కూడ అనుకొన్నాడు.



శ్రీ లక్ష్మి ఎడ్యుకేషనల్ సొసైటీ (మచిలీపట్నం) వారు విజయవాడలోని తుమ్మలపల్లి వారి క్షేత్రయ్య కళామండపంలో అక్టోబరు 9న ఏర్పాటుచేసిన సభలో విద్యా సంచిక 'విభూతి' ఆవిష్కరణ, ఆంధ్ర సచిత్ర వారపత్రికలో సీరియల్‌గా ప్రచురించబడిన "ప్రేమసాగరం" నవలా రచయిత్రి శ్రీమతి ఎన్. భారతీదేవికి సన్మానం జరిపారు. సన్మానాన్ని అందుకొంటున్న రచయిత్రిని చిత్రంలో చూడవచ్చు

# బీద భార్య కోరిక

జాగ్రత్తగా అడుగులు వేయసాగాడు.

అంతలోనే 'గోపాలం' అన్న పిలుపు విన్పించి కంగారు పడ్డాడు. పిలుపు ఆఫీసరు గారిదే!

విన్పించని వాడికి మళ్ళీ భార్య చెయ్యి పట్టుకొని జనాన్ని తోసుకొంటూ లోపలికి వెళ్ళిపోసాగాడు.

ఈసారి తప్పించుకోటానికి వీలులేని అరపులాంటి కేక 'గోపాలం'

విధిలేక వెనక్కి చూశాడు.

ఆఫీసరుగారు తనవైపే చెయ్యి చూపిస్తూ పిలుస్తున్నారు.

గోపాలం ఒక్కసారిగా నీర్సపడిపోయాడు! చెమటతో చొక్కాంతా ముద్దయింది.

భార్యని అక్కడే నిలబెట్టి బరువుగా ఆయనవైపు అడుగులు వేశాడు.

"ఏమోయ్ గోపాలం, సినిమా కొచ్చారా?" పల్కరించాడు.

గోపాలం మౌనంగా తలూపాడు.

"మాకు టిక్కట్లు దొరకలేదోయ్"

"అలాగండీ......" అనేసి వూరుకొన్నాడు గోపాలం.

"చాలా ముందుగానే వచ్చాము. అయినా దొరకలేదోయ్." ఈసారి కూడ గోపాలం "అలాగండీ ...." అని వూరుకొన్నాడు.

"హాలు మేనేజరుని కూడ కల్సాను. అయినా దొరకలేదోయ్....."

ఈ సారి కూడ గోపాలం అదేపని చేశాడు.

ఇంకా ఆఫీసరుగారు లాభం లేదనుకొని, "నువ్వొక హెల్ప్ చెయ్యాలోయ్" అన్నాడు.

గోపాలం గుండె గుభేల్ మంది.

"మీరెండు టిక్కట్లు మాకిచ్చెయ్య గలవా?"

ఆయనంత నిర్మొహమాటంగా అడుగుతుంటే గోపాలంకి నోట మాట రాలేదు!

"ఎందుకంటే. కంది ఆడ మగ నేలబుకింగ్స్ రెండూ ఇంకా ఖాళీగానే వున్నాయి. జనం కూడ లేరు. మాలాంటి వాళ్ళం వెళ్ళి అందులో కూర్చోలేము కదా! మీకైతే అలాంటి ఇబ్బందులు వుండవను కొంటాను."

గోపాలం మాటలుకోసం తడుముకోసాగాడు.

"నువ్వే చెప్పు? ఫామిలీతో వచ్చాను. ఎలా వెనక్కి వెళ్ళమంటావ్?"

ఇక్కడ జరుగుతున్నదేమిటో తెలియక, త్వరగా రమ్మన్నట్లు తనవైపే ఆరాటంగా చూస్తున్న భార్యమొఖం చూస్తుంటే గోపాలంకి నోరు తెరచి మాట్లాడలేక పోతున్నాడు.

"ఏమిటోయ్ ఆలోచిస్తున్నావు?" ఈసారి ఆఫీసరుగారి కంఠంలో 'ఆఫీసరు హోదా' ధ్వనించింది.

"అబ్బె..... ఏం.... లే.... దు సార్" తడబడ్డాడు.

"మరేమిటి –? ఇష్టం లేక పోతే చెప్పు, వెళ్ళిపోతాం!" ఈసారి కఠంలో 'బెదరింపు'.

"అదేం లేదుసార్ మీరే వెళ్ళండి" అంటూ ఛటుక్కున జేబులో రెండు టిక్కట్లు తీసి ఆయన చేతిలో పెట్టేశాడు.

"మరైతే టిక్కట్ల పదిరూపాయలు వుంచుకో" అంటూ ఆఫీసరు గారు జేబులో చెయ్యి పెట్టబోయారు.

"ఫర్వాలేదు వుంచండి సార్" తీసుకోటానికి మొఖమాటపడ్డాడు గోపాలం

"సర్లే. ముందు మీరెళ్ళి టిక్కట్లు సంపాదించుకోండి. పిక్చరు స్టార్ట్ అవుతున్నట్లుంది. ఇంక మేము వెళ్తాం" అంటూ భార్యతో జనంలో కల్సిపోయారు ఆఫీసరుగారు.

ఎంత త్వరగా వెళ్ళి కుర్చీల్లో కూర్చొందామా అని ఆరాటంగా, అమాయకంగా ఎదురుచూస్తున్న భార్య కీసంగతి చెప్పటానికి నడుస్తుంటే గోపాలంకి అడుగులు పడటం లేదు.

అతని మనసు "భగవంతుడా! ఒక్కసారి భూమి బ్రద్దలయి నన్నందులో కూరుకు పోయేటట్లు చెయ్యిస్వామి" అంటూ ఆక్రోశించింది!! □




# బైద్యనాథ్ ఆరోగ్యదీపిక

## పాఠకుల ప్రశ్నలకి బైద్యనాథ్ ఆయుర్వేద భవన్ వైద్యప్రముఖుని సమాధానాలు

**బి. టి. సుందరి, గుడివాడ**

ప్ర. ఆయాసం, దగ్గు, పిల్లికూతలు వస్తున్నాయి?

జ. మిరు శ్వాసకోశ వ్యాధితో బాధపడుతున్నారు. బైద్యనాథ్ మల్లసింధురం 3 (గా. + 2) సమిరపన్నగ రసం 3 (గా + 3) ప్రవాళ భస్మం 6 గ్రా. కలిపి 40 డోసులుచేసి రోజు రెండు పొట్లంలు తేనెతో (బైద్యనాథ్ మధు) ఉదయం తీసుకోవాలి. బైద్యనాథ్ దశ మూలారిష్ట భోజనం తర్వాత 3 చెంచాల నీళ్లతో రెండు పూటలు వాడవలెను. ఈ విధముగా 3 మాసాలు తప్పక చేయవలెను. అపత్యం: వంకాయ, పుంటికూర, దుంపకూరలు, శనగపిండి పదార్థంలు. డాల్డా.

**సాయిప్రసాద్, రాజమండ్రి**

ప్ర: తల వెంట్రుకలు వత్తుగా పెరగాలంటె ఏం చేయాలి?

జ: బైద్యనాథ్ మహబృంగరాజ్ తైలము మెడికొటిడ్ రోజు తలకు వాడవలెను. మరియు వారంలో ఆ నూనెతో రెండు పర్యాయంలు తలస్నానం చేయవలెను.

బైద్యనాథ్ ద్రాక్షాసవ స్పెషల్ భోజనం తర్వాత 3 చెంచాలు నీళ్లతో వాడవలెను. ఈ విధంగా కనీసం 6 నెలలు చేయవలెను.

**పి. రమణారెడ్డి, నడిగడ్డ, కె. శ్రీరామమూర్తి, విజయవాడ**

ప్ర పక్షవాతంతో బాధపడుచున్నాము. నివారణ?

జ. ఈ క్రింది బైద్యనాథ్ మందులు కనీసం 6 నెలలు వాడవలెను.

బృహత్ వాత చింతామణి 6 గ్రా + యోగేంద్ర రసం 6 గ్రా + అశ్వగంధాచూర్ణం 60 గ్రా. అన్నీ కలిపి 60 పొట్లాంలుచేసి ఉపయం సాయంత్రం తేనేతో తీసుకోవాలి.

వాత గజాంకుష రసం 1 గోలీ, దశమూలారిష్ట 3 చెంచాలు నీళ్లతో భోజనం తర్వాత రెండుపైన మహతూష తైలం రోజు మాలిష్ చేయించవలెను. వాత ప్రకోప వెందు ద్రవ్యాలు నిషిద్ధం, తినవద్దు.

**అజీముద్దీన్, మెదక్**

ప్ర: హటాత్ పరిణామాలపై గుండె వేగంగా కొట్టుకుంటుంది. నివారణ?

జ: నరముల మరియు హృదయ బలహీనతవల్ల ఈవిధంగా అవుతుంది. అందుకు బైద్యనాథ్ వైటిక్స్ గోలీలు రోజుకు 1 రెండు పూటలు. ఉదయం సాయంత్రం. బైద్యనాథ్ ప్రభాకరవటి 1 గోలీ, అర్జునారిష్ట 3 చెంచాలు రెండు పూటలు భోజనం తర్వాత ఈ మందులు 1 సం. రం కనీసం వాడవలెను క్రొవ్వును ఇచ్చు పదార్థంలు వాడరాదు.

**టి. వి. సుబ్బరాయుడు, కర్నూలు**

ప్ర: కీళ్లవాతానికి నివారణ?

జ ఈక్రింది బైద్యనాథ్ మంద|లు వాడవలెను. మహయోగ రాజగుగ్గులు. 1 + గోక్షురాది గుగ్గులు 1 + కాంచనార గుగ్గులు 1 మొత్తం 3 గోళీలు మహారస్నాది క్వాథం 3 చెంచాలు + నీళ్లతో రెండు పూటలు

వాత గజాంకుష రసం 1 గోలీ.

దశకోలారిష్ట 3 చెంచాలు + నీళ్లు రెండు పూటలు భోజనం తర్వాత ఈ విధంగా 3 నెలలు కనీసం వాడపలెను వాత ప్రకోప ద్రవ్యాలు, దుంపకూరలు, గోంగూర, వంకాయ, డాల్డా వాడవద్దు.

**జి. శర్మ, జమ్‌షడ్‌పూర్, ఆర్. మానస, గుంటూరు జిల్లా**

ప్ర: నల్ల తెల్ల మచ్చలకు నివారణ తెలుపండి?

జ రక్తదోషంవల్ల ఈ విధంగా మచ్చలు వస్తాయి. ఈ క్రింది బెద్యనాథ్ మందులు వాడండి.

రక్తశోధన్‌వటి 2 గోలీలు + బైద్యనాథ్ సురక్షా స్ట్రాంగ్ 4 చెంచాలు + నీళ్లు. ఈ విధంగా రోజుకి రెండు పూటలు వాడండి

బైద్యనాథ్ ఆరోగ్య వర్ధనివటి 1 గోలీ భోజనానికి ముందు రెంశు పూటలా వాడాలి. ఈ విధంగా కనీసం 6 మాసాలు వాడండి. అపత్యం దుంపకూరలు, శనగపిండి పదార్థాలు, స్వీట్సు, డాల్డా మొ. నవి.

**కె. మనోరంజనమ్మ, కడప.**

ప్ర: అమిబియాసిస్‌కు నివారణ తెలుపండి?

జ. శ్రీ బైద్యనాథ్ ఈ క్రింది మందులు వాడండి. (1) అమిబికా రోజుకు 4 గోలీలు, ఉదయం, సాయంత్రం విడంగారిష్ట 3 చెంచాలు భోజనం తర్వాత. పాలు వాడవద్దు, కారం, పులుపు వాడకూడదు ఎక్కువ మజ్జిగ వాడాలి. ఈ విధంగా కనీసం 3 మాసములు చేయవలెను.

**జి. నాగవల్లి, గుంటూరు, ఎస్. అమూల్య, దివాస్, ఎమ్. పి.**

ప్ర లావుతగ్గడానికి చికిత్స తెలుపండి.

జ మోదొవిణంగాధి చూర్ణం 1/2 చెంచా రోజు రెంశు పర్యాయంలు తెనెతో. త్రిఫలా గుగ్గులు 1 గోలి, దశమూలారిష్టతో 4 చెంచాలు భోజనం తర్వాత. రెండు పూటలు. శ్రీ బైద్యనాథ్ మందు వాడాలి. మరియు యోగాభ్యాసం చేసినా సత్ఫలితాలు కన్పడుతాయి. ఈ విధంగా కనీసం 6 మాసాలు చేయాలి. □

---

**కూపన్**

**ఆంధ్ర సచిత్ర వారపత్రిక**

**బైద్యనాథ్ ఆరోగ్య దీపిక**

ప్రశ్న :...............................................

...............................................

...............................................

పంపినవారి పేరు :

పూర్తి చిరునామా :





ఆలోచించి చూడండి! అతి తెలివిగా,
తోడుగా వచ్చే జాడీలకు కూడా,
విడిగా డబ్బులు అడిగే మిక్సీ
మీకు అవసరమా?

ఆలోచించండి మిగిలిన చిల్లరకి వక్కపొడి కొన్నట్లు కాదు మిక్సీని కొనుట ఎంతో డబ్బుతో కూడిన ప్రశ్న ఇది. అట్లాగే ఎంతో ఆలోచనతో కూడిన ప్రశ్న కూడా అందువలనే మీనుమిక్స్ గురించి ఆలోచించండి.

**ఆలోచించండి.** ఎటువంటి వాతావరణమైనను అవలీలగా ఎదుర్కొను శక్తి మీనుమిక్స్ యొక్క మోటారుకు గలదు

**ఆలోచించండి** ఎంతటి కరెంటు మార్పులైనను, ఈ మోటారు యొక్క పని చేయు శక్తిని తగ్గించలేవు.

**ఆలోచించండి.** ఒక ½ లీటరు స్టీల్ జాడీని [లోపల అమర్చబడిన బ్లేడ్‌తో సహా] మీరు పైసా ఖర్చు లేకుండా తీసుకెళ్ళవచ్చు - ఆదిలోనే మీకు 150 రూపాయలు లాభం.

ఆలోచించండి రెండు జాడీలలోను పర్మనెంటుగా అమర్చబడిన బ్లేడులు వలన మీకు ఎంతో హాయి, సుఖము తక్కువ శ్రమ

ఆలోచించండి, ధృఢత్వము, తక్కువ స్థలము ఆక్రమించుకొనే తయారీ గల మీనుమిక్స్ వలన మీకు ఎంతో హాయి

మరింక ఎన్నో విషయాలు గూర్చి ఆలోచించండి—

**ISI** వారి చేత చేయబడిన 27 కష్టతరమైన నాణ్యతా పరీక్షల ధాటిని తట్టుకున్న మీనుమిక్స్

ఏ లోసుగులు లేని, ఒక సంవత్సరపు గ్యారంటీలో పాటు వచ్చు మీనుమిక్స్

ఎప్పుడూ తయారుగా ఉండే సర్వీసింగ్ సెంటర్లతో పాటు వచ్చు మీనుమిక్స్

మొట్టమొదట ISI గుర్తును గెల్చుకున్నది మీనుమిక్స్ ఉన్న, నిజము

18 సంవత్సరముల క్రితము అమ్మిన మీనుమిక్స్ ఇంకా మంచి స్థితిలో ఉన్నది. నిజము

మీనుమిక్స్‌ను మీకు తెచ్చే కంపెనీ, భారతదేశములోనే మొట్టమొదట ఎలక్ట్రానిక్ ఫుడ్ ప్రాసెసర్ తయారుచేయుటకు నైపుణ్యము కల్గినవారు

మీ ఆలోచనలను రేకెత్తిస్తుందా? తోని చూడండి

# Meenumix



*Meenumix*
*— for those who think beyond the big names and namesakes*
Meenu Equipments
P O Box No 6909 Coimbatore 641 044

**Regional office/Service Centres : Bangalore Ph : 72765 ; Cochin Ph 351596 , Hyderabad Ph 67327 , Madras Ph 4746917469l**
**ANDHRA : Authorised Stockists : HYDERABAD : Instyle,** 3-6-477/2, Himayatnagar **(Ph 61664) VIJAYAWADA Sunil Engineering Company**
**Opp : Tarapet Goods Shed, Pandit Jawaharlal Nehru Road (Phone : 77357) VISAKHAPATNAM Andhra Trunk Works 26-15-39, Main Road (Phone 63448)**

# సూపర్ హీరోయిన్ విజయశాంతి సమాధానాలు



**యస్. మునుస్వామి, కర్నూల్**

శాంతి నివాసం ఎక్కడా?

మీ జోక్ చాలా చప్పగా వుంది. అయినా చెబుతున్నా "టి...ర్" లో!

**ఐరేని శ్రీనివాస్‌గౌడ్, రామాయంపేట**

ఈ రాకెట్ యుగంలో, అతివేగంగా దూసుకు వస్తున్న తెలుగు చిత్రాలపై మీ అభిప్రాయం?

రాకెట్ యుగం అని అంటున్నారుగా! ఏదైనా సరే జోరు... హుషారు వున్న చిత్రాల్నే కాకుండా చక్కని కథా చిత్రాల్ని కూడా ప్రేక్షకులు చూస్తున్నారు.

**బి. శారద, ధర్మవరం**

ఒక నటి లేక నటుడు తన పాత్రలో లీనమై నటిస్తూ చనిపోతే ఆ పాత్రలో జీవించనట్లా లేక మరణించినట్లా?

ఆ పాత్రకు పరిపూర్ణత చేకూర్చి తాను చేస్తున్న నటనతో తన జీవితాన్ని ధన్యం చేకూర్చుకున్నట్లే!

**డి. అపర్ణ, విశాఖపట్నం**

ప్రేమించే యువతీ యువకులకు ఎప్పుడూ కష్టాలెదురవుతాయి ఎందుకని? మీ రెప్పుడైనా అలాంటి ప్రాబ్లమ్ ఫేస్ చేసారా?

"కష్టే ఫలి" అన్నారు. నా కింత వరకూ యీ సమస్య ఎదురు కాలేదు.

**కె. పద్మ, పరిగి**

ఎక్కువగా చదువుకున్న అమ్మాయి . తక్కువగా చదువుకున్న అబ్బాయిని వివాహం చేసుకోవచ్చు అని నేను అంటాను మీరేమంటారు?

మీది ఛాందస స్వభావం అంటాను. యీ రోజుల్లో ఎక్కువ... తక్కువ అనేది ఉండకూడదని నా అభిప్రాయం.

**గీతాదేవి, చేబ్రోలు**

స్త్రీ కోరుకునేది డబ్బా తనకే సొంతమయిన మగవాని మనస్సా?

తన మాంగల్యం పదిలంగా వుండాలనే ఏ స్త్రీ అయినా కోరుకుంటుంది. ఆ తర్వాతే కీర్తి. ప్రతిష్టలు గురించి ఆలోచిస్తుంది.

**కె. పద్మాంజలి, పాలకొండ**

అన్నిరకాల పాత్రలు నటించటం వలన నిజమైన తృప్తి వుందా? లేక ప్రేక్షకులకు నచ్చిన యూన్ని లాంటి పాత్రలలో తృప్తి వుందా?

నటి అన్న తర్వాత నవరసాల్ని పోషించి తీరాలి. ఫలానా పాత్రలకు మాత్రమే పరిమితం కాకూడదు.

**వై. వెంకట రమణమూర్తి, సోంపేట**

మీలో దాగి వున్న నటనాశక్తిని వెలికితీసిన ప్రతిబావంతుడు దర్శకులు టి కృష్ణ గారని అంటాను ఏమంటారు?

మీరన్నది నిజమేనని మీతో ఏకీభవిస్తాను.

**జి. యస్. ఆర్. చంద్రశేఖర్, కైకలూరు**

మనిషి దొంగగా, హంతకుడిగా మారడానికి కారణం – క్రమశిక్షణతో పెంచని వారి తల్లి తండ్రులేనని నా అభిప్రాయం?

తల్లితండ్రులే కాదు చుట్టూ వున్న సమాజం కూడా కొంత వరకు దోహద పడుతుంది.

**అరసవిల్లి యోగీశ్వరరావు, కాశీబుగ్గ**

సాంఘిక చిత్రాలు తప్ప పౌరాణిక జానపద చిత్రాల్లో మీరు నటించడం లేదు ఎందుకని? కారణం తెలుపరూ ?

కారణం అంటూ ప్రత్యేకించి ఏమి లేదు. అవకాశం ... సందర్భం కుదిరితే తప్పక చేస్తాను.

**జి. సావిత్రి, టెక్కలి**

అన్నిరకాల పాత్రలు మీరు చక్కగా నటిస్తూ నటిగా మీకు మీరే సాటి అని నిరూపించుకుంటున్నారు ఓ ఫొటో పంపరూ?

నాపై మీకున్న అభిమానానికి కృతజ్ఞతలు. ఫొటోను పొందే అర్థవంతమయిన ప్రశ్నను పంపండి. ఫొటోను పొందండి.

**యస్. వి. యస్. సాయిలక్ష్మి, విజయనగరం**

విజయలలిత గారు మీ మేనత్త అని విన్నాము నిజమేనా?

అక్షరాలా నిజం!

**సి. హెచ్. నాగేశ్వరరావు, ఖరగ్‌పూర్**

జయసుధ – శివరంజని, జయప్రద – సిరిసిరి మువ్వ, సుహాసిని – స్వాతి, భానుప్రియ – సితార, మరి మీరు?

నాటి – "నేటి భారతం"; నిన్నటి – "ప్రతిఘటన"; ఈనాటి – "రేపటి పౌరులు" ఇవన్నీ మీరు అభిమానించినవే కదా!

**వక్కలంక రామారావు, మానేపల్లి**

ఏ వృత్తిలో నయినా "తృప్తి' ముఖ్యమంటారు మీ వృత్తిలో మీకు "తృప్తి లభించిందా?

ఎప్పుడో! అయినా అంతకన్నా మించిన "తృప్తి" లభిస్తుందని నిరంతరం కృషి చేస్తా!! సాధిస్తాననే నమ్మకం వుంది!!!

**వై. వెంకటరమణా రెడ్డి, కడప**

తాత్కాలిక ఆనందాన్నిచ్చే చిత్రాల కన్నా సభ్యసమాజంలో కొంత వరకైనా మార్పు తెచ్చే "సందేశాత్మక' చిత్రాలే గొప్ప అని నా అభిప్రాయం? మీరేమంటారు?

మీ చక్కని అభిప్రాయానికి నా అభినందనలు

**గ్రంధి వెంకట సుబ్బలక్ష్మి, అనకాపల్లి**

భర్త చనిపోతే బొట్టును ఏ స్త్రీ ఈ రోజుల్లో తీయడం లేదు చలన చిత్రాల్లో మాత్రం యింకా విధవల్ని చేయడం వంటి దృశ్యాలు చూపుతూనే వున్నారు ఈ విషయంలో మన దర్శకులు యింకా ఎదగలేదని అంటాను అవునంటారా? కాదంటారా?

ఎక్కడో ఏ మారుమూలనో మీరు చెప్పినట్లు జరుగుతుందేమో! సనాతన కుటుంబాల్లో ఎక్కడా యిలా జరగడం లేదనే నమ్మకంతో నే మన దర్శకులు మన సాంప్రదాయకం ప్రకారం సన్నివేశాలు తీస్తున్నారు... మీరు చూస్తున్నారు!

**పి. రవి, అనపర్తి**

సినిమాల ప్రభావం ప్రజల మీద ఎంతయినా వుంది జాతీయ సమైక్యతను పెంపొందించే చిత్రాల్ని ప్రభుత్వమే నిర్మించి ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయవచ్చుకదా?

ఈ ప్రశ్న నన్ను అడగవల్సింది కాదేమో!

ఈ వారం ఉత్తమ ప్రశ్నగా ఏది ఎన్నిక కాలేదు

సం □

అక్కచెల్లెళ్ళ అనుబంధం - అన్నదమ్ముల రసకందం - రంగరించిన ప్రేమగంధం - వెండితెరకే ఒక అందం!

యం. బాలయ్య బి.ఇ.
సమర్పించు

అమృతా ఫిలిమ్స్ వారి

తప్పక
చూడండి!

# పసుపుతాడు

కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం
యం. బాలయ్య బి.ఇ.,

నిర్మాతలు
అలపర్తి సూర్యనారాయణ
మన్నవ వెంకట్రావు

అందాలు చిందే ఫ్రెస్కా.
సుగంధాలు చిమ్మే ఫ్రెస్కా.





''హంతకుడి వేట''లో స్మిత

## మురళీమోహన్ సమర్పించే "నమ్మినబంటు"

"సోషల్ ఎలిమెంట్ తో బాటు అనిమల్ సెంటిమెంట్‌తో కలబోసిన కథ. నేను రాంబాబు అనే ప్రభుత్వాధికారి, నాకు సదా హనుమంతునిలా తోడుగా వుండే శునకం హనుమ. ఓ ఊరిలోని దుష్టత్రయమైన నూతన్‌ప్రసాద్, గిరిబాబు, శివప్రసాద్‌ల ఆగడాలను అరికట్టడానికి నేను ప్రయత్నిస్తే, వాళ్ళు నా అడ్డు తొలగించుకొంటారు. అప్పుడు ఆ దుష్టత్రయంపై హనుమ ఎలా పగ తీర్చుకుంటుందన్నది ఇతివృత్తం. నేను ఇదివరలో నటించిన, పొట్టేలు పున్నమ్మ, మన ఊరి మారుతి" వగైరా అనిమల్ సెంటిమెంట్ ఉన్న చిత్రాలన్నీ హిట్స్ అయ్యాయి. ఈ చిత్రంలో శునకం బ్రౌనీ విస్మయం కలిగిస్తుంది. ఏలూరు ప్రాంతాలలో నే అక్టోబర్ 5 నుంచి 15 వరకు తొలి షెడ్యూల్ జరిగింది. మలి షెడ్యూల్ నవంబర్ 1 నుంచి ౨౦ వరకు", అన్నారు హీరో మురళీమోహన్. ఈయన సమర్పించే జయభేరీ ఆర్ట్ ప్రొడక్షన్స్‌వారి పై చిత్రంలో రజని నాయిక. పవిత్ర మరోపాత్రను ధరిస్తోంది. గణేష్‌పాత్రో మాటలు, వేటూరి పాటలు,

# సినిమా విశేషాలు

-జి.వి.జి.

చక్రవర్తి సంగీతం, కె. ఎస్. హరి ఛాయ, రామచంద్రసింగ్ శిల్పం, రాజేంద్ర సంయుక్త దర్శకత్వం, రామకృష్ణరాజు సహకార దర్శకత్వం, సాహుల్ సాహసాలు, కిశోర్ నిర్వహణలో మాగంటి వెంకటేశ్వరరావు నిర్మిస్తున్న ఈ చిత్రానికి రవిరాజా పినిశెట్టి స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు.

## డిసెంబరులో "గురుబ్రహ్మ"

తెలుగునాటనే గాక దక్షిణ భారత దేశంతోపాటు ఉత్తర భారతంలో సైతం పేరు ప్రతిష్ఠలు సంతరించుకున్న సురేష్ ప్రొడక్షన్స్ పతాకంపైన ప్రసిద్ధ నిర్మాత డి. రామానాయుడు తాజాగా నిర్మిస్తున్న మరో ప్రతిష్ఠాత్మక చిత్రం గురుబ్రహ్మ రెండవ షెడ్యూలు ఈనెల 18 న అన్నవరం సత్యనారాయణస్వామి కొండపైన అక్కినేని నాగేశ్వరరావుపై తీసిన క్లైమాక్స్ దృశ్యాలతో ముగిసింది:

అన్నవరం సత్యనారాయణస్వామి సాన్నిధ్యంలో "ఓ బ్రహ్మ, ఓ విష్ణు, ఓ మహేశ్వరా, కన్నబిడ్డ పెళ్ళికి, కన్నతండ్రి చావుకి కుదిరింది శుభలగ్నం మి

దయవల్ల, కన్నారా ఎప్పుడైనా ఆడపిల్లను. వింటారా ఇప్పుడైనా కన్నవారి గోడును" అన్న వేటూరి వ్రాసిన ఈ చరణాలను బాలసుబ్రహ్మణ్యం హృదయాన్ని ద్రవింపచేసేలా పాడగా అక్కినేనిపై దర్శకుడు బోయిన సుబ్బారావు చిత్రీకరించారు.

ఆదర్శాలకు నిలిచి అష్టకష్టాలను సైతం లెక్కచేయక విద్యాబోధనకు, నీతికి, నిజాయితీకి ప్రాధాన్యత నిచ్చి విద్యార్థులను ఉత్తమ పౌరులుగా తీర్చి దిద్దే ఉత్తమ ఉపాధ్యాయుడైన శంకరం మాష్టారుగా అక్కినేని నటన ఆయన నటజీవనంలో మరో మైలురాయిగా ప్రేక్షకుల హృదయాల్లో నిలిచిపోగలదు.

భర్త ఆదర్శాలను గౌరవించి ఆయనకు అన్ని విషయాల్లోనూ జీవిత భాగస్వామిగా మూడుసార్లు ఊర్వశి అవార్డు పొందిన శారదకు తన నటనా సామర్థ్యాన్ని మరోమారు ప్రేక్షకుల ముందు ప్రదర్శించడానికి లభించిన మరో చక్కని అవకాశాన్ని ఆమె వినియోగించుకున్నారు.

ఈ చిత్రంలో సత్యనారాయణ, రమాప్రభలు భార్యాభర్తలుగా ప్రేక్షకులను కడుపుబ్బ నవ్వించగలరు. అతి పిసినారి చదువులేని పాత్రలో సత్యనారాయణ, చదువు, సంస్కారంగల ఇల్లాలుగా రమాప్రభ ఎప్పుడు చిన్న చిన్న విషయాలకు తగాదా పడుతుంటే వీరి మధ్య వేలుచేరి సన్నివేశాలను మరింత రక్తి కట్టించి ప్రేక్షకులకు వినోదాన్ని అందిస్తారు.

శంకరం మాష్టారు ఆదర్శాలకు అనుగుణంగా రూపొందిన శిష్యులుగా రాకేష్, చంద్రమోహన్ నటిస్తున్నారు. ఈ చిత్రం ద్వారా నూతన నటుడు రాజా తెలుగు తెరకు పరిచయమవుతున్నారు.

ఇతర పాత్రల్లో శరత్‌బాబు, పరుచూరి గోపాలకృష్ణ, మాడా, త్యాగరాజు, రజని, తదితరులు నటిస్తున్నారు. గతంలో అనేక చిత్రాల్లో నటించి నట్లుగానే యిందులో కూడా ఒక పాత్రలో రామానాయుడు నటించి ప్రేక్షకుల మన్ననలను పొందనున్నారు.

గోదావరి నది తీరంలోనూ, కపిలేశ్వరపురంలోని యస్. బి. కె. పట్టాభి రామారావు యింట్లోను, అన్నవరంలోను రెండవ షెడ్యూలు పూర్తి చేసుకున్న ఈ చిత్రం తుది షెడ్యూలు హైదరాబాద్‌లో జరుగుతుంది. డబ్బింగ్ తదితరాలు నవంబర్లో పూర్తయి డిసెంబర్ 25న విడుదల అవుతుంది.

ఈ చిత్రానికి కథా రచన – పరుచూరి సోదరులు. సంగీతం – చక్రవర్తి, పాటలు – వేటూరి, ఫొటోగ్రఫీ – యం. వి. రఘు, ఎడిటర్ – మార్తాండ్, నృత్యాలు – రఘు, నిర్మాత – డి. రామానాయుడు, దర్శకత్వం – బోయిన సుబ్బారావు.

రాజమండ్రికి 45 కిలోమీటర్ల దూరంలోని కపిలేశ్వరపురం గ్రామానికి సమీపంలో విశిష్ఠ నది ఒడ్డున అనేక దశాబ్దాలుగా నిలిచి వున్న అతి పెద్ద మర్రిచెట్టు వద్దనున్న దృశ్యాలను చిత్రీకరించడం రెండవ షెడ్యూలులో హైలైట్.



"గురుబ్రహ్మ"లో దగ్గుబాటి రాజా, రజని

# సంచలన దర్శకుడు టి. కృష్ణ మృతి



సంచలన దర్శకుడు శ్రీ టి. కృష్ణ (36)మద్రాసులోని అపోలో ఆస్పత్రిలో 1986 అక్టోబరు 21వ తేది తెల్లవారు ఝామున కాన్సర్ వ్యాధితో కన్ను మూసారు.

"నేటి భారతం" చిత్రంతో తెలుగు చిత్ర రంగంలో ఈయన కొత్త మలుపు తీసుకు వచ్చారు.

శ్రీ కృష్ణ డైరెక్టు చేసిన చిత్రాలలో "వందేమాతరం", "దేవాలయం", "దేశంలో దొంగలు పడ్డారు", మొదలయినవి బహుళ ప్రజాదరణ పొందాయి. కాగా "ప్రతిఘటన" కొత్త అధ్యాయాన్ని సృష్టించింది. "రేపటి పౌరులు" చిత్రం యిప్పుడు ఆంధ్రప్రదేశ్ అంతటా ప్రదర్శింప బడుతోంది.

డైరెక్టర్ రామినీడు వద్ద 1969-70లో కొద్ది కాలం సహాయ దర్శకునిగా పని చేసిన కృష్ణ, ఆనాటి సినీ రంగ వాతావరణంలో ఇమడలేక స్వస్థలం తిరిగి వచ్చారు. తన మిత్రుడు మాదాల రంగారావు నటునిగా స్థిరపడి కృష్ణను మళ్లీ మద్రాసు తీసుకు వెళ్లారు. మాదాల స్వంత చిత్రాలలో కృష్ణ పని చేశారు, నటించారు కూడా.

స్వంత బ్యానర్ ఈతరం పిక్చర్స్ పై "నేటి భారతం" నిర్మించిన కృష్ణ దర్శకునిగా తన ప్రతిభ చాటడమే గాక, విజయశాంతి సుమన్‌లకు లైఫ్ ఇచ్చారు. ప్రతిభగల అనేక మంది జూనియర్ ఆర్టిస్టులకు అవకాశమిచ్చి ప్రోత్సహించారు.

కృష్ణ నిర్మించిన లేక దర్శకత్వం వహించిన చిత్రాలు దాదాపు అన్నీ ఉత్తమ చిత్రాలుగా ప్రభుత్వ అవార్డులు గెలుచుకున్నవే. ఉత్తమ దర్శకత్వానికి కె. వి. రెడ్డి అవార్డును ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు నుండి అందుకున్నారు. ప్రతిష్టాకరమైన విజయలక్ష్మి స్మారక అవార్డుకు ఈ సంవత్సరానికి కృష్ణ ఎంపిక చేయబడ్డారు.

అతి స్వల్ప కాలంలోనే తెలుగు చలన చిత్ర జగత్తులో సంచలన దర్శకునిగా గుర్తింపు పొంది, అకాల మృత్యు వాత బడ్డ శ్రీ టి. కృష్ణ అంత్యక్రియలు 23వ తేది ఆయన స్వగ్రామమైన కావుటూరి వారి పాలెంలో జరిగాయి.

శ్రీ కృష్ణకు భార్య, ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు ఉన్నారు.

పిన్న వయస్సు లోనే ఉన్నత శిఖరాల నందుకున్న కృష్ణ మరణంతో తెలుగు చలన చిత్ర ప్రపంచం ఒక గొప్ప దర్శకుడిని కోల్పోయింది. □

## "పడమటి సంధ్యారాగం"లో విజయశాంతి







## "శాంతి నివాసం"లో రేఖ అశాంతి

రేఖ (సుహాసిని) చెప్పిందంతా విన్నాక లలిత (రాధిక) హృదయం ద్రవించింది. "రేఖా, నువ్వు చెప్పిందంతా విన్నాక రవిబాబు లాంటి మంచి మనిషికి నువ్వు ఇల్లాలు వైనందుకు ఒక పక్క ఆనందంగా ఉంది. కాని, పసిపాప శాంతి పోవడం తలచుకుంటే మరో పక్క విషాదంగా ఉందే"? అంది.

"లలితా! పాప పోయిన క్షణం నుంచి ఆయన పూర్తిగా మారిపోయారే? తిండి నిద్ర వృత్తి ఏదీ కూడా పట్టించుకోకుండా పిచ్చివాడిలా తయారయ్యారు. ఆయన్ని ఎలా మామూలు మనిషిని చెయ్యాలో, ఎలా మార్చాలో నాకు అర్థం కావడం లేదు", అంటూ రేఖ నిట్టూర్చింది.

"నువ్వు బాధపడకు, రేఖా! మీ వారితో నేను మాట్లాడి చూస్తాను. డాక్టరు తన వృత్తిలో ప్రతి మనిషికీ ప్రాణం పొయ్యాలనే చూస్తాడు. కాని, ప్రతి సారి ప్రయత్నం ఫలించాలనే లేదు. ఒక్కోసారి చేపట్టిన కేసులో ఓటమి ఎదురవుతుంది. అంత మాత్రాన వైద్య వృత్తి మానేసి, విరక్తి పెంచుకో నక్కర్లేదు".

"నువ్వు చెప్పింది నిజమేనే! ఓ తోటి డాక్టర్‌గా నువ్వు ఆయనకి అర్థం అయ్యేటట్టు చెప్పి, ఆయన్ని మామూలు మనిషిని చేస్తే, బ్రతుకంతా నీకు ఋణపడి ఉంటాను".

"తప్పకుండానే, రేఖా! నా శాయశక్తులా ప్రయత్నిస్తాను", అని డాక్టర్ లలిత అంటున్నప్పుడు ఆమె రేఖ కళ్ళకు ఒక దేవతలా కనిపించింది.

కృష్ణ హీరోగా భీశెట్టి కథతో అంగరసత్యం నిర్మించే రాజలక్ష్మీ మూవీస్ వారి పై చిత్రానికి జి. రామ్మోహనరావు దర్శకుడు. □

# అభిమాన తారలపై అభిప్రాయం

'సిరిసిరి మువ్వ' చిత్రం చూసిన నాటి నుండి జయప్రద అభిమానిని అయ్యాను. ఆ చిత్రంలో మూగపాత్రలో అమోఘంగా నటించి నన్ను ఆకర్షించింది. అంతులేని కథ, అగ్నిపూలు, సీతా రాములు, మేఘసందేశం, సాగర సంగమం మొదలగు చిత్రాలలోని క్లిష్టమైన పాత్రలను అత్యంత అద్భుతంగా పోషించింది. జయప్రద



అంటే గ్లామర్ + టాలెంట్ ఉన్నతార అని నిరూపించింది. కాని ఈ మధ్య వస్తున్న చిత్రాలలో మంచి నటనకు అవకాశం గల పాత్రలు ధరించుటలేదు. ఇక నుండి ఒక చిత్రంలో నటించేముందు ఆ పాత్ర యొక్క స్వరూప స్వభావములు, ఔన్నత్యము, నటనావకాశము మొదలగు విషయాలను పరిగణలోనికి తీసుకొంటే ప్రేక్షకుల హృదయాలలో కలకాలం నిలిచి పోతుంది. ఉత్తమమైన, ఉన్నతమైన నటనకు అవకాశం కల్పించే విలక్షణమైన పాత్రలో మహోన్నతముగా నటించి జాతీయ స్థాయిలో అవార్డు పొంది, దశదిశల కీర్తింప బడాలని అభిమానిగా నా ఆశ, ఆకాంక్ష.

-మర్రిపాటి వెంకట రమణ, నగరంపాలెం, గుంటూరు

★ ★ ★

మా అభిమాన నటి విజయశాంతి. ఆమె నటించిన చిత్రాలను మేము తప్పకుండా చూస్తాము. ఆమె పాత్రలో లీనమై ప్రేక్షకులను బాగా ఆకట్టుకొను



చున్నది. ముఖ్యముగా ఆమె నటించిన "నేటి భారతం, ప్రతిఘటన" చిత్రాలలో ఆమె నటనకు ఆమె సాటి. భారతనారిగా, ఆంధ్రుల అభిమాన నటిగా ఆ చిత్రాలలో ఆమె నటన తెలుగు ఆడపడుచులను ఉత్తేజపరిచినది అని అనుటలో అతిశయోక్తి లేదు. ఆమె నటనలో యింకా ఎంతో ఎదగాలని మనసారా కోరుకుంటున్నాము. నేను ఎన్నో ఉత్తరాలు వ్రాసినాను వారికి. వారి నుండి సమాధానములు రాలేదు. వెంటనే వివాహ యుక్తవయస్కురాలవ్వాలని మనసారా కోరుకుంటున్నాను.

-పిలేటి సుభాషిణి, కొత్తపేట, కనిగిరి.

★ ★ ★

సువిశాలమైన సినివినీలాకాశంలో 'మంచు పల్లకి' నుండి దిగిన 'స్వాతి' నక్షత్రం తన వెలుగు జిలుగుల 'స్రవంతి'ని ప్రేక్షక హృదయాలకు 'లేడీ డాక్టర్'గా ఇంజెక్ట్ చేసి 'సింధు భైరవి' ని ఆలాపించి అభిమానుల కన్నుల్లో 'కర్పూర దీపం' వెలిగించి 'సిరివెన్నెల' కురిపించిన మధుర మంజుల భాషిణి 'సుహాసిని' నా అభిమాన నటి. అతి చిన్న వయసులో ఉత్తమ నటిగా జాతీయ స్థాయిలో కీర్తింపబడిన ఘనత ఈమెకే దక్కింది. నటన యొక్క అత్యుత్తమ



విలువల్ని పెంపొందించే జాతీయ ఉత్తమనటి అవార్డును అందుకొన్న 'ముద్దుల మనవరాలు' సుహాసిని నుండి అభిమానులు రాబోవు కాలంలో మరెన్నో ఆణిముత్యముల వంటి పాత్రలను ఆశిస్తున్నారు.

-కె. లలితారాణి, కాశీబుగ్గ

★ ★ ★

మా అభిమాన తార కుమారి కుష్బు. తెలుగు సినీ



ప్రపంచంలో మొదటగా కలియుగ పాండవులలో చాలా అద్భుతంగా నటించి మమ్ములను ఆనందంలో, ఆశ్చర్యంలో ముంచేసింది. పాటలకు తగిన స్టెప్స్, విషాధ సన్నివేశాలలో ఆమె నటన చాలాబాగా నటించి మమ్ములను ఆకర్షించింది. ఈ చిత్రంలోనే కాక, "కెప్టెన్ నాగార్జున్"లో మరి అద్భుతంగా నటించింది. తెలుగులో నటించింది రెండు చిత్రాలు అయినా ప్రేక్షకుల హృదయాలలో చిరస్థాయిగా నిలిచి పోయింది. ఈ నటి మంచి అర్థవంతమైన చిత్రాలలోనే నటించాలని, మా అందాల నటుడు చిరంజీవి సరసన నటించాలని మా ఆశ.

-డి. సుజాత, ఐరాల

★ ★ ★

నా అభిమాన నటుడు డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావు నాకే కాక మా కుటుంబములో ప్రతివారికి అభిమాన నటుడు. ఏ పనినైనను ఆపి మేము ఆయన సినిమా చూస్తాము. రైతు బిడ్డలో రైతుగా, దొరబాబులో చాలా బాగా నటించారు. దేవదాసులో త్రాగుడు పాత్రకు ఆయన నటనకు ఎందరో నాలాంటి అభిమానులు గర్వించారు. ప్రేమమందిరము, మేఘ సందేశము, ప్రేమాభిషేకము



వంటి సినిమాలలో నటించి తమ నటనా చాతుర్యము వెల్లడి చేశారు. నాగేశ్వరరావుగారు నటించిన చిత్రములో వేరే హాస్య నటుడు అక్కరలేదు. ఆయన మాటలతోనే అందరిని నవ్విస్తారు. సినీరంగానికి "బంగారు కానుక" వంటి వారు. మూగ మనసులు, మంచి మనసులు, ప్రేమకానుక, వంటి చిత్రాలలో నటించి "పెళ్లిజమిందారై", "అదృష్ట వంతుడు"గా ప్రేక్షక హృదయాలలో "మరపురాని మనిషి"గా నిలచి పోయారు. అరవై ఏళ్లు వచ్చినా ఇరవై ఏళ్ళ "దసరాబుల్లోడు" "యువరాజు"గా నటిస్తారు. మా అమ్మగారికి ఆయన సినిమా చూచిన ఎంత ప్రమాద మయిన జబ్బయినా నయమగుతుంది.

ఎస్. వి. రాజేశ్వరి, నరసన్నపేట

★ ★ ★

యాభై ఐదు సంవత్సరముల సినిమా పరిశ్రమ యొక్క, మరియు నా ఇరవైమూడు సంవత్సరాల అనుభవములో నేను ఎదురు చూసిన సుగంధ, సుమధుర సంపెంగ అయిన అందాల రాశి జయసుధ అంటే నాకు చాలా ఇష్టము. "ఆక్రందన" సినిమా చూసి ఆమె నటన, వాయిస్, గ్లామర్‌ను



మెచ్చుకోకుండా వుండలేక పోయానంటే ఆశ్చర్యం లేదు. ఆడది అంటే అబలకాదు సబల అని నిరూపించిన హైందవి పేరువింటే "జయసుధ" గుర్తువచ్చే విధంగా నటించారు. జయసుధ చిత్రాలు వ్యాపారాత్మకంగా గాక కళాత్మకంగా, విప్లవాత్మకంగా ఉండాలని ఆమె అభిమానిగా నా ఆకాంక్ష.

-డి. కుసుమ, మాచర్ల

అఖిలాంధ్ర ప్రేక్షకుల చేత వరుసగా నాలుగు సార్లు సూపర్ స్టార్‌గా ఎన్నుకోబడిన డాషింగ్ డేరింగ్ హీరో కృష్ణ నా అభిమాన హీరో చలన చిత్ర చరిత్రలో అనేక సంచనాల సృష్టికర్త మన సాహస సామ్రాట్. హీరో కృష్ణ ఏ పని చేసినా సంచలనమే. మొన్నటి మోసగాళ్ళకు మోసగాడు, అల్లూరి సీతారామరాజు, నిన్నటి ఈనాడు, ప్రజారాజ్యం, ఇప్పటి సింహాసనం, నా పిలుపే ప్రభంజనం మచ్చుకి కొన్ని సంచలనాలు



మాత్రమే. తెలుగు చలన చిత్రరంగానికి స్కోపు తెచ్చినా, 70 ఎం. ఎం. స్టీరియో ఫోనిక్ ముచ్చట తీర్చినా అది కృష్ణ చేతి చలవ మాత్రమే. కృష్ణగారు సంవత్సరానికి ఒక్క జేమ్సుబాండ్ చిత్రంలోనైనా నటించి అభిమానులను ఆనదింపజేయవలసినదిగా కోరుచున్నాను.

–కె. ఎస్. శిరోమణి,
సింగరాయకొండ

★ ★ ★

నా అభిమాన హీరో యువకిషోర్ నందమూరి బాలకృష్ణ. అప్పటి 'మంగమ్మ గారి మనవడు', మొన్నటి 'అనసూయమ్మ గారి అల్లుడు', నిన్నటి 'దేశోద్ధారకుడు', నేటి కలియుగ కృష్ణుడు', రేపటి 'భార్గవ రాముడు'. 'అపూర్వ సహోదరులు'లో బాలకృష్ణ గారు నటించిన ద్విపాత్రాభినయం చాలా అద్భుతం. ఈ సంవత్సరం బాలకృష్ణగారు నటించిన చిత్రాలన్ని హిట్ కావడం నాలాంటి అభిమానులందరికీ ఎంతో సంతోషముగా ఉంది. త్వరలో విడుదల కాబోయే 'భార్గవ రాముడు', 'ప్రెసిడెంటుగారి అబ్బాయి', 'నటరత్న' చిత్రాలు హిట్ అవుతాయని ఆశిస్తున్నాను. ఆయన యువ అభిమానిగా నేనిచ్చే సలహా కథాబలం గల



చిత్రాలలో మాత్రమే నటించి తండ్రిని మించిన తనయుడు అవ్వాలని నాకోరిక. మా యువ కిషోర్ ఆయన తల్లి పేరిట వికలాంగుల, వృద్ధుల మరియు పిల్లల సంక్షేమ నిధిని ఏర్పాటు చేయ బోవుట ఆయన అభిమానిగా నాకు సంతోషము కలిగినది. ఆయన ఇంకా మంచి చిత్రాలలో నటించి సినీ పరిశ్రమలో అందరికంటే మంచి పేరు ప్రఖ్యాతులు సంపాదించి ఉత్తమ నటుడుగా పేరు పొందాలని నా కోరిక.

-మట్టపర్తి గిరిధర వెంకట సత్యప్రసాద్,
అమలాపురం

★ ★ ★

నా అభిమాన నటి విజయశాంతి సూపర్ హిట్ చిత్రం "ప్రతిఘటన' సినిమా చూసిన నాటినుంచి విజయశాంతిపై నా అభిమానం మరింత అధికమైనది.

"బ్యూటీక్వీన్" విజయశాంతి నటన అత్యద్భుతం. ఆమె స్టెప్స్ వేయటంలోను, డైలాగ్స్ చెప్పటంలోను, ఆమెకు యిచ్చిన పాత్రను బట్టి మొహంలో ఫీలింగ్స్ యివ్వటంలోను ఆమెకు ఆమే సాటి.

గతంలో ఎన్నో చిత్రాలలో నటించినప్పటికి యికమీదట కూడ అత్యద్భుతంగా నటించి



అభిమానులను, ప్రేక్షకులను ఆనందపరచవలసిందిగా కోరుచున్నాను. అంతేకాక పౌరాణిక చిత్రాలలో కూడ నటించవలసిందిగా కోరుచున్నాను.

–కొంపెల్ల పద్మజ,
నూజివీడు (కృష్ణాజిల్లా)

★ ★ ★

నేను 'నటరాజు' కృష్ణంరాజును ఎంతో



అభిమానిస్తాను. నటనకు సరైన అర్థం చెప్పగల నటుడు ఆయనే. 'కటకటాల రుద్రయ్య' చిత్రంతో 'రెబల్ స్టార్'గా బిరుదు పొందిన కృష్ణంరాజు గారు, 'భక్త కన్నప్ప' 'అమరదీపం' 'మన ఊరి పాండవులు', 'రంగూన్ రౌడీ', 'బొబ్బిలి బ్రహ్మన్న', 'రావణబ్రహ్మ', "తాండ్ర పాపారాయుడు" మొదలగు చిత్రాలలో మరపురాని నటన ప్రదర్శించారు. వరద బాధితులకు 'పది లక్షల' రూపాయలు ఇచ్చిన కృష్ణంరాజు ఎంతైన అభినందనీయులు.

ఈ మధ్యన ఈయన నటించిన కొన్ని చిత్రాలు అంతగా విజయవంతము కాలేదు. వీటిలో కథా పరంగా లోపాలున్నాయి. కథా బలం కల చిత్రాలలోనే కృష్ణంరాజు గారు నటించి ఆంధ్రులందరినీ ఆనందపరచాలని ఆశిస్తూ...

–పి. రఘురాజు,
అంబర్‌నగర్, సికింద్రాబాద్

★ ★ ★

సుప్రీమ్ స్టార్ చిరంజీవి అంటే నాకు ఎనలేని అభిమానం. ఈనాటి చిత్రపరిశ్రమలో కళామ తల్లికి కదలిక తీసుకువచ్చిన కళాకారుడు చిరంజీవి. చిరంజీవి చిత్రంలో ఆహ్లాదం, మృదుమధురమైన



నాట్యం (స్టెప్స్) మనోల్లాసాన్ని ఇచ్చే చక్కని హావభావములతో కూడిన నటన మనకు గోచరమౌతాయి. అంతే కాకుండా ఇటీవలనే "చిరంజీవి చారిటబుల్ ట్రస్టు" అనే ప్రజోపయోగ సంస్థ స్థాపించి నిజజీవితంలో నిజమైన "హీరో"నని నిరూపించుకున్నారు. అందుకే ఆ చిరంజీవిపై ఈ చిరుజీవికి ఇంత అభిమానం.

–కిమిడి వెంకట సుబ్బారావు,
ఆకివీడు

★ ★ ★

నా అభిమాన తార అందాల జయప్రద. ఆమె చిత్రరంగంలో ప్రవేశించిన తొలి రోజుల్లోనే తన నాట్య పటిమతో, చురుకైన నటనతో అభిమానుల హృదయాల్లో చెరగని ముద్ర వేసింది.

'సిరిసిరి మువ్వ' లోని మూగ పాత్రలో మాటలకు బదులుగా కళ్ళతో కావ్యాలొలికించి, 'అంతులేని కథ'లో తన కుటుంబాని కొరకు సర్వస్వాన్ని త్యాగం చేయగల వనిత పాత్రలో, 'మధుర స్వప్నం'లో ఏ సుఖానికీ నోచుకోని విధి వంచితగా, 'సూర్య చంద్ర'లో అనాధగా పూజ పాత్రకు జీవం పోసింది.

'దేవత' లో జానకి పాత్రలో ఆమె జీవించిందనే చెప్పాలి. ఇంకా హింది 'జీవనజ్యోతి' 'ధర్మాత్ముడు'



సినిమాల్లో ఆమె నటన అందరి మన్ననలందుకున్నది. ప్రియుని చేరలేక, భర్తను విడువలేక మానసిక సంఘర్షణ అనుభవించే 'సాగర సంగమం'లోని మాధవి పాత్రలో ఎంతో బాగా నటించిన జయప్రద జాతీయ స్థాయిలో ఉత్తమ నటి కావాలని కోరుకుంటున్నాను.

–ఎ. ఎస్. రమేష్, ఎడియూర్,
బెంగుళూరు □



## దాచినా దాగని నిజం!

మధుర మేల్ ఆవణి మూల వీధికి చెందిన 30 ఏళ్ళ విశ్వనాధన్‌కు ఆరేళ్ళ క్రితం వివాహం అయ్యిందట భార్య 24 ఏళ్ళ పార్వతి వేరే కాపురం పెట్టమని భర్తతో పోరేదట అతను దానికి సమ్మతించక, ఆ ప్రశ్న వచ్చినప్పుడల్లా ఆమెను చితుక బాదేవాడట ఒకనాడు ఆ వాగ్యుద్ధంలో రెచ్చిపోయిన విశ్వనాధన్ ఆమెను శక్తి కొద్దీ సావి వో చెంపకాయ కొట్టాడట దాంతో ఆమె గిరున తిరిగి, కింద పడి, చనిపోయిందట హత్య చేసినట్టు తనను పోలీసులు అరెస్టు చేస్తారని భయపడి, తన తమ్ముడు వెంకటేశన్ సహాయంతో ఆమె మెడ కిరసనాయిలు పోసి అంటించి, ఆత్మహత్యగా నిరూపించాడట ఇది జరిగి రెండు నెలలయ్యిందిట పోలీసులు ఆరాలు తీసి అన్నా తమ్ముళ్ళనిద్దర్ని అరెస్టు చేశారట

## స్త్రీ వేషంలో సిక్కు యువకుడు!

మదురం గలయేడు ప్రాంతంలో చీర కట్టుకుని ఆడ వేషం వేసుకు తిరుగుతున్న వో సిక్కు యువకుణ్ణి చూసి అనుమానించి ఆ పేట వారే అతన్ని పట్టి పోలీసులకు అప్పగించారట అతను సిక్కుల సాలె జుట్టు పెంచుకుని వున్నా గడ్డం, మీసం మాత్రం




పెంచుకోలేదట చీర కట్టుకుని, గాజులు వేసుకుని ఎందుకు తిరుగుతున్నావ్ అని పోలీసులడిగితే మరి ప్యాంటు వేసుకుని, వాచి పెట్టుకుని ఎందుకు తిరుగుతున్నారు అని వాండిలో దబాయించాడట ఏ ప్రశ్నకూ అతను సరిగా సమాధానం చెప్పనందువల్ల ఏ తీవ్రవాదియో ఏమో అని నిర్బంధంలో వుంచారట అంతేగా మరి!

## ప్రయాణంలో పెట్టె మాయం!

సైన్యంలో పని చేస్తూ, శలవు పెట్టి సొంత వూరు వచ్చి తిరిగి కాశ్మీరు వెళ్ళడానికి మద్రాసు బస్సుకోసం మదుర బస్టాండులో తిల్లయ్ నాయకమ్ అనే అతను వేచి వుండగా ఎవరో అతని పెట్టెను అపహరించారట అందులో తన సమస్తమైన రికార్డులు, తన గుర్తింపు కార్డు తదితరాలూ వున్నాయట పోలీసు రిపోర్టిచ్చినా ఫలితం చిక్కక జీవితం మీద విరక్తి చెంది ఆ తిల్లయ్ నాయకమ్ ఆత్మహత్య చేసుకున్నాడట

## రెండు గుండెల మనిషి!

సెయింట్ లూయిస్‌లోని విశ్వ విద్యాలయానికి చెందిన డాక్టర్ కిర్క్ కౌంటర్ ఒక 44 ఏళ్ళ గుండె నొప్పి పేషెంటుకు ఆపరేషను చేసి అతని గుండె పక్కన మరో గుండెను అమర్చి పూర్తి చేశారట ఫలితంగా యిప్పుడు రెండు హృదయాలు లబ్బుంటి డబ్బని కొట్టుకుంటున్నాయట పాత హృదయం నుంచి కొత్త హృదయం దాని పనినంతా తీసేసుకుంటుంది అలా తీసేసుకున్నాక పాత




హృదయాన్ని నేను తీసేస్తాను అన్నారటాయన ఇదేమి వింత! హార్స్ హెండింగ్ ఓవర్ అండ్ టేకింగ్ ఓవర్ చార్ !!

## పగ తీర్చుకున్న పాము!

శ్రీవిల్లి పుత్తూరుకు చెందిన వో 60 ఏళ్ళ ఆమె అడవిలో కట్టెలు కొడుతూండగా వో మేలు జాతి పాము రక్కున ఆమె చేతి మీద పడి, చుట్టేసిందట భయంకరంగా అరుస్తూ ఆమె రెండో చేత్తో పామును పీకి, విస్సిరిపారేసిందట ఆనక ఆమెతో పాటు అడవిలో వున్న మరి కొందరు పని వారు ఆ పాముని చంపడానికి వెతికారట ఆ పాము ఆమె మీద పగబట్టి వుంటుందని కూడా ఆమెకు చెప్పారట మర్నాడు వుదయం ఆమె యింటి ముందు కళ్లాపు జల్లుతుండగా ఆ పాము అక్కడ సిద్ధంగా వుందట ఆమెను చూస్తూనే తోక మీద లేచి బుస్సున మీదకు దుమికి పలుసార్లు కాటు వేసి పారిపోయిందట అది పాము, బాబోయ్ నన్ను కరిచి పారిపోయింది అని ఆమె అరుస్తూ పడిపోయిందట ఆసుపత్రికి తీసుకు వెళ్లాక చనిపోయిందట ఆ పాము ఆమెను చాలాసార్లు కాటు వేసిన గుర్తులు చూసిన డాక్టర్లు కూడా ఆశ్చర్యపోయారట-

## పగతో రెండు హత్యలు!

బొంబాయి రైల్వే ఆఫీసర్ల గృహాలలో ఒక గృహంలో




వుంటున్న షోయబ్ సిద్ధిక్ అనే కాంగ్రెసు నాయకుణ్ణి, ఆ యింట్లో పని చేసే వసంత భఫ్లేకర్ అనే ఆయాను భయంకరంగా హత్య చేశారటెవరో కత్తితో వారిద్దరి గొంతులు కోసేశారట షోయబ్ సిద్దిక్ బార్య నర్గిస్ రైల్వే ఆసుపత్రిలో డాక్టరట రాత్రి డ్యూటీ ముగించుకు వచ్చేసరికే దారుణం జరిగి వున్నదట అదే యింట్లో వేరే గదిలో నిద్రపోతున్న వారమ్మాయి ఫదేళ్ళ మిషాల్‌ను హంతకులేమి చెయ్యలేదట ఈ హత్యకు కేవలం ఏదో పగే కారణమని పోలీసు బావిస్తోంచట □

# నిలిచిన దీపం

## ఇసుకపల్లి సుజాత



అదురుతున్న గుండెతో నది వంక చూశాడు కుమార్.

అతని మొహంలో బాల్యపు ఛాయలు తొంగి చూస్తున్నాయి. కృత నిశ్చయం, భయం, ఆందోళన, జంకు అన్నీ కలిసి అతని మనసును ఉక్కిరిబిక్కిరి చేస్తున్నట్టు అతన్ని చూస్తేనే తెలిసిపోతోంది. స్కూల్ యూనిఫామ్‌లా ఉన్నాయి అతని బట్టలు. అతను టీనేజ్‌ దశలో ఉన్నాడని మాత్రం అనిపించట్లేదు. మనిషి ఓ మోస్తరు లావుతో బాగా పొడుగ్గానే ఉన్నాడు.

వేగంగా పరిగెత్తుకుంటూ రావటంతో కుమార్‌లోని అణువణువూ కంపిస్తోంది. ఒడ్డున నుంచుని నీళ్ళపై దృష్టి నిలిపాడు. పొంగి దుడుకుగా దూసుకు వస్తున్న నీలి కెరటాలు తనను ఆహ్వానిస్తున్నట్లుగా అనిపించింది. ఏదో నిశ్చయించుకున్న వాడిలా గబుక్కున నదిలోకి అడుగు వేశాడు. అంతలోనే నిశ్శబ్దంగా మారిన నీటిలోని తన ప్రతిబింబం నిర్మలంగా స్వచ్ఛంగా మల్లెపూవులా చిరునవ్వు చిందిస్తున్నట్లు తోచింది.

అడుగు ముందుకి సాగలేదు. మతిపోయిన వాడిలా చివుక్కున తలెత్తి చుట్టూ కలయజూశాడు.




నగరం పెరిగి పోయిందనటానికి సాక్ష్యంగా నది ఒడ్డు నుంచి కనుచూపు మేరలో భవనాలు పూరిగుడిసెలు పాలలో నీళ్ళలా ఒకదాని పక్కన మరొకటిగా కలిసిపోయి కనిపించాయి. కార్లలో వెళ్ళే వాళ్ళు కూలి పని చేస్తూ జీవించే వాళ్ళు ఎవరిక వారు సంతోషంగా హాయిగా ఊళ్ళోకి సాగిపోతున్నారు.

వింతగా అనిపించింది కుమార్‌కి. సూర్యుడి విభవం నెమ్మదిగా నదిలోకి జారిపోతుంటే చంద్రుడు క్రమంగా తన ప్రాభవాన్ని దశదిశలా చాటుకోవాలని తెగ ఆరాట పడిపోతున్నాడు.

ఫలితంగా భూమిపై చిరు చీకట్ల అలజడి! చుట్టూ కలయ చూశాడు. కొద్ది దూరంలో ఇసకలో కూర్చున్న బిచ్చగాడు కనిపించాడు.

ఒక చింకి బట్టను నడుముకి చుట్టుకుని ఉన్నాడు. నదిలోంచి వీచే నీట గాలికి కాబోలు సన్నగా వణుకుతున్నాడు.

ఆ బిచ్చగాడు తన వైపే చూడటం గమనించక పోలేదు కుమార్.

చటుక్కున నదిలోకి చూశాడు. కొందరు పడవల్లో సాగిపోతూ వలలను వలయాలుగా నదిలోకి విసిరి లాగుతూ ఎప్పటికప్పుడు ఆశగా వలను విప్పి చూసుకుంటున్నారు. వలలో పడే చేప కోసం విసుగు లేక వారు అవిశ్రాంతంగా శ్రమిస్తూనే ఉన్నారు.

వారిలో నిరాశ ఎక్కడా కనిపించలేదు! ఇంతలో తల్లిదండ్రులు చెల్లి తమ్ముడు ఒక్కసారి గుర్తుకొచ్చారు.

ఏడుపొచ్చింది. కానీ అంతలోనే తన నిర్ణయం మాత్రం మార్చుకోకూడదని నిశ్చయించుకున్నాడు.

కనిపించే దైవం తల్లి. అందుకే అక్కడ్నుంచే ఇంట్లో ఉన్న తల్లికి మరోసారి మనస్ఫూర్తిగా దండం పెట్టుకున్నాడు. 'పాపం వాళ్ళు నా కోసం వెతుక్కుంటూ ఉంటారేమో! .... పోనీ వెతుక్కోనీ నాకేం'

'ఏమీ చేతకాని వాడివి వెధవి ... నీకేం నువ్వు పదో క్లాసు తప్పి ఇంట్లో కూర్చున్నావ్. బైటకెళ్తే అందర్లో నాకు తలవంపులుగా ఉంటుంది. మీ వాడు ఫెయిల్ అయ్యాట్ట నిజమేనా అని అందరూ అడుగుతారు. అప్పుడు నా మొహం ఎక్కడ దాచుకోను?' అంటూ నాన్న తిట్టాడుగా.

'నేను .... నేను.... చచ్చిపోతే వాళ్ళకి ఏ బాధలూ ఉండవు. హాయిగా ఉంటారు.' వద్దనుకున్నా పొంగి చెంపల మీదుగా జారిపోతున్న కన్నీళ్ళను చొక్కాతో తుడుచుకున్నాడు కుమార్.

అమ్మ .... అమ్మ మాత్రం ఊర్కుందా?

'చదువు కోరా వెధవా అంటే వింటేనా. ఇప్పుడు చూడు నీతోటి వాళ్ళు చక్కగా కాలేజీల్లో చేరతారు. నువ్వు మాత్రం నూతిలో కప్పలా పదో క్లాసులోనే ఉంటావ్ అని అనలేదా!

ఏడ్చి ఏడ్చి కుమార్ కళ్ళు ఎర్రబారినాయి. తనకంటే చిన్నవాళ్ళయిన తమ్ముడికి, చెల్లెలికి కూడా తనంటే ఎంత చిన్న చూపు.

'అన్నయ్య పదో క్లాసు ఫెయిల్ అవటంతో ఫ్రెండ్స్ దగ్గరికి వెళ్ళాలంటే మా కెంతో సిగ్గుగా ఉందమ్మా' అని అమ్మతో చెప్పారా వాళ్ళు!

వెలెడంత లేరు. చివరికి వాళ్ళ దృష్టిలో కూడా నేను చులకనై పోయాను. ఇంక నేనెందుకు బతకాలి?' అనుకుంటూ కుమార్ అమాంతం నదిలోకి వెళ్ళిపోయి నీళ్ళల్లో మునిగి చచ్చిపోదా

మనుకుని ముందుకి పరుగు తీయబోయాడు.

కానీ వెళ్ళలేకపోయాడు.

తన రెండు చేతుల్ని అంగుళమైనా కదలనీయకుండా గట్టిగా పట్టుకున్నది ఎవరా అని గిరుక్కున వెనక్కి తిరిగి చూశాడు.

అతడు ఎవరో కాదు.

ఇందాక తను చూసిన బిచ్చగాడే!

చింకి బట్టల్తో ఎండిపోయిన శరీరంతో జీవచ్ఛవంలా జీవిస్తున్న బిచ్చగాడు.

కుమార్‌కి కంపరం పుట్టింది.

'ఛీ..... వదులు.... నన్ను ముట్టుకోకు' అంటూ ఒక్క పెట్టున ఆ బిచ్చగాడి పట్టును వదిలించుకోబోయాడు కుమార్.

కానీ సాధ్యపడలేదు.

'అబ్బ.... ఇంత బక్కచిక్కినా పీడిలో శక్తి చావలేదే!' అని ఆశ్చర్యపోయాడు కుమార్.

'నిన్ను వదిలేస్తాను గానీ కాస్సేపు ఇక్కడ కూర్చో బాబూ. నీతో మాట్లాడాలి' అన్నాడు ఆ బిచ్చగాడు కాస్త దూరంగా జరిగి కూర్చుంటూ.

'ఛీ.... ఛీ..... నాతో మాట్లాడ్తావా' అన్నాడు కుమార్ ఏవగింపుగా మొహం పెట్టి.

మరుక్షణంలో 'వాడితో నాకేం పని' అన్నట్టు నదిలోకి వెళ్ళబోయాడు కుమార్.

'ఆగుబాబూ..... ఆగు. నా మాట ఒక్కటి విని తరవాత నీ ఇష్టం వచ్చినట్టు చెయ్యి. కాదనటానికి నేనెవర్ని?'

చప్పున ఆగి వెనక్కి తిరిగాడు కుమార్.

'పోనీ అంతగా బతిమాలుతున్నాడు వింటే పోలా. ఆ తరవాతే చచ్చిపోతాను' అనుకున్నాడు.

'నువ్వు నదిలోకి ఎందుకు వెళ్ళాలనుకున్నావు బాబూ'

'ఎందుకేంటి? చచ్చిపోదామనుకున్నాను' అదేం పిచ్చి ప్రశ్న అనట్టున్నాయి కుమార్ మాటలు.

'నీ కెందు కలా అనిపించింది' కళ్ళల్లో ప్రాణాలు పెట్టుకున్నట్టున్న ఆ బిచ్చగాడి నోట్లోంచి నీరసంగా వస్తున్నాయి మాటలు.

అయినా ఒక తోటి మనిషిని రక్షించాలన్న తపన మానవత్వం అతని నీరసాన్ని జయించాయి.

'ఎందుకు.... ఎందుకంటే నేను..... నేను పదో క్లాసు ఫెయిల్ అయ్యాను' దుఃఖం దిగమింగుకుంటూ అన్నాడు కుమార్.

గట్టిగా నవ్వాడు బిచ్చగాడు.

ఆ చప్పుడుకి నీటిమీద తిరుగుతున్న రంగు రంగుల పక్షులు ఒక్కసారిగా పైకి ఎగిరిపోయాయి.

కుమార్ అయోమయంగా అతని వంక చూశాడు.

'అయితే బాబూ.... లోకంలో నీలాంటి వాళ్ళందరూ ఇలాగే చేస్తున్నారా?'

ఖంగుతిన్నాడు కుమార్.

అంతలోనే సర్దుకుని 'అమ్మా వాళ్ళు నన్నెందుకు తిట్టాలి? పైగా నలుగుర్లోనూ నాకు అవమానంగా ఉండదూ. బిచ్చగాడివి ఇవన్నీ నీకేం తెలుస్తాయిలే' పొగరుగాను హేళనగాను ఉన్నాయి కుమార్ మాటలు.

'నీ తల్లి దండ్రులు ఎప్పుడూ నీ మంచిని కోరేవారే బాబూ. అందుకే వాళ్ళు ఒకమాట అన్నా నువ్వు పడటంలో తప్పు లేదు. ఇంకా బాగా చదివి పాసయి అందరికీ నీ సత్తా చూపించాలి. అప్పుడు అందరూ నిన్ను మెచ్చుకుంటారు. నువ్విప్పుడు చచ్చిపోతే వాళ్ళు నిన్నెలా మెచ్చుకుంటారు?' ప్రశ్నించాడు బిచ్చగాడు.

'నాకు నీతులు చెప్పటానికి అసలు నువ్వెవరివి. ఇక్కడెందుకున్నావ్?' విసుగు పుట్టింది కుమార్‌కి.

'చెబుతాను బాబూ అది చెబుతాను. కాళ్ళూ చేతులు ఉన్నాయి కాబట్టి నేనూ ఒక మనిషినే అని ఒప్పుకుంటావుకదూ. ఇప్పుడైతే నేను ఈ వూళ్ళో రోడ్డునే ఇల్లుగా చేసుకుని జీవిస్తున్నాను. ఒకప్పుడు నేను నా భార్య ఇద్దరం కలిసి పని చేసుకుని వచ్చినదాంతో తిని తృప్తి పడేవాళ్ళం. సరిగ్గా రెండేళ్ళ క్రితం చేపలు పట్టటానికి నలుగురు ఆడవాళ్ళతో కలిసి నీటిలోకి వెళ్ళిన నా పెళ్ళాం ఇదే రోజున విధివశాన ఈ నదిలోనే పడి చచ్చిపోయింది బాబూ......' దుఃఖంతో గొంతు పూడుకుపోయింది.

'అప్పట్నుంచీ ఈ రోజున ఇలా నది ఒడ్డున గడుపుతూ ఉంటాను. నాలో శక్తి చచ్చిపోయింది. ఏ పనీ చెయ్యలేను. అందుకే ఎవరైనా జాలి తలిచి పెడితే తింటాను...'

'చాల్లే ఇంక నీ సోది కాస్త ఆపు. నువ్వు చెప్పటం నేను వింటం రెండూ బాగానే ఉన్నాయి. గానీ ఫో..... నీ పని నువ్వు చూస్కో' అంటూ కుమార్ లేచాడు.

ఫస్ట్ క్లాసులో పాసైన తన ఫ్రెండ్స్ కిరణ్, రఘు, ప్రసాద్‌లు గుర్తొచ్చారు కుమార్‌కి.

మనస్సు కలుక్కుమంది.

'వాళ్ళు కాలేజీలో చేరితే తను మళ్ళీ అదే స్కూల్లో చదువుకోవాలా? ఆ అవమానాన్ని నేను భరించలేను....' బాధగా అనుకున్నాడు కుమార్.

మెల్లిగా లేచాడు.

గబగబా నదిలోకి అడుగులు వేశాడు.

తన మాటలు కుమార్‌లో ఎటువంటి మార్పునీ కలిగించలేదని గ్రహించాడు బిచ్చగాడు.

'బాబూ..... ఒక్కమాట' కుమార్‌ని కేకేశాడు బిచ్చగాడు.

అతని మాటలు పట్టించుకోకుండా వెళ్ళలేక పొయ్యాడు కుమార్.

'నాకో చిన్న సాయం చేసి పెడ్తావా బాబూ....'

'నీకా! ఏవిఁటది?' కోపంగాను, విసురుగాను అన్నాడు కుమార్.

'ఏమీ లేదు బాబూ.... నువ్వు కనక చచ్చిపోవాలనుకుంటే మాత్రం నీ చొక్కా నాకు యిచ్చి వెళ్ళు. అది తొడుక్కుని రోజూ నిన్ను తలుచుకుంటాను.'

'చూడబోతే రేపో మాపో చచ్చేవాడిలా ఉన్నావ్. చొక్కా నీ కెందుకు?' హేళనగా ప్రశ్నించాడు కుమార్.

'అసలే చలిగా ఉంది. బతికే ఒక్క రోజైనా కాస్త వెచ్చగా బతకొచ్చుకదా అన్న ఆశే బాబూ నాచేత

నిన్నిలా అడిగించింది' అన్నాడు బిచ్చగాడు.

అతడి కళ్ళల్లో ఏదో కొన మెరుపు కనిపించింది.

నిర్ఘాంతపోయాడు కుమార్.

ఇంట్లో వేళకి అన్నం పెట్టే తల్లి, కావలసినవన్నీ ప్రేమతో కొని పెట్టే తండ్రి, అభిమానం కురిపించే చెల్లీ తమ్ముడు ఉన్నారు తనకి. అయినా చిన్నమాట పట్టుకుని తన నిండు జీవితాన్ని అంతం చేసుకోవాలనుకున్నాడు.

ఇక్కడ, తిండిలేక శుష్కించి పోయిన శరీరం, కట్టుకోటానికి బట్టలు లేక చలికి వణికి పోతూ కొడిగట్టి పోతున్న దీపంలా ఈ బిచ్చగాడు. అయినా అతను బతకాలనుకుంటున్నాడు. ఉన్న ఒక్క రోజైనా వెచ్చగా బతకటానికి వీలుంటుందేమోనని ఆశపడుతున్నాడు.

రెండూ పక్క పక్కనే సినిమారీళ్ళలా కుమార్ కళ్ళముందు కదిలాయి.

ఏమిటీ?

'జీవితం అంత విలువైనదా? ముఖ్యమైనదా?' ఏవో పెద్ద మాటలు ఆ చిన్న వాడి మనసులో మెదిలాయి.

కానీ కుమార్ మాత్రం ఏదో నిశ్చయించుకున్న వాడిలా చొక్కా గుండీలు విప్పసాగాడు.

అది చూశాడు బిచ్చగాడు.

అంటే ఇన్ని చెప్పినా ఈ కుర్రాడు తన జీవితాన్ని అంతం చేసుకోటానికే నిర్ణయించు కున్నాడన్న మాట!

'అయ్యో.... బాబూ.... రక్షించండి.... బాబు నదిలో పడిపోతున్నాడు.....' అంటూ తన శక్తి కొద్దీ అరిచాడు బిచ్చగాడు. ఎలాగైనా ఆ పిల్లాడి ప్రాణాలు కాపాడాలనే తాపత్రయంతో.

క్రితం రోజు నుంచీ తిండ దొరక్క పోవటంతో వెర్రి నీరసం ముంచు కొచ్చేసింది. లేవలేక పోతున్నాడు బిచ్చగాడు.

అతని కేకలు ఎవరికీ వినిపించినట్టు లేదు.

ఎవ్వరూ రాలేదు.

కుమార్ మౌనంగా తన చొక్కా విప్పి బిచ్చగాడి చేతిలో పెట్టాడు.

'నేను పోతున్నా' అన్నాడు కుమార్ దృఢమైన స్వరంతో.

'బాబూ....' అంటూ కన్నీరు కారుస్తూనే

'దొరా.... బాబూ.... వేగరండి.... అయ్యో' అంటూ గొంతు చించుకుని పిచ్చిగా అరుస్తున్నాడు బిచ్చగాడు.

వాళ్ళిద్దరూ మాట్లాడుకున్నది కొద్ది సేపే. అయినా ఏదో తెలియని బంధం ఆ బిచ్చగాణ్ణి కదిలించింది.

'ఎందుకు తాతా అలా అరుస్తావ్? నీకసలే నీరసంగా ఉంటేను. నేను చచ్చిపోను. నువ్వేం భయపడకు. నేను వెళ్ళేది మా ఇంటికి.... తెలుసా? నీకోసం అన్నం కూడా తీసుకొస్తాను..... సరేనా' అన్నాడు కుమార్ బిచ్చగాడి చేతులు పట్టుకుని చిన్నగా నవ్వుతూ.

బిచ్చగాడి మనసు ఆనందంతో పొంగిపోయింది. □

# ప్రేక్షకులని ఉర్రూతలూగిస్తున్న వృద్ధకవలలు!



అవకాశానికి, అదృష్టానికి వయస్సుతో నిమిత్తం లేదు. అలాంటిదే ఎలెన్, ఎలిస్ జంట ప్రదర్శన. గత ముప్ఫయి సంవత్సరాలుగా ఎలెన్, ఎలిస్ అనబడే నృత్యగాన బృందం యూరప్ అంతా పర్యటించి ప్రదర్శనలిచ్చి ఘనవిజయం సాధించారు. వీరిరువురు కవలలు. వీరి నృత్యానికి ఇంతటి ఖ్యాతి రావడానికి వీరి పొడవైనకాళ్ళు కూడా ఒక ముఖ్య కారణం.

50 సంవత్సరాల వయస్సు వచ్చినా వీరు నేటికి నృత్య ప్రదర్శనలు, దూరదర్శన్ ప్రదర్శనలూ ఇస్తూనే ఉన్నారు. కానీ తొలుత వీరు ప్రదర్శనలు ప్రారంభించిన జర్మనీలో గాక, ఘనవిజయాలను సాధించిన పారిస్‌లోను గాక ప్రస్తుతం ఇటలీలో ఎక్కువగా నివసిస్తున్నారు. ఇటలీ వీరికి స్థిరనివాస స్థలం అయింది. ఇందుకు కారణం నటుడు అంబెరెటో ఆర్సినితో నటించడానికి ఎలెన్ కుదుర్చుకున్న దీర్ఘకాల ఒప్పందం కాదు. అది ఎప్పుడో పూర్తి అయింది. జర్మనీలో తాము ఇస్తున్న నృత్యగాన ప్రదర్శనలకి ఎక్కువ గిరాకి లేకపోవడమే ఇందుకు కారణం అని వారన్నారు. కానీ ఇటలీలో వీరి ప్రదర్శనల పట్ల వ్యామోహం ఉంది. ఇద్దరు వనితలు కలిసి తమ కాళ్లను ఈ విధంగా ప్రదర్శించడం ఇటలీ ప్రజలకు ఆకర్షణీయంగానే ఉన్నది.

ఈ ఇద్దరు కవలలు ఈ రోజుకి తీగల్లాగా నాజూగ్గా ఉన్నారు. వీరు ప్రకృతిసిద్ధమైన సౌందర్య సాధనాలనే వాడతారట. ప్రస్తుతం తూర్పు జర్మనికి చెందిన నెర్సాప్ వీరి జన్మస్థలం. వీరి తండ్రి తన కూతుళ్ళు ఇంతటి అంతర్జాతీయ ఖ్యాతి గడిస్తారని కల్లో కూడా ఊహించలేదు. వీరు ఆరు ఏళ్ళ వయస్సులో లీప్‌జిగ్ బాలే స్కూల్లో చేరారు.

ఎలెన్ డాక్టరవ్వాలని, ఎలిస్‌ఫాషన్ డిజైనర్ కావాలని అనుకున్నారు. కానీ ఆ విధంగా జరగలేదు. 1947లో ఈ కవలలు లీప్‌జిగ్‌లోని ఒపేరా చిల్డ్రన్స్ బాలే స్కూల్లో చేరారు. మూడు సంవత్సరాలానంతరం వీరు ఒపేరా డాన్స్ స్కూలు ప్రవేశ పరీక్షలో మంచి మార్కులతో ఉత్తీర్ణులయ్యారు. కొద్ది రోజుల తరువాత వీరు పశ్చిమ జర్మనీకి వచ్చారు.

1952లో వారి ప్రథమ ప్రదర్శన 'డజెల్ డోర్ఫ్ రెవూపలాస్ట్ పల్లాడియమ్‌లో జరిగింది. అదృష్టం వీరిని వరించింది. దీని డైరెక్టర్ వీరి ప్రదర్శనలకు ఎక్కువగా ఆకర్షింపబడి పారిస్‌లోని లిడోలో ప్రదర్శనకు అవకాశం కలుగజేసాడు. అక్కడా వీరు ఘనవిజయం సాధించి త్వరితగతిని "బ్లూబెల్ గర్ల్స్"లో ప్రముఖ దర్శకులుగా అయ్యారు. "లిడోలో అవకాశం రావడంలోని అనుభవం వర్ణనాతీతం. అయిదు సంవత్సరాలు లిడోలో ఉండటం మాకు వ్యోమగాములు చంద్రమండలంలో కాలు మోపినట్లు ఉంది" అని గత స్మృతులు జ్ఞాపకం తెచ్చుకుంటూ ఎలిస్ అన్నది. "ఆర్క్ డిట్రియోఫ్ వెళ్లడం తారాపథాన్ని అందుకున్నట్లే మాకు అనిపించింది" అని ఎలెన్ అన్నది.

"మేము వృద్ధ దంపతుల్లా చాలా వాటిల్లో ఒకటిగా ఉంటాము. కాని కొన్నిట్లో విభేధాలు ఉన్నాయి" అని ఎలిస్ అన్నది.

"అవును. ఎలిస్ చాలా తెలివైనది. ఆమె శాంత స్వభావురాలు. యోచించి పనిచేస్తుంది" అని ఎలెన్ చెప్పింది.

"ఎలెన్ ఎక్కువ చురుకుదనం కలది. చాకచక్యంతో నిర్ణయాలు చాలా త్వరితగతిన తీసుకుంటుంద"ని ఎలిస్ చెప్పింది.

వీరిద్దరూ కూడా వివాహాలు చేసుకోలేదు. అది వీరి జాతకఫలమేగానీ, కవలలు కావడమో లేదా వీరు చేపట్టిన వృత్తో ఇందుకు కారణం కాదని వీరు అంటున్నారు. ఇద్దరూ కూడా సింహలగ్నంలో పుట్టినవారే. ఒకసారి ఒక జ్యోతిష్కురాలు వీరికి వివాహం అయ్యే అవకాశం లేదని జ్యోతిష్యం చెప్పిందట.

ఏమైనా ఈ వృద్ధ కవలల డాన్స్ బృందం జనాన్ని వెర్రెక్కిస్తున్నారనడంలో సందేహంలేదు.

-(జి. వి.)

సీరియల్

ఆదూరి సావిత్రి

(గత సంచిక తరువాయి)

సంజీవదేవ్ చచ్చిపోతే చూడటానికెళ్ళారు మంజీర తాతగారు. అతని కొడుకు రాజకుమార్‌ని ఓదార్చి, బాధ్యతగా అక్కడుండి, జరగాల్సిన కార్యక్రమాలు జరిపించారు. బయట వాళ్ళు ఎందరున్నా ... ఆత్మీయుడైన వ్యక్తిగా అక్కడ ఆయనే నిలబడ్డారు...

"ఇది విన్నావా? మీ నాన్న సంజీవదేవ్ ఇంటి కెళ్ళటమే కాకుండా ... అక్కడుండి స్వయంగా అన్ని కార్యక్రమాలూ నిర్వహిస్తున్నారు..." అన్నాడు పాపారావు.

అతను బాబూరావు వర్గంలో వాడు.

"ఈ ముసలాయన కసలు బుద్ధిలేదు. కన్నకొడుకు అవమానం కన్నా ఊళ్ళోవాళ్ళ మెప్పే ఎక్కువాయనకు." అసహనంగా అన్నాడు బాబూరావు...

తాతగారు ఇంటి కొచ్చాక బాబూరావుకి, ఆయనకి ఘర్షణ జరిగింది....

"అసలు వ్యక్తి... నీ శత్రువు అయిన సంజీవదేవ్ చచ్చిపోయాడు. ఆయన కొడుకు రాజకుమార్ మంచివాడు. ఇంకా ఆ కుటుంబంతో విరోధమెందుకు మనకి? ఊళ్ళో ఇలా రెండు పార్టీలుగా విడిపడి ఒకరినొకరు ద్వేషించుకోటం కన్నా... కలిసి ఉంటే ఎంత బావుంటుంది! ఒక్కసారి ఆలోచించు." అన్నారు తాతగారు.

"అది అసంభవం. నేను వాళ్ళతో రాజీపడే ప్రసక్తే లేదు. ఆ రాజకుమార్‌గాడు కూడా తక్కువ వాడేం కాదు. ఆ తండ్రికి కొడుకే వీడు. వీడి మొహానికో యువజన సంఘం.. దానికి వీడు నాయకుడు. నా గురించి వాడు కూసే కూతలన్నీ నాకు తెలుసు. నేనిదే చెపుతున్నాను. ఈ ఇంటి మీది కాకయినా సరే ఆ ఇంటి మీద వాలటానికి వీల్లేదు. వాళ్ళతో సమంధాన్ని పెట్టుకోటానికి వీల్లేదు. ఈ విషయంలో నా మాట నుల్లంఘిస్తే ఫలితాలు బాగోవు." కసిగా అన్నాడు బాబూరావు.

సంజీవదేవ్ అన్నా... ఆయన తాలూకు మనుషులన్నా చెప్ప లేనంత ద్వేషం బాబూరావుకి.

ఆ రాత్రి అన్నం తినకుండా తన గదిలో కెళ్ళి పడుకున్న బాబూరావు "తనింకెప్పుడూ వాళ్ళ గడప తొక్కనని... వాళ్ళతో సమంధాలు పెట్టుకోనని తాతగారు ప్రమాణం చేసే వరకూ అన్నం పళ్ళెం ముందు కూర్చోలేదు...

వాళ్ళ మీద అతని కంత పగ! ఆ ఊరి మున్సిపల్ ఛెయిర్‌మన్‌గా తన పదవి కాలం పూర్తి కాకుండానే బలవంతంగా దింపెయ్యబడ్డాడు బాబూరావు.

ఇందుకు ముఖ్య కారకుడు సంజీవదేవ్!

బాబూరావు మనసు గతంలోకి జారిపోయింది....

సంజీవదేవ్‌కి పదవి లేకపోయినా అక్కడి ప్రజల్లో మంచి బలముంది. గతంలో ఓసారి మినిస్టరయినప్పుడు సంపాదించుకున్న ఆస్తి ... పలుకుబడి ఆయనకు దండిగా ఉంది.

"ప్రజల్లో పలుకుబడి అనేది మంచి పనుల ద్వారా కంటే ... గూండాయిజం వల్లనే ఎక్కువగా ఏర్పడుతుంది" అనే సూక్తిని నమ్మి దాన్నే ఆచరణలో పెట్టి విజయం సాధించిన వ్యక్తి సంజీవదేవ్. కాలక్రమాన ప్రజల్లో వచ్చిన కొద్దిపాటి మార్పు వల్ల ప్రస్తుతం ఆయనకు ఏ పదవీ లేదు.

అలాంటి సంజీవదేవ్‌కి బాబూరావుకి కొద్దిగా స్నేహముంది... బాబూరావు అప్పుడే ఊరికి మున్సిపల్ ఛెయిర్మన్‌గా ఉన్నాడు. అప్పుడు జరిగిన జనరల్ అసెంబ్లీ ఎన్నికల్లో నిలబడ్డ సంజీవదేవ్‌ని బలపరచకుండా తన బావమరిదిని బలపరుస్తూ అతని తరుపున ప్రచారం సాగిస్తున్నాడు బాబూరావు...

భోజనం చేసి తువ్వాలుతో చెయ్యి తుడుచుకుంటూ బయటకి వొస్తున్న బాబూరావు అప్పుడే కారు దిగి లోపలి కొస్తున్న సంజీవదేవ్‌ని సాదరంగా ఆహ్వానించాడు...

"కబురంపితే నేనే వచ్చును గదా?" అన్నాడు బాబూరావు.

"నువ్వెక్కడలే. ఇది వరకటి బాబూరావువి కాదుగా! పిలిస్తే వస్తావో రావోనని... నేనే వచ్చాను." నిష్ఠూరంగా అన్నాడు సంజీవదేవ్.

బాబూరావు మొహం మాడింది.

అది చూసి కొంచం తగ్గుతూ "అయితే బాబూరావు? కొన్ని సంవత్సరాలుగా రాజకీయ చరిత్ర ఉన్నవాడిని నేను. అదీకాక... మనం స్నేహితులం కూడా. అలాంటి నన్ను కాదని, నువ్వా ఆంజనేయులు తరుపున ప్రచారం సాగించటం

జరిగిన కథ – 1 : ప్రణీత్ తండ్రి వెంకట్రామయ్య పైడి పల్లెకు స్కూలు టీచరుగా వచ్చారు. ఆయన భార్య కామేశ్వరి. పట్నంలో చదువుతున్న ప్రణీత్ పండక్కి పైడి పల్లెకు వస్తాడు. బాబూరావు, శర్వాణిల కూతురు మంజీర. బాబూరావు మాజీ మున్సిపల్ ఛైర్‌మెన్. మంజీర, హైమ ప్రాణ స్నేహితులు. తల్లి లేని హైమ మేనత్త దగ్గర ఉంటూంటుంది. బావ రాజారావుకి హైమంటే ఇష్టం. మంజీరను ప్రణీత్ ప్రేమిస్తున్నాడని తెలుసుకున్న హైమ అతనిని ఆటలు పట్టిస్తుంది. ఏకాంతంగా మంజీరతో మాట్లాడాలనే కోరిక తీరకుండానే పట్నం వెళ్ళి పోతాడు ప్రణీత్.

బావుందా?" అన్నాడు సంజీవదేవ్.

"అతను నా బావమరది." అన్నాడు బాబూరావు ముభావంగా.

"నీ సొంత బావమరిదేం కాదు."

"కావచ్చు. కానీ... అతను నాకు బంధువే కదా?"

"బంధుత్వం కన్నా స్నేహం గొప్పది."

తమిద్దరి మధ్య ... ఒకరి అవసరాలకు మరొకర్ని వాడుకోటమే తప్ప, తగినంత స్నేహమేం లేదని బాబూరావుకు తెలుసు- సంజీవదేవ్‌కి కూడా తెలుసు.

సమయానుకూలంగా అతను ప్రదర్శిస్తున్న దగ్గర తనాన్ని గమనిస్తూ మౌనంగా ఊరుకున్నాడు బాబూరావు.

"నువ్వు నా తరుపున ప్రచారం చెయ్యి." అన్నాడు సంజీవదేవ్.

"అది కుదరదు." అన్నాడు బాబూరావు.

"ఎందుకు కుదరదు?"

"నిన్నటి దాకా అతని తరుపున ప్రచారం చేసి, ఈ రోజు హఠాత్తుగా మీ తరుపున మొదలెడితే జనం నవ్వుతారు."

"ఏం నవ్వరు. అందుకేవో కారణాలు సృష్టిస్తాం. ఒకే వేదిక మీద ఒక రాజకీయ నాయకుడు, తడవకొక రాజకీయ పార్టీని సమర్థిస్తూ సమయానుకూలంగా ఉపన్యాసాలు దంచుతుంటే వింటాని కలవాటు పడిపోయిన ఈ జనం ఈ రోజు కొత్తగా నిన్ను చూసి నవ్వేదేం ఉండదు. ఇలాంటివి మనకి బాగా అలవాటయినవే. ఏమీ ఎరగనట్టు మాట్లాడకు."

"అయినా... నేనా పని చెయ్యలేను."

"ఇంకోసారి ఆలోచించుకో."

"సారీ."

"ఓహో! నిన్న నేను మనిషిని పంపాను. అతనితో ఏదేదో అన్నావుట! చాలా హఠాత్తుగా మంచివాడివయి పోతున్నట్టున్నావే?"

"మీరిలా మాటి మాటికి పన్నులు మాఫీ చెయ్యమని నా మీద ఒత్తిడి తేవటం బాగోలేదు. దేనికయినా అంతం అనేది ఉండాలి."

"అలాగే. ఈ ఒక్కసారికి.. ఆ ముప్పయి వేలూ కట్టెయ్యి. సారీ.. మాఫీ చేసెయ్యి."

"అలా వీలవదు."

"వీలవుతుందని మనిద్దరికీ తెలుసు. ఎందుకంటే .. ఇంత క్రితం ఇలాంటివి చాలా చేశావు గనక."

"అప్పటి పరిస్థితులు వేరు."

"ఏం? ఇప్పుడు తిరగబడ్డాయా?"

".........."

"అయితే మాఫీ చెయ్యకు. నా తరుపున నువ్వే కట్టెయ్యి."

"నా దగ్గరేమన్నా డబ్బు రాసులు పోసుకుని కూర్చున్నానా?"

"రాసులు ముందుగానే పోసుకు కూర్చో అక్కర్లేదు. తూర్పు వీధిలో రోడ్డు పొయ్యటానికని డబ్బు శాంక్షను చెయ్యి. రోడ్డు పోయించటం మాత్రం మానెయ్యి. ఆ వార్డు కౌన్సిలర్ వగైరాలు నీ జోలికి రాకుండా నేను చూసుకుంటాను. నా పన్ను నువ్వే కట్టినా కూడా ఇంకా నీకు బోలెడు డబ్బు మిగుల్తుంది."

"ఇహ ఇలాంటివి చెయ్యటం నా వల్లకాదు."

"హఠాత్తుగా మంచివాడనిపించుకోవాలనే తపన పుట్టిందా?"

."మీ ఇష్టమొచ్చినట్టు అనుకోండి."

"నాకు సపోర్ట్ ఇవ్వవు. నా పన్ను డబ్బు మాఫీ చెయ్యవు. అంతేగదా?"

"...."

"చూడు బాబూరావూ! నాతో పెట్టుకోటం ఏ విధంగా చూసినా నీకు మంచిదికాదు. దీని ఫలితాన్ని అనుభవిస్తావు." సంజీవదేవ్ మొహంమీద అంతవరకూ కప్పుకున్న స్నేహం ముసుగు సాంతం జారిపోయింది.

"మీరు నన్నేం చెయ్యలేరు." మొండిగా అన్నాడు బాబూరావు.

"అలాగా! సరే! రెడీగా ఉండు." అంటూ విసవిసా వెళ్లిపోతున్న సంజీవదేవ్‌కి అప్పుడే వస్తున్న పాపారావు ఎదురయ్యాడు. ఆయన్ని చూసి నవ్వబోయి, ఆయన సీరియస్‌గా చూడ్డంతో నోరుమూసుకుని లోపలికొచ్చాడు పాపారావు.

"ఏమిటి? గురుడట్లా రుసరుసలాడిపోతున్నాడు?" అన్నాడు పాపారావు.



# ఒడిలో ఆవేదన మోహన రాగం

'వాడి మొహం వాడతరంకాదు మూడొంతుల మందికి పైగా కౌన్సిలర్లు మన చేతుల్లోనే ఉన్నారు " నిబ్బరంగా అన్నాడు బాబూరావు

*    *    *    *

ఎలక్షన్‌లో బాబూరావు బావమరిది ఓడిపోయి సంజీవదేవ్ గెలిచాడు ఆయన ఎమ్ ఎల్ ఎ అయ్యాక వాడు అధికారంలోకి వచ్చాడు ఎందుకయినా మంచిది మనవాళ్లందర్నీ ఓసారి సమావేశ పరిచి చర్చిస్తే మంచిది అని సలహా ఇచ్చాడు పాపారావు

అలాంటి అవసరం ఏంలేదులే. అన్నాడు బాబూరావు

'పూర్వపు నమ్మకాలు ఇప్పుడుంచుకోటం మంచిదికాదు నీ పదవి ఊడబెరికి. గోపాల్రావుని చెయిర్మన్‌గా చేస్తానని సంజీవదేవ్ అంటున్నాడట

నీమీద అవిశ్వాస తీర్మానం ప్రవేశపెట్టబోతున్నారనే వార్త కూడా ప్రచారంలో కొచ్చింది ఎందుకు చెపుతున్నానో విను మనం అప్రమత్తంగా ఉంటె ఏం పోయింది?

కౌన్సిలర్లందర్నీ తన ఇంటి కాహ్వానించి అక్కడ సమావేశం ఏర్పాటు చేశాడు బాబూరావు

ఇరవై మంది కౌన్సిలర్లలో పదిమంది బాబూరావునే సపోర్ట్ చేశారు అయిదుగురు అసలు హాజరు కాలేదు

మేం మీవేపే ఉంటాం బాబూరావుగారూ. అన్నంమీదా పాలమీదా ప్రమాణం చేస్తున్నాం అన్నారు ఇంకా ఇద్దరు. మిగిలిన వాళ్ళు తటస్థంగా ఉన్నారు

ఎంతడబ్బు కావాలన్న ఇస్తాను మీరు మళ్లీ అటువేపు తిరగి పోగూడదు అన్నాడు బాబూరావు

మేం మాట తప్పం అవతల ఆయన పదివేలిస్తానంటున్నాడు అయినా మేము

"ఒక్కొక్కళ్లకీ పన్నెండు వేలిస్తాను నేను " అన్నాడు బాబూరావు ఆత్రంగా

"అలాగే. మీరు నిశ్చింతగా ఉండండి " అన్నారు వాళ్ళు భరోసాగా

"వీళ్లని నమ్మటానికి వీల్లేదు వీళ్ల ప్రతి కదలికనూ గమనిస్తూనే ఉండాలి " అన్నాడు పాపారావు

*    *    *    *

పదకొండుమంది కౌన్సిలర్లు ఆర్ డి. ఓ ఆఫీస్ కెళ్లి అవిశ్వాస తీర్మానానికి తనమీద నోటీసిచ్చారని విని నిర్ఘాంతపోయాడు బాబూరావు.

అలా వెళ్లిన వాళ్లలో ప్రత్యేకంగా ప్రమాణం చేసిన వాళ్లిద్దరూ కూడా ఉన్నారు.

"నే చెప్పలా? వాళ్లిద్దర్నీ నమ్మొద్దని? అన్నాడు పాపారావు.




"అన్నంమీదా. పాలమీదా ప్రమాణంచేసి " హీనస్వరంతో అన్నాడు బాబూరావు.

"పెళ్లాం పిల్లలమీద ప్రమాణం చేసినా కూడా నమ్మకూడదు. రాజకీయ నాయకుడి వయి ఉండి ఇలా అమాయకంగా మాట్లాడతావేమిటి!"

ఆవేశం పట్టలేక వాళ్లదగ్గర కెళ్లి నిలదీసి అడిగాడు బాబూరావు

."ఏం చెయ్యమంటారండీ? వాళ్ల మాటలు వినకపోతే మా ప్రాణాలు తీస్తామన్నారు.. ఆస్తులు నాశనం చేస్తామన్నారు వీటన్నిటికన్నా ఒట్లూ ప్రమాణాలూ ఎక్కువకాదు గదా." అన్నారు వాళ్ళు.

"అయితే మేమలా బెదిరించక పోవటమే మేం చేసిన పొరపాటన్నమాట" బాబూరావు మాటలకు నిర్లక్ష్యంగా ఊరుకున్నారు వాళ్ళు..

"వీళ్ల సంగతిలా కాదు పోలీసుల సాయంతో బలవంతంగా లాక్కొచ్చి మన పని చేసుకోవాలి." కసిగా అన్నాడు పాపారావు. హైదరాబాదు వెళ్లాడు బాబూరావు .

జి ఓ. మార్పించి సభను డిజాల్వ్ చేయించాలని అతను చేసిన ప్రయత్నాలు ఫలించలేదు

రౌడీలసాయంతో కౌన్సిలర్లని లాక్కురావాలని చేసిన ప్రయత్నాలు కూడా సాగలేదు

సంజీవదేవ్ బాబూరావు కన్నా పెద్ద గూండా. కౌన్సిలర్లని నరమానవులకు తెల్లియనిచోట దాచిపెట్టి కాపలా ఏర్పాట్లు చేశాడు. ఇలాంటి వాటిలో సంజీవదేవ్ బాగా ఆరితేరినవాడు...

అవిశ్వాస తీర్మానం ప్రవేశపెట్టబడింది .. బాబూరావు పదవీచ్యుతుడయ్యాడు. అతని స్థానంలో. సంజీవదేవ్ మద్దతుతో అతని మనిషయిన గోపాల్రావు ఛైర్మన్ అయ్యాడు.

అవమానంతో. రోషంతో .. కసితో రగిలిపోయాడు బాబూరావు కానీ . సంజీవదేవ్‌ని ఏమీ చెయ్యలేకపోయాడు. అతనిమీద పగ రోజురోజుకూ పెరుగుతోందేగానీ తగ్గటంలేదు బాబూరావులో

సంజీవదేవ్ హార్ట్ ఎటాక్ వచ్చి చనిపోయాడు. అయినా బాబూరావుతో వాళ్లపట్లగల పగ చల్లారలేదు .. సంజీవదేవ్ స్థానానికి జరిగిన బై ఎలక్షన్‌లో అతని కొడుకు రాజకుమార్ పోటీచేసి నెగ్గాడు. అతను ఎం ఎల్. ఎ. అయ్యాడు అతనితో పోటీచేసిన బాబూరావు ఓడిపోయాడు. గోపాల్రావుని పడగొట్టాలని అతను చేసిన ప్రయత్నాలు కూడా ఫలించలేదు.

అవకాశం కోసం పొంచి ఉన్నాడు బాబూరావు.

★    ★    ★    ★    ★    ★

వెంకట్రామయ్య బాబూరావుల కుటుంబాల మధ్య మంచి స్నేహం ఏర్పడింది ఆ స్నేహం ఎక్కువగా ఆడవాళ్లవేపు నుంచే బలపడింది.

అనవసరమయిన విషయాల్లో తలదూర్చకుండా .. శాంతంగా . నమ్రతగా ఉండే వెంకట్రామయ్య అంటే బాబూరావుకి ఇష్టమే.

తనను డామినేట్ చెయ్యాలనుకునేవాళ్లంటే బాబూరావుకి ఎలర్జీ తన గొప్పలను ఆసక్తితో వినేవాడు. తనకు వ్యతిరేకంగా తిరిగి వ్యాఖ్యానాలు చెయ్యనివాడు .. తన ముందు ఏమీ తెలియనట్టు నటిస్తూ ... అతను చెప్పిన ప్రతి మాటనూ అబ్బురంగా వినేవాళ్ళు అయితే ... అలాంటి వ్యక్తుల్ని బాబూరావు బాగా ఇష్టపడతాడు.

అందుకే . శాంతంగా . సౌజన్యంగా ఉండే వెంకట్రామయ్య బాబూరావ్ దృష్టిలో నిలవగలిగాడు .

శర్వాణీ కామేశ్వరి కూడా చాలా దగ్గరయారు. తరచుగా ఇద్దరూ కలుసుకుంటూ ఉండేవారు.

"మంజీరను నా కోడలుగా చేసుకోవాలనుంది నాకు" అన్నది ఓ రోజు కామేశ్వరి

శర్వాణి ప్రణీత్ ఫోటో చూసింది వివరాలు తెలుసుకుంది. ముఖ్యంగా తన కూతురు ఆ ఇంట్లో బాగా సుఖపడుతుందనే నమ్మకం ఆమెకేర్పడింది. కామేశ్వరి మంచితనం ఆమెనాకర్షించింది.

తాతగారితో సంప్రదించి. ఈ విషయాన్ని భర్త ముందుంచింది శర్వాణి. ఆ ఇంట్లో ఏ విషయానికయినా బాబూరావుదే అంతిమ నిర్ణయం.

ప్రియాతి ప్రియమైన బాలకు
ప్రత్యేకమైన ప్రేమకానుక.

# యూనిట్ ట్రస్ట్ వారి బాలల కానుక వృద్ధి నిధి 1986.



## మీ డబ్బు పెరుగుతూ పోతుంది–
## ఏకంగా పన్నెండు రెట్లు.
## పైగా బోనస్
## డివిడెండు కూడా!

బాలల కానుక వృద్ధి నిధి. (Children's Gift Growth Fund). మీకు ప్రియమైన బాలకొక చక్కని కానుక ఇచ్చే పథకం. ఈ పథకంలో మీ డబ్బు 6 ఏళ్లలో రెట్టింపవుతుంది. అలాగే వృద్ధి చెందుతూ 21 ఏళ్లలో 12 రెట్లు పెరుగుతుంది.

ఈ పథకంలో పెట్టుబడి, మీ పాపాయి పుట్టగానే పెట్టడం అత్యుత్తమమైన పని. అయితే 15 ఏళ్ల వరకు వయసు గల పెద్ద పిల్లల కోసం కూడా ఇందులో పెట్టుబడి పెట్టవచ్చు.

మీ బిడ్డకు 21 ఏళ్లు వచ్చేసరికి మీ కానుక మొత్తం రు. 12,000 కావడానికై ఏ వయసులోనైతే ఎంత మొత్తం పెట్టుబడి పెట్టాలో ఈ క్రింది పట్టిలో చూడవచ్చు.

**21 ఏళ్లు వచ్చేసరికి రు. 12,000 కావడానికై వివిధ వయస్సు దశలలో పెట్టుబడి పెట్టవలసిన మొత్తం:**

| వయస్సు (సం.) | పెట్టుబడి మొత్తం* (రు.) | వయస్సు (సం.) | పెట్టుబడి మొత్తం* (రు.) |
|---|---|---|---|
| పుట్టగానే | 1,000 | 8 | 2,600 |
| 1 | 1,200 | 9 | 2,900 |
| 2 | 1,300 | 10 | 3,300 |
| 3 | 1,500 | 11 | 3,700 |
| 4 | 1,600 | 12 | 4,100 |
| 5 | 1,800 | 13 | 4,700 |
| 6 | 2,100 | 14 | 5,200 |
| 7 | 2,300 | 15 | 5,900 |

* (దగ్గరి రు. 100 కు తెంపుకు సవరించబడిన పెట్టుబడి మొత్తం)

**ఈ పథకం విశేషాంశాలు:**

- ఈ పథకంలో పెద్దవారెవరైనా, అంటే తల్లిదండ్రులు, బంధువులు, స్నేహితులు ఎవరైనా 15 ఏళ్లలోపు బాలకెవరికైనా కానుక ఇవ్వవచ్చు. పథకంలో పేరు నమోదు అనవసరం.
- **మీ కానుక సొమ్ముపైన నిశ్చయంగా 12.5% డివిడెండు రాగా, అది ఏటేటా తిరిగి మదుపు పెట్టబడుతుంది. అదే విధంగా 5 ఏళ్లకొకసారి ఇవ్వబడే బోనస్ డివిడెండు కూడాను.**
- బాలకు 21 ఏళ్లు వచ్చేసరికి కానుక పరిణతి చెందుతుంది. కావాలంటే 18 ఏళ్లప్పుడు వాపసు తీసుకునే అవకాశం ఉంది. అప్పటిదాకా ఎవ్వరేగానీ అంటే తల్లిదండ్రులుగానీ బాలగానీ ఈ కానుక సొమ్మునుగానీ, డివిడెండునుగానీ ముట్ట వీల్లేదు.
- ఈ పథకం క్రింద యూనిట్ల ముఖవిలువ రు. 10 ఉంటుంది. దరఖాస్తులు 10 యూనిట్ల గుణింపులకై చేయవచ్చు. మీరు దరఖాస్తు పెట్టగల యూనిట్ల కనీస సంఖ్య 50. గరిష్ఠ పరిమితి లేదు.

ఫైనాన్స్ ఆక్టు 1986 క్రింద కానుక పన్ను మినహాయింపు పరిమితి రు. 20,000.

దరఖాస్తు ఫారాలు ఏ యూనిట్ ట్రస్ట్ కార్యాలయం నుండి గాని, ముఖ్య ప్రతినిధి లేదా ఏజెంటు వద్ద నుండి గాని, వాణిజ్య బ్యాంకుల శాఖలన్నిటి వద్ద నుండి గాని పొందవచ్చు.

CGGF గురించిన ఉచిత కరపత్రం దయచేసి నాకు పంపండి.
పేరు ______________________
చిరునామా ______________________
______________________

కూపన్ పంపవలసిన చిరునామా:
బొంబాయి: పోస్ట్ బ్యాగ్ నం. 11410, ఫోన్: 256897.
కలకత్తా: పోస్ట్ బ్యాగ్ 60, ఫోన్: 209391,
మద్రాసు: పోస్ట్ బ్యాగ్ 5068, ఫోన్: 27433;
న్యూ ఢిల్లీ: పోస్ట్ బ్యాగ్ 5, ఫోన్: 3318638.

UNIT TRUST OF INDIA
**యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా**
(ప్రభుత్వ రంగంలో ఒక ఆర్థిక సంస్థ)

Sista's-UTI-414/86 TEL

ఇది ఇప్పటికే అమల్లో ఎప్పుడూ కొనసాగుతున్న పథకం. ఇందులో యూనిట్లు ఏడాది పొడుగునా, సమవిలువపైన, యూనిట్ ఒక్కొంటికి రు. 10/- చొప్పున లభిస్తాయి.

# ఒడిలో చెలి మోహన రాగం

ఈ ప్రపోజల్ త్రోసిపుచ్చటానికి అతనికే కారణము కనపడలేదు అందుకని ఆయన దీనికి అభ్యంతరం పెట్టలేదు

'తను ఒక్కసారయినా చూడని వ్యక్తిని తన భర్తగా నిర్ణయించేశారు వాళ్ళు

అతని ఊహలనిండా నువ్వే అతని పాటకు పల్లవి నువ్వే" అంటుంది హైమ

తన భర్తగా నిర్దేశింపబడి, తననే కోరుకొంటున్న ఆ వ్యక్తినోసారి చూడాలని తహతహగా ఉంది మంజీరకి ఈ అనుభూతి తమాషాగా ఉందామెకు.

తానెరుగని తనను ప్రేమించే అతన్ని తలుచుకుంటుంటే కొత్తగా ఉంది

అతనింకో రెండు నెలలు పోతేగానీ రాడట!

అంటే అరవై రోజులు!

అతని కోసంఎదురు చూడటం ఈ తహ తహ ఇదంతా ఏదోలా ఉంది

ఏకాంతంగా అతని గురించిన మధురోహల్ని మాత్రమే తోడు చేసుకుని ఎంతసేపో గడపెయ్యాలనుంది

తన పరధ్యానానికతను కారణం!

తన ఊహల కతను కేంద్ర బిందువు!

అనుభవంలోకి రాని మధుర భావనల కతను ఆధారం నిద్ర పట్టక, మంచాన్ని కిటికీ దగ్గరగా లాక్కుని, కిటికీ రెక్క తీసి, దాని మీద మోచెయ్యి ఆనించుకుని బయటకు చూస్తోంది మంజీర

ఆమె కన్నె మనసులోకి అతి లాఘవంగా జొరబడ్డ ఆ అపరిచిత వ్యక్తి తాలూకు ఆలోచనలామెను కలవర పెడుతున్నాయి అదో రకమైన వేదనకు గురి చేస్తున్నాయి

ఈ సన్నని చంద్రకాంతి సైతం తన హృదయాన్ని మండిస్తోంది ఆ మంటలో ఎంత మాధుర్యం!

'కలవరపు నా బ్రతుకు కలత నిదరయ్యింది

ఇలా చేసింది అతనే!

లేకుంటే తనీ పాటికి నిశ్చింతంగా నిద్రపోయి ఉండేది

మిణుగురు పురుగుల కాంతి చెట్ల ఆకుల సందులో అల్లుకుని అలంకరిస్తూ చెట్లు దీపావళి చేసుకుంటున్నాయా అనిపిస్తోంది "

ఇలా ఈ తలుపు తీసి చూస్తుంటే ఎముకలు కొరికేసేంత చలి! అయినా అతని ఊహలు గుండెల్లో వెచ్చగా ఈ చలీ వేడిమిల కలయిక బావుంది

పెద్దవాళ్ళ మధ్య జరిగిన మాటలు తన మౌనం అందులో నిండి ఉన్న అంగీకారం

ఇవన్నీ అతనికి తెలిసిపోయాయి హైమ కూడా అతనికి రాసిందట ఈ విషయాలన్నీ!

మంజీరలో ఇంత సంచలనం కలగటానికి కారణం ఆమె ఆ రోజు సాయంత్రం ప్రణీత్ నుంచి మొదటిసారిగా అందుకున్న ఉత్తరం

ఆ ఉత్తరం తలుచుకుంటోంది మంజీర

'మీ మనసు తెలుసుకోకుండా నేనిలా రాయటం పొరపాటేమో అనే సందేహం నన్ను ఎడిస్తూనే ఉంది

అయినా ఆపుకోలేక నా మనసును నీ ముందుంచుతున్నాను క్షమించు!

కాసేపు 'నువ్వు' అనే సంబోధిస్తాను

బాపూ గీసిన బొమ్మలా దేవులపల్లి కవితలా నువ్వా నీటి ఒడ్డున కూచున్న దృశ్యమే పదే పదే గుర్తొచ్చి నన్ను కలవర పెడుతోంది

ఎండా కాలంలో శిలల మధ్య ప్రవహించే తుంగభద్ర నీళ్ళలోని సాయంత్రపు నీరెండ నీ బుగ్గల మీద పచ్చగా ప్రతిఫలిస్తున్నట్లనిపిస్తుంది నాకు నీ బుగ్గల నునుపుదనం గుర్తొస్తే ప్రతి అందమైన ఊహకూ ఇలా నువ్వే రూపకల్పన వవుతున్నావు చెలి!

నీ నవ్వు చప్పుడు నా గుండెలో కలకలాన్ని రేపుతోంది

విచ్చిన మల్లెల పశి తెల్లదనం వాటిక అంటిన చల్లదనం నీ నవ్వుతో కలిసి. అర్ధరాత్రి నిద్ర లేపి. నరాల మధ్య చక్కలిగింతలు పెడుతోంది

నాకు మల్లెలంటే చాలా ఇష్టం!

ఒకసారి .. ఎవరో మల్లెమొగ్గ ఇస్తే జేబులో వేసుకుని, మర్చిపోయాను

సాయంత్రం సముద్రం ఒడ్డున కూర్చుంటే ఎక్కడో మల్లెల వాసన! చుట్టూ వెతికాను .

అప్రయత్నంగా జేబులో చెయ్యి పెట్టి బయటకు తీస్తే విచ్చిన తెల్లని మల్లె

నా కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

మాట్లాడకుండా కళ్ళింత చేసుకుని, నోట్లో వేలుంచుకుని చూసే పసిపాపలా, నా అరచేతి మధ్య మల్లెపువ్వు! ఆ పువ్వును తిరిగి నీ నవ్వులో చూడగలిగాను! కవిత్వానికి కవికి దీపానికి కాంతికి ఉన్నంత అనుబంధం నీతో నాకున్నదనిపిస్తోంది

నువ్వు వదిలిన చోటే నిలబడి నేనింకా దిక్కులు చూస్తున్నాను నువ్వు నన్నొదిలి యోజనాల దూరం వెళ్ళిపోయినట్లుంది

ఎందుకు ప్రేయసీ మన మధ్య ఇంత దూరం!?

నాకు నిన్ను సమీపంగా అతి సమీపంగా చూడాలనుంది సిగ్గు సగ్గంటూ పారి పోవుగా?

నీకిది తెలుసా మంజూ ?

ప్రియురాలి సిగ్గుకు రాణింపు ప్రియుని సన్నిధిలో నేనట ఇలా రాస్తున్నానని భయపడి, అనుమాన పడకు సుమా!

ప్రేమలో విశాలత్వం వెరయిటీ కాదు ముఖ్యం. ఇంటిన్సిటీ ప్రధానం ఈ సంగతి నాకు బాగా తెలుసు

చెలీ! నీ నుదుటిని తాకిన గాలిలోని చల్లదనం నా పెదాలదే! నీ గుండెల మధ్య సన్నటి గీతలో నువ్వు గీసుకున్న ఊహాచిత్రం నాదే!

చాలా త్వరలో నిన్ను కలుసుకోబోతున్నానంటే రక్తం పొంగి పొంగి, నా ప్రియురాలి క్షేమాన్ని గురించి కూడా ఆలోచించ నివ్వనంతటి ఉధృత రూపాన్ని దాలుస్తోంది

ఇలా ఎంత రాసినా దీనికి ముగింపు లేదు అయినా ప్రస్తుతానికి ముగించటానికే ప్రయత్నిస్తాను.. జవాబు రాయవూ!

ఇలా రాశానని కోపమా?

నన్ను తిట్టు కానీ నా మీద అలగకు

నా మీద అలుగు! నేను బ్రతిమాలుకోగలను కానీ నా నుంచి మాత్రం దూరం కాకు. నేను భరించలేను

ఇట్లు
నీ
ప్రణీత్

ఓహ్! ఏం ఉత్తరం!

ఎంత భావుకత!

ఇలా ఉత్తరం రాయగలగటం ఎందరు మగాళ్ళకి చేతనవుతుంది?

'ఎండా కాలం సాయంత్రం, దక్షిణ వాయువు ప్రసరిస్తే.

'అమ్మా! ప్రాణానికి హాయిగా ఉంది అంటారందరూ

"దక్షిణ మారుతంలో నుంచి, ఈ ప్రపంచ ప్రియుడు నన్ను తాకి ఆనందిస్తున్నాడు!" అని ఏ ఒక్క టాగూర్ మాత్రమో అనగలడు!

తను అదృష్టవంతురాలు!

'అప్పుడే విచ్చుకుంటున్న నా కన్నుల మీద అగరు వాసనలతో కూడిన పెద్ద జుట్టు పరుచుకుంది

నా చెవిలో 'మర్చిపోయావా నన్ను!' అని తియ్యగా జాలిగా ప్రశ్నించిందో స్వరం

నిన్ను మర్చిపోయి బ్రతగ్గలనా మంజూ ?! అయినా ఈ క్రూరమైన అభ్యంతరాలన్నిటినీ తప్పించుకుని ఎలా రాగలిగావు ప్రేయసీ!" అని ఆశ్చర్యంగా ప్రశ్నించాను."

"తీరా చూస్తే ఇది నీ గురించిన అందమైన ఊహ మాత్రమే ఈ అనుభూతిని అనుభవంగా మార్చుకోగల శుభ సమయం కోసమే వేచి వున్నాను ఇందుకు ఎన్ని యుగాలైనా ఎదురు చూడగలను నా ఆశకు అంతం లేదు. విఫల విశ్వాసానికి కొరత లేదు ఇవన్ని అతని ఉత్తరంలో కొన్ని భాగాలు .

ఆ ఉత్తరంలో ప్రతి వాక్యం కొన్ని వందల సార్లు చదివి ఉంటుంది తను ప్రతి మాటా కంఠస్తమయిపోయింది తిరిగి తిరిగి తన హృదయంలో ప్రతిధ్వనిస్తోంది మంద్ర స్థాయిలో అతని స్వరం చెవి దగ్గర వినిపిస్తున్న అనుభూతి

వాకిట్లో నుంచి తాతగారి దగ్గు . నిళ్ళు పుక్కిలించి ఉమ్మేస్తున్న చప్పుడు మంజీర ఊహల్ని చెదరగొట్టింది తనూ లేచి వాకిట్లో కెళ్ళింది

"ఏమ్మా 'మంజూ ! నిద్ర పట్టలేదా", చలిగా ఉందా" రా! నెగడు ఎగదోస్తాను కాసేపు చలి కాగుదు గాని అన్నారు తాతగారు రెండు పెద్ద పెద్ద మొద్దుల చివర నిప్పు నివురు గప్పి ఉంది వాటిని దగ్గరగా లాగి, వంగి ఊది బూడిద చెదరగొట్టి ఎర్రగా చేశారాయన

రెండు అర చేతుల్ని చాపి నిప్పు దగ్గరగా పెట్టి నీకూ నిద్ర రావటల్లేదా తాతయ్యా?' అన్నది మంజీర

"చలి మరి ఎక్కువగా ఉండి నిద్ర పట్టకపోతే కాసేపు నెగడు దగ్గర కూచుందామని వచ్చాను అన్నారాయన.

చేతివేళ్ళ సందుల్లో నుంచి నిప్పు తాలూకు కాంతి ఎర్రగా మెరుస్తోంది

'ప్రణీత్ దీన్ని ఏమని వర్ణిస్తాడో!"

ఇలా అనుకోగానే అప్రయత్నంగా ఆమె పెదవుల మీద చిరునవ్వు వెలిగింది ఇహ అక్కడుండ బుద్ధి కాలేదు.

"పడుకుంటా తాతయ్యా అంటూ లేచి వెళ్ళి, బ్లాంకెట్ మెడ వరకూ లాక్కుని కళ్ళు మూసుకు పడుకుందామె

అతని ఊహలు మనసులో మెదిలితే చాలు, తను ఇంకొకరి ఉనికిని భరించ లేకుండా పోతోంది ఒంటరిగానే కలలు కనాలనిపిస్తోంది

(ఇంకా ఉంది)

# అపెల్ చూపే నగ్న సత్యాలు

ఇందుకు అనేక మార్గాలున్నాయి. కొందరు కేబినెట్‌తోసహా మొత్తం కిట్ (Kit) నే దిగుమతి చేసుకుని, దాన్ని బిగించేసి, 'హైటెక్నాలజీ సరుకు' అంటూ ఆర్భాటం చేసి హైరేటులో అమ్మేస్తూంటారు. దాని ఆటాపాటా కూడా మీకు బాగానే అనిపించవచ్చు. కాని అసలు చిక్కు, ఆ కిట్ యొక్క విదేశీ తయారీదారు ఆ మోడల్‌ని విరమించినప్పుడు మొదలవుతుంది. ఇక ఆ విడిభాగాలు దొరక్క సదరు టి.వి ఓనరు ఆ పనికిరాని టి.వి కేసి చూస్తూ కూర్చోవాలి.

తరవాత ఇంకో రకం వున్నారండోయ్! వాళ్లే ఈ దేశంలో టి.వి. టెక్నాలజీని రూపొందించామని గర్వంగా చెప్తూంటారు. కాని వాళ్లు కూడా కొన్ని కీలకమైన విడి భాగాలు గప్‌చుప్‌గా విదేశాలనుండి దిగుమతిచేసి, టి.విలో ఉపయోగిస్తారు.

ఇదంతా తెలిసి తికమకపడే కస్టమరుని చూస్తే జాలేస్తుంది.

ఇటువంటి పరిస్థితిలో మేం చెప్పేదొక్కటే. మీరు ఒక మంచి టి.వీ. కొనాలనుకుంటే ఒకసారి అపెల్ టి.వీని చూడండి. అత్యుత్తమమైన దేశీ విదేశీ భాగాల సమ్మేళనంతో, అత్యంత సాంకేతిక నైపుణ్యతతో టి.వీని రూపొందించి మీ ముందుంచాం. మనదేశపు టి.వీ. తయారీ రంగంలో హేమా హేమీల ఆధ్వర్యంలో అపెల్ టి.వీ. రూపుదిద్దుకుంది. ఇది ఏళ్లతరబడి నమ్మకంగా పనిచేస్తుందని హామీ ఇస్తున్నాం.

అపెల్ ఇదంతా ఇంత ధీమాగా ఎలా చెప్పగల్గుతోంది? అవునుమరి లాభార్జనే పరమావధిగా పెట్టుకుని టి.వీలు చేసి అమ్మే కంపెనీలవలే కాకుండా రాష్ట్రంలో ఎలక్ట్రానిక్స్ పరిశ్రమాభివృద్ధి కోసం స్థాపించబడిన ప్రభుత్వ సంస్థ అపెల్. ఒక ఉన్నత ఆశయసాధనలో అపెల్ టి.వీ. మొదటి మెట్టు మాత్రమే. ఆదిలోనే హంసపాదు అపెల్ ముమ్మాటికీ రానివ్వదు.

## APEL

వట్టిమాటలు కట్టిపెట్టి గట్టినాణ్యత పంచిపెట్టే అపెల్

ఆంధ్రప్రదేశ్ ఎలక్ట్రానిక్స్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ లిమిటెడ్
—ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సంస్థ



కావేరి పోర్టబుల్ 14" B/W
రు. 1575/-



గంగమార్క్ II కలర్ రు.7,680/-



యమున కలర్ రు.7,500/-



నర్మద (కలర్) రు 6794 /-

బయటి ఊర్ల అమ్మకాలపై రవాణా, ఇన్స్యూరెన్స్ ఛార్జీలు అదనం.

విజయవాడ:
డోర్ నెం.29–6–32, వార్డు నెం.25
రామచంద్రరావు రోడ్, సూర్యారావు పేట, విజయవాడ–2 ఫోన్: 76268.

విశాఖపట్నం
డోర్ నెం.50–92–I/F,
శాంతిపురం, విశాఖపట్నం

రాష్ట్రం అంతటా డీలర్లు డిస్ట్రిబ్యూటర్లు కలరు

# నీళ్ళ పోసని నిజాయితీ

**మూరి వెంకటరావు**

ఉదయం తొమ్మిదవుతూనే అలవాటు ప్రకారం లైబ్రరీకి బయలుదేరాను

కడుపులో ఆత్మారాముడు అల్లరి పెట్టడంతో జేబులు తడుముకున్నా నో మారు

దొరికిందో పావలా

మరి ఆలశ్యం చేయకుండా రోడ్డు ప్రక్కనున్న టీ బడ్డీలో ఆఫ్ టీ త్రాగి గ్రంధాలయం చేరుకున్నాను

లోపల అడుగు పెట్టగానే నా కోసమేనన్నట్లు బల్ల మీదొక దినపత్రిక ఎదురు చూస్తోంది

ఉద్యోగ ప్రకటన లేమైనా ఉన్నాయేమోనని పేజీలు త్రిప్పాను.

తాటి కాయంత అక్షరాలతో కనిపించిందో ప్రకటన ఇటువంటి ప్రకటనలే నా లాంటి నిరుద్యోగు లందరికి పంచభక్ష్య పరమాన్నాలు

ఇంత లేసి కళ్ళు చేసుకుని మరీ చూశాను

"విజయా చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్

ఆంధ్రప్రదేశ్‌లో గల అన్ని బ్రాంచిలలో పని చేయడానికి అర్హతలు గల అభ్యర్ధుల నుండి ధరఖాస్తులు కోరబడుతున్నాయి.

విద్యార్హతలు — ఇంటర్ లేక తత్సమానమైన పరీక్ష పాసై వుండాలి ఖాళీలు — రెండు వందలు జీతం — నెలకు ఎనిమిది వందలు. అనుభవం లేకపోయినా ఫరవాలేదు అభ్యర్థులు తమ బయోడేటాను తెలుపుతూ దిగువ చిరునామాకు పది రూపాయలు ఎమ్ ఒ చేసిన రిసిప్టు విదిగా జతపర్చాలి పది రొజుల లో పుగా ధరఖాస్తులు పంపుకోవాలి

వి వి రాజు

డైరెక్టర్

విజయా చిట్‌ఫండ్ ప్రవేట్ లిమిటెడ్

విశాఖపట్నం.

'డైరెక్టర్ రాజు!" కొంపతీసి నా క్లాస్‌మేట్ రాజు కాదు కదా! నా అదృష్టం పండి వాడే నా చిననాటి స్నేహితుడే ఐతే తప్పకుండా ఉద్యోగమిస్తాడు

ఆ ఆశతోనే మామయ్యను బ్రతిమలాడి ఇరవై రూపాయలు తీసుకుని మరునాడే ప్రయాణ మయ్యాను

బస్‌స్టాండు చేరుకునే సరికి రెడీగా వుంది నాన్‌స్టాప్ బుకింగ్ కౌంటర్లో చేతులు పెట్టి వైజాగ్‌కి ఒక టిక్కట్టిమ్మన్నాను విజయనగరం నుండి ఛార్జి ఏడున్నరైతే చిల్లర లేదంటూ 'ఇరవై కాగితమిస్తే పన్నెండు రూపాయలు ' చేతిలో పెట్టాడు ఇక వాడితో అర్ధ రూపాయి కోసం పేచి పడితే కాబో యే పని అవదేమోనన్న సెంటిమెంటుతో కిమ్మనలేదు

ఉదయం ఎనిమిదిం పావుకు బయలుదేరిన బస్సు తొమ్మిదిం పావుకు ఆర్ టి ఎ కాంప్లెక్స్ చేరుకుంది

కొందరు ఆటోలలో, కొందరు రిక్షాలలో మరికొందరు సిటీ బస్సులలో ఎవరి తాహతుకు తగ్గట్టూ వారు గమ్యస్థానం చేరుకోవాలని తాపత్రయ పడుతున్నారు

నా బోటి వాళ్ళకు కాళ్ళే కారు అందుకే తిన్నగా కాళ్ళకు బుద్ధి చెప్పాను

టూ టౌను పోలీసు స్టేషను వరకు వచ్చానో లేదో ఓ నికృష్టజీవి 'ధర్మం బాబూ!' అంటూ నా వెంట పడ్డాడు వాడి చేతులకు, కాళ్ళకు కట్లున్నాయి మొహం వికృతంగా వుంది

చిల్లర లేదని తప్పించుకు పోదామన్నా ఓ పట్టాన నన్ను విడిచి పెట్టలేదు ఈ జిడ్డు మరి వదిలేటట్టు లేదనుకుని ఓ పదిపైసలుంటే వాడి జోలిలో వేసాను

నన్ను చూడడంతోనే 'రవీ' అన్నాడు వాడు

ఆ పిలుపులో అత్యంత ఆత్మీయత ఇమిడి వుంది

ఆశ్చర్యంగా చూశాను అతడి వంక

"నేను రఘీ! మనం కలసి చదూకున్నాం మర్చిపోయావా?"

నిర్ఘాంతపోయాను కొన్ని క్షణాల వరకు నా నోరు పెగల్లేదు.

'అరే, నువ్వా? ఇలా ఐపోయావేంరా?" అన్నాను ఆశ్చర్యం నుండి తెరుకుంటూ

ఇన్నాళ్ళూ ఉద్యోగం దొరకక పోయేసరికి నా కంటె అభాగ్యుడు మరొక డీ లోకంలో ఉండడేమో ననుకున్నాను వాడి పరిస్థితి కళ్ళారా చూశాకా ఎంతో జాలి వేసింది

వీడికి జబ్బు ఎలా ప్రవేశించింది చెప్మా అని అనుకొంటూ వుండగానే "నిన్ను చూసి ఎన్నాళ్ళైందో రా రా ఈ దగ్గర్లోనే వుంటున్నాను కాస్సేపు మనసు విప్పి మాట్లాడుకుందాం" అన్నాడు

యాంత్రికంగా అనుసరించానతడిని

ఒక కమ్మరింట్లోకి తీసుకెళ్ళి బల్ల వేసి కూర్చోబెట్టి లోపల కెళ్ళాడు.

ఐదు నిమిషాల తర్వాత తిరిగి వచ్చిన రఘుని చూశాకా నాకు మతిపోయింది పోలీసు స్టేషను దగ్గర చూసిన రఘునా వీడు? . ఆ ముఖమేనా ఇది? ఆ కట్లేవి? ఆ జోలేది?

'ఏమిట్రా ఈ నాటకం?"

"జీవిత నాటకం — కుష్ఠురోగి పాత్ర ధరించాను ఎలా వుంది మన వేషం? అన్నాడు నవ్వుతూ

అడుక్కు తిన్నట్లే వుంది" అని మనసులో అనుకుని ఇంతకూ దేనికి నాటకం?" వాడు చేస్తున్న పనిని అసహ్యించుకుంటూనే అడిగాను

బ్రతకడం కోసం '

ఇంత కంటె మరో మార్గం కనపడలేదా?"

"లేదు ఉద్యోగం కోసం కాలుతున్న కడుపు పట్టుకుని ఎందరెందర్నో ఆశ్రయించాను నా సంపాదన మీదే ఆధారపడ్డ తండ్రి కోసం, వయసొచ్చిన చెల్లెలు కోసం ఇంటింటా వాకిరి చేసి మంచం పట్టిన అమ్మ కోసం అడ్డమైన వాళ్ళందరి కాళ్ళూ పట్టుకున్నాను నువ్వు ఎఫ్ సి వి లాభం లేదన్నారు ఉత్తరమో దక్షిణో సమర్పించుకుంటే గాని ప్రయోజనం వుండదన్నారు నువ్వు ఇంటర్వ్యూలో సెలక్టు కాలేదన్నారు చివరికి కలం పట్టిన చేత్తోనే సుత్తి పట్టుకుని రాళ్ళు బ్రద్దలు కొట్టాను చేతులు పుళ్ళయ్యాయి కాని కడుపు నిండలేదు

"అందుకని ప్రజలను మభ్యపెట్టి, మోసం చేసి బ్రతకాలనుకొంటున్నావన్న మాట ఇలా ఆత్మవంచన చేసుకుంటూ ద్గా కొరుగా బ్రతికే కంటె

తొందర పడకు ఒకడు మరొకణ్ణి మోసం చేయకుండా, దోచుకోకుండా ఈ నవ్య సమాజంలో మనుగడ సాగించడమే దుర్లభం అలా అని నేను ఎవరి జేబూ కొట్టలేదు ఎవరింటికి కన్నం వెయలేదు. వాళ్ళ మనసు కరిగి ధర్మం చేస్తున్నారు దానధర్మాల మీద నమ్మకమున్నంత కాలం ఈ దేశంలో ఈ పాత్రకే మాంచి ప్యూచరుంది నా సంగతి చెప్పుకుంటూ నీ గురించే మరచిపోయాను ఏమిటి తీసుకుంటావ్? కాఫీయా? టీయా? '

'నాకేం వద్దు గాని, ఒక్క ముక్క చెప్పు నువ్వు చేస్తున్న ఈ పని నీకసహ్యమేయడం లేదూ? కృషి వుంటె మనిషి ఋషి అవుతాడంటారు. మన క్లాస్‌మేటు 'రాజు' నీకు జ్ఞాపకమున్నాడనే అనుకొంటాను వాడి రోజు ఒక పెద్ద చిట్‌ఫండ్ కంపెనీ డైరక్టరు వాడా స్థితికి ఎదుగుతాడని నువ్వుగానీ నేను గాని వూహించామా? ఇప్పుడు నేనీ వూరు వచ్చింది కూడా వాడి కోసమేరా '

"ఎవరి అదృష్టం వాళ్ళది' నిర్లిప్తంగా అని ఊరుకున్నాడు రఘు

సరే, మరి వస్తాను నాకక్కడ ఉద్యోగమైతే నీ గురించి కూడా చెబుతాన్లే "

అలాగేనంటూ రోడ్డు వరకు సాగనంపాడు రఘు.

జగదాంబ జంక్షన్ చేరే సరికి పదిన్నరైంది ఆ ఐదు రోడ్ల కూడలి జనప్రవాహంతో ఎంతో బిజీగా వుంది. రకరకాల వాహనాల శబ్దంతో వాతావరణమంతా గొలగా వుంది.

నలువైపులా జాగ్రత్తగా గమనిస్తూ నడవ సాగాను ఉన్నట్లుండి "విజయా చిట్‌ఫండ్ ప్రవేట్ లిమిటెడ్' అన్న బోర్డు నా కళ్ళకు సాక్షాత్కరించింది

నా ఆనందానికి అవధులు లేవు

లోపల కెళ్ళడానికి ఒక క్షణం తటపటాయించి ఆ కంపెనీ డైరెక్టరు నా మిత్రుడే కదానని అనుకుని ధైర్యంగా లోపల కడుగు బెట్టాను.

వరండాలో విజిటర్సు కూర్చునేందుకు కాబోలు కుర్చీలున్నాయి లోపల గది ముందు "డెరక్టర్ రాజు" అన్న నేమ్ బోర్డు కొట్బొచ్చినట్లు కనబడుతోంది

"ఎవరు కావాలి సార్?" అడిగాడు అక్కడున్న అటెండరు.

"రాజుగార్ని చూడాలి అన్నాను కాస్త హుందా గా కాలరు సర్దుకుంటూ

"ఇంటర్వ్యూ కొచ్చారా?"

'లేదు రాజు నా ఫ్రెండ్ అన్నాను

అంతే మారు మాట్లాడకుండా కర్టెను తొలగించి లోపల కెళ్ళమన్నాడు

అక్కడున్న రాజు నా మిత్రుడే కావడంతో ఆనందంతో విష్ చేసాను

ఫోనెత్తి, ఎవరికో డయల్ చేయబోయి నన్ను చూడగానే అప్రయత్నం విరమించాడు.

'వెరిగ్లాడ్ టు సియు కమాన్ రవీ ప్లీజ్ బి సిటెడ్" అన్నాడు సంతోషాన్ని వ్యక్తం చేస్తూ

'మీ ప్రకటన దిన పత్రికలో చూసాను నువ్వీ కంపెనీకి డైరెక్టరువని తెలిసి ఎంతగానో పొంగిపోయాను అందుకే నిన్ను చూడాలని పనిగట్టుకు బయలుదేరాను అన్నాను ఎదురుగా వున్న సీట్లో కూర్చుంటూ

"చాలా మంచిపని చేసావు ప్రస్తుతం ఏం చేస్తున్నట్లు? జాబా. బిజినెస్సా.'

"రెండూకావు ఖాళీగా వున్నాను మీ కంపెనీలో పోస్టు వుంటే చూడు" అన్నాను తాపీగా

"సెర్టన్లీ. బోయ్ రెండు లిమ్కా"

"నో ధాంక్స్"

నథింగ్ డూయింగ్ యు ఆర్ నాట్ ఓన్లీమై ఫ్రెండ్ బట్ ఆల్సో గెస్ట్"

ఇంటరు మూడుసార్లు తప్పిన రాజు ఈ రోజు అంత చక్కగా ఇంగిషు మాట్లాడుతూ వుంటే ఆశ్చర్యపోయాను

'అన్నట్లు నీకి సంగతి తెలుసా?"

ప్రశ్నార్థకంగా ముఖంపెట్టాడు రాజు

'మన రఘులేడూ?"

ఊ వాడు

"ఏం చెప్పమంటావ్ ఉద్యోగం దొరకలేదని ముష్టివాడిలా వేషం వేసుకుని జీవనం



# నీళ్ళు పుట్టని నిజాయితి

సాగిస్తున్నాడు

ఇంతలో కూల్‌డ్రింక్స్ రావడంతో మా సంభాషణలకు రవ్వంత అంతరాయం కలిగింది

తర్వాత మళ్ళీ రాజే అన్నాడు

"ఒరేయ్ ఈ రోజుల్లో ఎవడు మాత్రం నిజాయితీగా బ్రతుకుతున్నాడ్రా? బ్రతుకు తెరువు కోసం ఎవడికి నచ్చిన మార్గాన్ని వాడు ఎంచుకున్నాడు ఇందులో నువ్వు ఎంచగల తప్పేమి నాకు కనిపించడంలేదు

అంటే నువ్వు కూడా వాడు చేస్తున్న పనిని సమర్థిస్తున్నావా?"

లేదు యదార్థం మాట్లాడుతున్నాను అంత వరకు ఎందుకు మన జూనియర్ హరికృష్ణలేడూ!

ఊఁ"

'నీకు వాడి సంగతి తెలీదా? దొంగ సర్టిఫికెట్లిచ్చి హైదరాబాదులో శ్లాబ్ బిల్డింగ్ కట్టాడు

హైదరాబాదులో వాడెక్కడుంటున్నాడు?

"అబీడ్స్‌లో'

"అలానా? ఐతే వాడు చేస్తున్న పని కూడా ఎంతో మంచిదంటావ్ అంతేనా?

"అంతవరకెందుకు? నువ్వు స్నేహితుడవని చెబుతున్నాను మా కంపెనీ నిజం అని నమ్ముతున్నావా?"

'వాట్‌డుయూమిన్? అన్నాను ఆశ్చర్యంగా

'అంతా బోగస్‌రా మా ప్రకటన చూసి ఉద్యోగంకోసం ప్రతి, నిరుద్యోగి పదిరూపాయలు మనీయార్డరుచేసి ధరఖాస్తు పంపుకుంటాడు. మాకు రోజూ టపాలో వంద అప్లికేషన్లు పైగా వస్తున్నాయి అంటే ఆదాయం రోజుకు వెయ్యిరూపాయలు పై చిలుకన్నమాట మా గుట్టు చప్పుడు కాకముందే మకాం మరో స్టేషనుకు మారుస్తాం

"అంటే నిరుద్యోగులకు ఆశకల్పించి వాళ్లను మోసంచేసి దోపిడీ చేస్తున్నావన్నమాట '

దానిని మోసం అనరురా భాయ్"

'మరేమంటారు?'

'నీతో నాకు వాదమెందుకు? కావాలనుకుంటె నువ్వునాతో చేయి కలుపు'

"నో నెవ్వర్ ..నువ్వు చేస్తున్న పని నాకేం నచ్చలేదు శలవ్ గుడ్‌బై అంటూ బయటకొచ్చేసాను

నా కళ్ళు బైర్లు కమ్మినట్లయ్యాయి మెదడు మొద్దుబారిపోయింది గూండాలు, దోపిడీదారులు మాటటుంచి చదూకున్న వాళ్లే ఇలా ప్రజల్ని మోసగించడానికి పూనుకుంటె మనదేశం ఏమైపోతుంది? భగవాన్! ఇప్పుడు నా కర్తవ్యం ? రాజు, హరికృష్ణలు చేస్తున్న పనులు పోలీసులకు తెలియజేయాలా? వద్దా? వాళ్లను ప్రభుత్వానికి నా చేతులతో అప్పగిస్తే మిత్రద్రోహం అనిపించుకుంటుందేమో! ప్రతివాడు అవినీతిని రూపుమాపాలంటాడు కాని ఆచరణలో మాత్రం శూన్యమే విద్రోహక చర్యలు చేస్తున్నప్పుడు స్నేహితుడైనా అప్పుడైనా ప్రభుత్వాని కప్పజెప్పడం పౌరునిగా నా కనీస బాధ్యత ఇలా ద్వంద్వ సంఘర్షణలతో పోలీసు స్టేషను చేరుకున్నాను

వాళ్లకి ఇన్‌ఫర్‌మేషన్ ఇచ్చినందుకు అక్కడ నన్నందరూ అభినందించారు నాలాంటివాడు ఈ దేశానికి ఎంతో అవసరమన్నారు పైకి రాసి బహుమతి ఇప్పిస్తామన్నారు

'నాకు బహుమతివద్దు మీ డిపార్టుమెంటులో ఏదైనా ఉద్యోగమిప్పిస్తే నాచేతనంత సేవ చేస్తాను' అన్నాను

అలాగే అప్లికేషన్ రాసివ్వండి రికమండుచేసి పంపిస్తాను అన్నాడు యస్ ఐ

నేనేదో ఘనకార్యం చేసినట్లుగా గర్వపడ్డాను ఉద్యోగం దొరకబోతున్నందుకు సంబరపడిపోయాను

రోజులు గడుస్తున్నాయి కాని ఉద్యోగమూ దొరకలేదు బహుమతి లేదు.

నాలో ఇంకా ఆశ చావకపోవడంతో వైజాగ్ వెళ్ళి మళ్ళీ ఇన్స్‌పెక్టర్‌గార్ని కలుసుకున్నాను

సారీ రవీ! నీకు ఏజబారైపోయింది గవర్నమెంటు సర్వీసుకు నువ్వు పనికిరావు అన్నాడు పోలీసు ఇన్స్‌పెక్టరు తాపీగా 




# ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం

## హైదరాబాదు

# బి.ఎ., బి.కామ్. కోర్సులలో ప్రవేశానికి అర్హత పరీక్ష

**అర్హతలు** - అభ్యర్థులు ఎటువంటి విద్యార్హతలు లేకపోయినా బి.ఎ, బి.కామ్ కోర్సులలో (1987) ప్రవేశానికి అర్హులు. ఈ కోర్సులలో ప్రవేశం పొందగోరేవారి వయస్సు 1987, జూన్ 1వ తేదీనాటికి 20 ఏళ్ళు పూర్తి అయిఉండాలి. ఈ విశ్వవిద్యాలయం నిర్వహించే అర్హత పరీక్షలలో ఉత్తీర్ణత పొందాలి.

**అర్హత పరీక్ష జరిగేతేదీ, సమయం, స్థలం** - 1987 మార్చి 1వ తేదీన ఉదయం 10 గంటలనుంచి మధ్యాహ్నం 1 గంటవరకు ఇంగ్లీషు, తెలుగు మీడియంలలో అర్హత పరీక్ష నిర్వహింపబడుతుంది. ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని జిల్లాలలోను, జంటనగరాలలోనూ, అవసరం అయితే రాష్ట్రం వెలుపల కూడా ఈ పరీక్ష నిర్వహింపబడుతుంది.

**దరఖాస్తుఫారం పొందడం ఎలా?**:- రిజిస్ట్రార్, ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయంపేర 5 రూపాయల ఇండియన్ పోస్టల్ ఆర్డరునుగాని, డిమాండ్ డ్రాఫ్టునుగాని హైదరాబాదులో చెల్లుబాటు అగునట్లు తీసుకొని పరీక్షల కంట్రోలర్ కార్యాలయం, ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం, 8-3-952/10/2/1, శ్రీనగర్‌కాలనీరోడ్, పంజగుట్ట, హైదరాబాద్ -500 016 చిరునామాకు స్వయంగావెళ్ళి దరఖాస్తుఫారం, ప్రాస్పెక్టస్ పొందవచ్చు లేదా అయిదురూపాయల ఇండియన్ పోస్టల్ ఆర్డర్‌నుగానీ, డిమాండ్ డ్రాఫ్టునుగానీ తీసుకొని అన్ని జిల్లాలలోను, జంటనగరాలలోను ఉన్న అధ్యయనకేంద్రాల కోఆర్డినేటర్స్ కార్యాలయాలలో ఏ ఒక్కదానికైనా వెళ్ళి స్వయంగా పొందవచ్చు. దరఖాస్తుఫారాలు, ప్రాస్పెక్టస్‌లు విక్రయించే అధ్యయన కేంద్రాలు ఇవి - (1) ఆదిలాబాద్‌జిల్లా - ప్రభుత్వ డిగ్రీ కళాశాల, ఆదిలాబాద్ - ప్రభుత్వ జూనియర్ కళాశాల, సిరిపూర్ కాగజ్‌నగర్, (2) అనంతపురంజిల్లా - ప్రభుత్వ డిగ్రీకళాశాల, అనంతపురం - ఎస్.డి.జి.యస్ కళాశాల, హిందుపూర్, (3) కడపజిల్లా - ప్రభుత్వ డిగ్రీకళాశాల, కడప, (4) పశ్చిమగోదావరి జిల్లా - సి.ఆర్.రెడ్డి కళాశాల, ఏలూరు - ప్రభుత్వజూనియర్ కళాశాల, పోలవరం, (5) గుంటూరుజిల్లా - జె.కె.సి కళాశాల, గుంటూరు, (6) కరీంనగర్‌జిల్లా - ఎస్.ఆర్.ఆర్ కళాశాల, కరీంనగర్ - ప్రభుత్వజూనియర్ కళాశాల పెద్దపల్లి - ప్రభుత్వజూనియర్ కళాశాల, గోదావరిఖని, (7) ఖమ్మంజిల్లా - ఎస్.ఆర్ అండ్ బి.జి.ఎన్.ఆర్ కళాశాల, ఖమ్మం - ప్రభుత్వమహిళా కళాశాల, ఖమ్మం - కె.వి.కె.ఆర్ వై అండ్ బి.యన్ గౌడ్స్‌కళాశాల, కొత్తగూడెం, (8) కర్నూలుజిల్లా - సిల్వర్‌జూబ్లీ కళాశాల, కర్నూలు, (9) మహబూబ్‌నగర్‌జిల్లా - యం.వి.యస్ ఆర్ట్సు అండ్ సైన్స్ కళాశాల, మహబూబ్‌నగర్ - ప్రభుత్వజూనియర్ కళాశాల, షాద్‌నగర్, (10) నల్గొండజిల్లా - నాగార్జునప్రభుత్వ కళాశాల, నల్గొండ ప్రభుత్వ జూనియర్ కళాశాల, ఆలేరు, (11) నెల్లూరుజిల్లా - శ్రీసర్వోదయ కళాశాల, నెల్లూరు - జవహర్‌భారతి కళాశాల, కావలి, (12) నిజామాబాద్‌జిల్లా - గిరిరాజ్ ప్రభుత్వ కళాశాల, నిజామాబాద్ - ప్రభుత్వజూనియర్ కళాశాల, బాన్స్‌వాడ, (13) ప్రకాశంజిల్లా - సి.ఎస్.ఆర్ శర్మ కళాశాల, ఒంగోలు, (14) తూర్పుగోదావరిజిల్లా - ప్రభుత్వ డిగ్రీకళాశాల, రాజమండ్రి, - ఆర్.ఆర్.బి.హెచ్.ఆర్ ప్రభుత్వ జూనియర్ కళాశాల, పిఠాపురం - పి.ఆర్ ప్రభుత్వ కళాశాల, కాకినాడ, (15) మెదక్‌జిల్లా - ప్రభుత్వ డిగ్రీకళాశాల, సిద్ధిపేట - తారాప్రభుత్వ డిగ్రీకళాశాల, సంగారెడ్డి, (16) శ్రీకాకుళంజిల్లా - ప్రభుత్వ డిగ్రీకళాశాల, శ్రీకాకుళం, (17) చిత్తూరుజిల్లా - ఎస్.వి.ఆర్ట్సు కళాశాల, తిరుపతి - వి.వి.కె.ఎస్ ప్రభుత్వ కళాశాల, చిత్తూరు - యం.ఎఫ్.సి. ప్రభుత్వ జూనియర్ కళాశాల, కుప్పం - ప్రభుత్వజూనియర్ కళాశాల, సత్యవీడు, (18) కృష్ణాజిల్లా - పి.బి. సిద్ధార్థ కళాశాల, విజయవాడ, - ఆంధ్రజాతీయ కళాశాల, మచిలీపట్నం, (19) విశాఖపట్నంజిల్లా - డాక్టర్ వి.యస్ కృష్ణా కళాశాల, విశాఖపట్నం - ప్రభుత్వ జూనియర్ కళాశాల, యలమంచిలి, (20) విజయనగరంజిల్లా - మహారాజ కళాశాల, విజయనగరం, (21) వరంగల్‌జిల్లా - ఆర్ట్సు అండ్ సైన్స్ కళాశాల, వరంగల్ - ప్రభుత్వ జూనియర్ కళాశాల, ములుగు, (22) రంగారెడ్డిజిల్లా - ఎస్.ఎ.పి.ఆర్ట్సు అండ్ సైన్స్ కళాశాల, వికారాబాద్, (23) జంటనగరాలు - హైదరాబాద్ - ప్రభుత్వ సిటీకళాశాల - ప్రగతిమహా విద్యాలయ - ఎ.వి. కళాశాల, దోమల్‌గూడా - ప్రభుత్వడిగ్రీ మహిళా కళాశాల, బేగంపేట - న్యూప్రభుత్వ డిగ్రీకళాశాల, ఖైరతాబాద్ - ప్రభుత్వ జూనియర్ కళాశాల, కాచిగూడా - ప్రభుత్వ జూనియర్ కళాశాల, నాంపల్లి - ప్రభుత్వ జూనియర్ కళాశాల, ఆలియా - ప్రభుత్వ జూనియర్ కళాశాల, మలక్‌పేట, (24) సికింద్రాబాద్ సర్దార్‌పటేల్ కళాశాల - రైల్వేడిగ్రీ కళాశాల - దివాన్ బహదూర్ పద్మారావు మొదిలియార్ డిగ్రీ కళాశాల - ప్రభుత్వ జూనియర్ కళాశాల, యస్.పి.రోడ్

**లేదా**

కావాలనుకుంటే అభ్యర్థులు పోస్ట్‌ద్వారాకూడా దరఖాస్తుఫారం, ప్రాస్పెక్టస్ పొందవచ్చును. రిజిస్ట్రార్, ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం పేర-పదిరూపాయల ఇండియన్ పోస్టల్ ఆర్డర్‌గాని, డిమాండ్ డ్రాఫ్టునుగాని హైదరాబాదులో చెల్లుబాటు అగునట్లు తీసుకొని పైనపేర్కొన్న పరీక్షల కంట్రోలర్ కార్యాలయం చిరునామాకు పోస్ట్‌ద్వారా పంపి తెప్పించుకోవచ్చు.

| | |
|---|---|
| దరఖాస్తుఫారాల విక్రయం ప్రారంభంతేదీ | : 01-11-1986 |
| దరఖాస్తుఫారాల విక్రయం చివరితేదీ | : 13-12-1986 |
| పూర్తిచేసిన దరఖాస్తుఫారాలు స్వీకరించే చివరితేదీ | : 20-12-1986 |

పూర్తిచేసిన దరఖాస్తుఫారాలు పరీక్షల కంట్రోలర్ కార్యాలయం, 8-3-952/10/2/1, శ్రీనగర్ కాలనీరోడ్, పంజగుట్ట, హైదరాబాద్ -500 016 చిరునామాకు స్వయంగాగాని, పోస్ట్‌ద్వారాగాని 1986 డిసెంబర్ 20 వతేదీనగాని, ఆలోగాగాని అందేటట్లు పంపాలి.

**బి.ఎ., బి.కామ్., బి.యస్‌సి కోర్సులలో నేరుగా ప్రవేశం**:- ఇంటర్‌మీడియట్‌లేదా దానికి సమానమైన విద్యార్హతలు కలిగిన అభ్యర్థులను డిగ్రీకోర్సులలో నేరుగా చేర్చుకునేందుకు ప్రకటన ప్రత్యేకంగా జారీ అవుతుంది. వారు అర్హత పరీక్షకు హాజరుకావల్సిన అవసరంలేదు.

**బోధనావిధానం**:- బి.ఎ., బి.కామ్., బి.యస్‌సి., కోర్సులలో చేరే విద్యార్థులు బోధనాభాష తెలుగు, ఇంగ్లీషులలో ఏదోఒకటి ఎన్నుకోవాల్సి ఉంటుంది. పోస్టల్ కరస్పాండెన్స్, కాంటాక్ట్ ట్యుటోరియల్ ప్రోగ్రాములు, ఆడియో, విజువల్ ప్రోగ్రాములు (రేడియో, ఆడియో కేసెట్లు, వీడియో టేపులు) వేసవి పాఠశాలలద్వారా విద్యాబోధన నిర్వహింపబడుతుంది. ఈబోధన ఆంధ్రప్రదేశ్‌లోని ప్రతి జిల్లాలోను, హైదరాబాద్, సికింద్రాబాద్‌లలోను ఏర్పాటైన విశ్వవిద్యాలయం అధ్యయన కేంద్రాలలో నిర్వహింపబడతాయి.

సం॥ రిజిస్ట్రార్

సీరియల్:

# నిశ్శబ్ద సంగీతం

బెహరా వెంకట సుబ్బారావు

(గత సంచిక తరువాయి)

రాత్రి ఎనిమిది గంటలు దాటింది. భర్త రాకకోసం నిరీక్షిస్తూ, రేణుని దగ్గర కూర్చోబెట్టుకొని తన పుట్టింటి సంగతులు చెప్పనారంభించింది రాజేశ్వరి కాలక్షేపం కోసం. సరోజిని మేడమీదికి వెళ్ళింది. ఆమె ఎంతకీ తిరిగి రాకపోవడంతో అడిగింది రేణు-

"ఎన్నిగారూ! సరోజిని మేడమీద ఏం చేస్తోంది?"

"మొగుడికి ఉత్తరం రాస్తానంది! రాసుకొంటోంది కాబోలు!" చెప్పింది రాజేశ్వరి.

రేణు సరోజిని దగ్గరికి మేడమీదికి వెళ్ళాలనుకొంది. క్రింద రాజేశ్వరిని ఒకర్తినీ వదిలి వెళ్ళడం యిష్టంలేక మానుకొంది మరో అయిదు నిమిషాలు గడిచాక మేడదిగి వచ్చింది సరోజిని.

'ఏవిటి సరోజా యింతాలస్యం? ఇంతసేపూ ఉత్తరం రాయడమే" ఎన్నితావులు రాసావ్?' అడిగింది వేళాకోళంగా

"చాలా రాసాను!" జవాబిచ్చింది సరోజిని.

"ఆయన వెళ్ళి మూడు రోజులు కాలేదు! అప్పుడే అన్ని సంగతులున్నాయా? మేం చూస్తామనా అలా ఏకాంతంలో రాసుకొన్నావ్?"

"ఏ కాంతైనా భర్తతో మాట్లాడ్డానికి ఏకాంతం కోరుకొంటుంది రేణూ! అలాగే ఉత్తరం రాయడానిక్కూడా ఏకాంతం అవసరం! ఏమంటావ్? అంది నవ్వుతూ.

"అవును సరోజా! నీవన్నది అక్షరాలా నిజం! కానీ ఆ అదృష్టం అందరికీ వుండదుగా!"

అంది నిరాశగా, విరక్తిగా.

'తప్పకుండా వుంటుంది రేణూ! చీకటిలో జీవించే అభాగ్యులు ఎప్పుడూ చీకటినే కోరుకొంటారు! వెలుగు అవసరం లేదంటారు! అయినా వెలుగు రాక మానుతుందా! చీకటి వెలుగు లేకపోతే కాలానికి గమనమే వుండదు! స్తంభించిపోతుంది అది ప్రకృతి నైజం!"

ధైర్యం చెప్పింది సరోజిని

అంతలో వీధిలో కారు హారన్ మోగడంతో లేచి వీధి గుమ్మంలోకి వెళ్ళింది రాజేశ్వరి. వెనువెంటనే తిరిగి వచ్చి-

"మీ నాన్నగారితో ఎవరో వస్తున్నారు! పదండి లోపలకి పోదాం!" తొందర చేసింది ముగ్గురూ లోపలకి వెళ్ళారు

"మీనాన్నగారి స్నేహితునిలా వున్నారు కాఫీ అడుగుతారేమో!" అంది రాజేశ్వరి రేణూ, సరోజినిల వైపు చూస్తూ ఆమెను లోపలికి తీసుకొని వెళ్ళమన్నట్లు కూతురికి సైగచేసింది రాజేశ్వరి

రా రేణూ! కాఫీ తయారు చేద్దాం! అంటూ రేణుని తనతో వంటగదిలోకి తీసుకెళ్ళింది సరోజిని

భర్తతో బాటు రఘునాథ్ అబ్బాయిని తీసుకొని రావడం గమనించింది రాజేశ్వరి మొదట తలుపుచాటునుంచి చూసినా ఎదుట పడకుండా ఉండలేకపోయింది

"మా ఆవిడ రాజేశ్వరి!" పరిచయం చేసారు శ్రీపతిగారు

చేతులు జోడించి నమస్కరించాడు రఘు చూపుల్లోనే కృతజ్ఞతను వ్యక్తం చేసాడు ఇద్దరూ సోఫాలో ఆశీనులయ్యారు. కొడుకుని వడిలో కూర్చోబెట్టుకొన్నాడు రఘు

'అమ్మాయ్! రేణూ! డ్రింక్సు తీసుకురావూ!' కేకేసారు శ్రీపతిగారు

ఫ్రిజ్‌నుండి రెండు డ్రింక్ బాటిల్స్ తీసి అందించింది సరోజిని

డ్రింక్స్ తీసుకొని హాల్లోకి ప్రవేశించింది రేణు ఎదురుగా వున్న భర్తను చూసి తన కళ్ళను తానే నమ్మలేక పోయింది మరుక్షణంలో విపశురాలైంది అంతా ఆమె వైపు చూసారు. ఆమె చేతులు వణకసాగాయి సంతోషం! సంభ్రమం! ఆశ్చర్యం! భయం! ఆమె పరిస్థితిని గమనించిన సరోజిని చేతుల్లోంచి డ్రింక్స్‌ని అందుకొంది

ముందుకు పరిగెత్తి భర్త పాదాలమీద వ్రాలాలనుకొంది నయనాలు అశ్రుపూరితాలు కావడంతో ఏవీ కన్పించకుండా పోయింది అంధురాలిలా తడుముకొంటూ అడుగులో అడుగువేయసాగింది.

భార్యను చూసి ఆనందంతో తబ్బిబ్బవుతూ లేచి నిలబడ్డాడు రఘు భార్యను చేరి కౌగలించుకోవాలనుకొన్నాడు కానీ అతను కూడా అదే స్థితిలో పడ్డాడు నెమ్మదిగా అడుగులువేస్తూ భార్యను సమీపించాడు గాఢంగా హృదయానికి హత్తుకొన్నాడు బాహ్య ప్రపంచంతో తమకేమీ సంబంధంలేనట్లు కొన్ని క్షణాలు పరిష్వంగ సుఖాన్ని తనివితీరా అనుభవించారా దంపతులు

రాజేశ్వరి, సరోజిని, శ్రీపతిగారలు కూడా ఆనందబాష్పాలు రాల్చారు కొంతసేపటికా దంపతులు ఈ లోకంలోకి వచ్చారు ఇతరుల వునికిని గమనించి బిడియపడ్డారు. సిగ్గు ముంచుకురాగా లేడిలా అక్కడనుంచి పరుగుతీసింది రేణు సోఫాలో ఆడుకొంటున్న బాబుని తీసుకొని రేణు దగ్గరికి వెళ్ళింది సరోజిని

* * * *

శ్రీపతిగారూ, రఘు డైనింగ్ రూంలో భోజనం చేస్తున్నారు తలుపుచాటుగా నిలబడి చూస్తోంది రేణు రాజేశ్వరి భోజనం వడ్డిస్తోంది వెనుకనే వెన్నుతట్టింది సరోజిని రేణు త్రుళ్ళిపడింది.

'ఓసారి మేడమీదికిరా! పనుంది!" చేయిపట్టుకొని తీసుకెళ్ళింది సరోజిని

మేడమీద ఆ గదిని అలంకరణని చూసి నిర్ఘాంతపోయింది రేణు నవవధూవరులకోసం అలంకరింపబడినట్లుగా వుంది. భర్తకు లెటరు రాసేనెపంతో సరోజిని చేసిన పని ఏవిటో రేణుకి అర్థమైంది

"ఏవిటి సరోజినీ యిదంతా?"

**జరిగిన కథ –14:** కలకత్తా డైమండ్ హౌస్ నుండి సుజాత సహాయంతో బయటపడి ఇంచుమించు మతిస్థిమితం లేని స్థితిలో వున్న రేణుకి శ్రీపతి, రాజేశ్వరి దంపతులు ఆశ్రయం ఇచ్చారు ఆమెకు ఒక సైకియాట్రిస్టు దగ్గర ట్రీట్‌మెంటు ఇప్పించ సాగారు శ్రీపతిగారి ఉత్తరం చూచుకొని కొడుకుతో ఖర్గపూర్‌కి ప్రయాణమయ్యాడు రఘు రఘు స్నేహితుడు జానకిరాం ఇంటికి వెళ్ళింది రమ జానకి, జానకిరాంల అన్యోన్య దాంపత్యం చూసి ముచ్చట పడ్డారు అనసూయమ్మ. రాజేశ్వరి తన కూతురు సరోజినిని, రేణూని గులాబిలు జడకు కుట్టుకోమని చెప్పింది

'ఏమో! అమ్మ చెప్పింది చేసా!" అని తప్పించుకొంది సరోజిని

'అయితే ఈ గదిని చూపడానికేనా నన్ను తీసుకొచ్చావ్!" అడిగింది.

"అహ! అంతేకాదు! ఇవిగో స్వీట్సు, హాట్సు! వీటిలో మీ పతిదేవునికి ఏది యిష్టమో ఎంచుకొంటావని తీసుకొచ్చా!" అంటూ టేబిలుమీదనున్న అనేక తినుబండారాలను చూపింది

'ఏమో! జ్ఞాపకం లేదు!" అంది సిగ్గుపడుతూ

"అందుకేఅన్నీ యిక్కడనే వుంచమంది అమ్మ!" అంది సరోజిని

అంతలో రాజేశ్వరి పిలవడంతో యిద్దరూ గబగబా కిందకి వెళ్లారు

* * * *

ఆ రాత్రి భర్త గదిలో ప్రవేశించగానే అతని పాదాలమీద కుప్పలా కూలింది రేణు భోరున ఏడ్వసాగింది. ఆనందకెరటాల్లో పడి కొట్టు మిట్టాడుతున్న రఘుకి ఊపిరి సలుపలేదు. శిలా ప్రతిమలా నిలబడ్డాడు. అతని కంటనుండి ఆనందాశ్రువులు జలజలా రాలాయి కొన్ని నిమిషాలు మౌనంగా గడిచాయి

"లేరేణూ! నేవచ్చాగా! నీకేభయమూ లేదు! మనలో ఒకరు కిందటి జన్మలో దంపతుల్ని విడదీసాం! అందుకే భగవంతుడు ఈ జన్మలో మనకి శిక్ష విధించాడు లే! గత జీవితాన్ని మరిచిపో!"

అతకష్టంమీద భార్యను లేవనెత్తి హృదయానికత్తుకొన్నాడు

భర్తనుండి ఎడంగా జరిగింది రేణు.

"నే నపవిత్రురాలనండి! మీ ప్రేమానురాగాలకి అర్హత కోల్పోయాను మీ పాద సన్నిధిలో నా శేష జీవితాన్ని గడపాలనే ఆశతో యింతకాలమూ జీవించి వున్నా! మన అబ్బాయి ఆటా పాటా చూడాలన్న ఆకాంక్షా, మీపాదాలను నా కన్నీటితో కడగాలన్న కోరికా నా ఆత్మ హత్యా ప్రయత్నాల్ని విరమింపజేసాయి అవి యిప్పుడు తీరాయి

వలవలా యేడ్చింది రేణు

'లేదు రేణూ! అలా ఎన్నటికీ కాకూడదు! ఆ పరిస్థితిలో ఏ అబలా ఏమీ చేయలేదు లాలిస్తూ భార్యను సమీపించాడు •

'నన్ను తాకకండి! ప్లీజ్!" కాస్త ఎడంగా జరిగింది

"అతి పవిత్రంగా భావించి దేవుని మందిరంలో పదిలపరచి పూజిస్తాం గంగా జలాన్ని! ఆ గంగ ఎన్నో అపరిశుభ్ర ప్రదేశాల్లోనూ, దుర్గంధ భూయిష్టమైన పాప పంకిలమైన ప్రదేశాల్లోనూ ప్రవహిస్తుంది ఆ విషయం తెల్సికూడా గంగా జలాన్ని పవిత్రంగానే భావిస్తాం శుద్ధికోసం వాడ్తాం! రోగ నివారణకోసం మందుగా సేవిస్తాం! నీ వెన్నటికీ అపవిత్రురాలవుకాదు రేణూ! నా హృదయ రాణివి!"

అమాంతంగా గాఢాలింగనం చేసుకొన్నాడు ఆ అనురాగార్ణవంలో మునిగిపోయిన రేణు చాలాసేపటి వరకు తేలలేదు

* * * *

"వదిన్ని చూసిన వెంటనే ఒక టెలిగ్రామూ, బయలుదేరే ముందు మరొకటి యివ్వమని మరీ మరీ అన్నయ్యకు చెప్పాను అన్నయ్య వెళ్లి మూడురోజులైనా ఒక టెలిగ్రామూ రాలేదు " – ఆందోళన పడింది రమ. శ్రీపతిగారి ఫోన్ నెంబరు తెలీదు అడిగి తెల్సుకొని వుండాల్సింది! ఎంత పొరపాటైంది! అక్కడ అన్నయ్య యిదివరకులా అవస్థలు పడటంలేదు కదా!"

మనసు కుదురులేక యింట్లోకి వీధిగుమ్మంలోకి కాలుకాలిన పిల్లిలా తిరగ సాగింది రమ.

"ఏవిటి రమా అలా తిరుగుతున్నావ్! నిన్ననే కదా మీ ఆయన దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది!"

కూతుర్ని గమనించి అడిగింది తల్లి తల్లికి సరైన సమాధానం చెప్పలేదు.

"డాక్టరు గారమ్మాయి వస్తానంది! చూస్తున్నా" అంది – ఆమె ఆలోచనలు వేరు. పరధ్యాన్నంలో వున్న రమ టెలిగ్రాఫ్ మెసంజర్ కేకతో ఈ లోకంలోకి వచ్చింది.

"టెలిగ్రాం!"

లేడిపిల్లలా రెండు గంతులువేసి టెలిగ్రాం అందుకొంది ఆతృతగా చదివింది ఆనందంతో తబ్బిబ్బయింది

'అమ్మా!" కేకవేస్తూ లోనికి పరుగెత్తింది. తల్లిని కౌగలించుకొని గిరగిరా తిప్పింది

"ఏమిటమ్మా ఏమైంది? ఏవిటి హడావిడి?' విడిపించుకొని ఆశ్చర్యంగా అడిగింది తల్లి.

"సాయంత్రం ఎక్స్‌ప్రెస్‌లో అన్నయ్యా, వదినా వస్తున్నారమ్మా!"

కూతురు మాటలు నమ్మ లేదు అనసూయమ్మ.

"ఏవిటి నీవనేది?" అడిగింది అపనమ్మకంగా

'అవునమ్మా! అన్నయ్య రేణుని తీసుకొని సాయంత్రం వస్తున్నాడు! ఇదిగో టెలిగ్రాం! చూడు!"

ఎదురుగావున్న వెంకటేశ్వరుని పటానికి భక్తితో నమస్కరించిందామె.

"రేణు రాజమండ్రిలో తల్లి దగ్గరుందా?" అమాయకంగా అడిగింది.



## నిశ్శబ్ద సంగీతం

తల్లి పక్కనే కూర్చుంది రమ వివరంగా చెప్పాలని-

"ఆనాడు చెప్పాను కదమ్మా! మన రేణు ఒక సుడిగుండంలో చిక్కుకుందని! శ్రీపతిగారని ఒక పుణ్యపురుషుడామెను రక్షించి ఆశ్రయం యిచ్చాడు వారు ఖరగ్‌పూర్‌లో వుంటున్నారు

అన్నయ్యను వెంటనే రమ్మని, వచ్చి తన భార్యను తీసుకొని వెళ్ళమని లెటర్ రాసారు. అందుకే అన్నయ్య కొడుకుని తీసుకొని అర్జంటుగా వెళ్లాడు రేణూని తీసుకొని వస్తున్నట్లు టెలిగ్రాం యిచ్చాడు."

"ఎంతతీయటి కబురు చెప్పావమ్మా!"

అనసూయమ్మలో నూతనోత్సాహం పుంజుకొంది. అనారోగ్యం ఆమెనుండి పారిపోయింది. తల్లిలో హఠాత్తుగా వచ్చిన మార్పుని చూసి ఆశ్చర్యపోయింది రమ.

"రమా!" కూతుర్ని పిలిచిందామె ఏదో చెప్పాలని.

"చెప్పమ్మా!" అంది రమ కుతూహలంగా.

"రేణు వచ్చాక పాత విషయాలు యేమి అడక్కు! చిన్నబుచ్చుకొంటుంది. అప్పుడు దాని మొహం చూస్తే నా కడుపు చెరువైపోతుంది! ఏం తల్లీ!" దీనంగా కూతుర్ని అర్థించింది.

"నేనంతటి సంస్కారహీనురాలను కాదమ్మా! నేనూ, మీ అల్లుడు కూడా ఆమెకోసం ఎంత పరితపిస్తున్నామో ఆ భగవంతునికే తెల్సు! రేణు తిరిగి రావాలి! ఈ యింట్లో తిరిగి ఆనంద వాయిద్యాలు మ్రోగాలి! నిశ్శబ్దం పటాపంచలవాలి! అదేనమ్మా మేము కోరుకొనేది!"

ఆ తల్లీ కూతుళ్ల మాటల్లో రేణు పేరు వినబడ్డంతో ఆతృతగా వారిని సమీపించింది వెంకాయమ్మ.

"అమ్మగారూ రేణూ తల్లి కబురేమైనా తెల్సిందా?" అడిగింది

"అవునండి! రేణూ రఘూ ఈ సాయంత్రం వస్తున్నారు!" చెప్పింది అనసూయమ్మ ఆనందంతో తబ్బిబ్బవుతూ వారి ఆనందంలో పాలుపంచుకొంది వెంకాయమ్మ.

* * * *

సాయంత్రం ఆరుగంటలకి ట్రైన్ వస్తుంది. మధ్యాహ్నం మూడున్నరకే టాయిలెట్ అయి రెడి అయింది రమ. కాలం చాలా నెమ్మదిగా నడుస్తున్నట్లు తోచింది. ఏదో వారపత్రిక తీసి పేజీలు తిరిగేస్తోంది కాలక్షేపంకోసం. ఎవరో వెనుకనుంచి వచ్చి కళ్ళు మూశారు చేతులు తడిమింది. పురుషుని చేతులు. కంగారూ భయమూ పుట్టుకొచ్చాయి. ఆ చేతుల్ని బలంగా లాగి వెనక్కి చూసింది. అతణ్ని చూసి నిర్ఘాంతపోయింది. ఆ తర్వాత సంభ్రమాశ్చర్యాల్లో మునిగింది. ఎదురుగా భర్త! చివాల్న లేచి నిలబడింది. తన్ను కౌగలించుకొంటూంటే వారించలేకపోయింది

"ఏమిటిలా చడిచప్పుడూ లేకుండా వచ్చారు!" అడిగింది కౌగిలిలో బందీగా వుంటూ.

"నేనెక్కిన రైలు దారిపొడవునా విజిల్సు వేసుకొంటూనే వచ్చింది నేను వచ్చిన టాక్సీ మీ యింటి గేటు ముందు కనీసం అయిదు నిమషాలపాటు బావురుమని ఏడ్చివుంటుంది. ఎవరైనా వచ్చి గేటు తాళాలు తీస్తేనా? అందరికీ పరధ్యాన్నమేనా? వెంకాయమ్మగారుండబట్టి వచ్చి తాళాలు తీసారు లేకపోతే వచ్చిన దారినే వెళ్ళిపోవాల్సి వచ్చేది! అవునూ! ఏమిటి! అంతఃపుర సౌధంలో యువరాణిలా ఈ మేడమీద టాయిలెటయి రాకుమారిలా తయారయావ్ ఎక్కడికైనా ప్రయాణమా?"

'ఇలా యిప్పుడు మీరొస్తారని మాకేంతెల్సు? గుమ్మంలో నిలబడి నిరీక్షించడానికి! టెలిగ్రాంయివ్వలేకపోయారా? స్టేషన్కే వచ్చే వుండేదాన్ని!"

అలక నటించబోయింది

"నిజమే రమా! నిన్ను చూడాలనిపించింది! అకస్మాత్తుగా బయలుదేరా!" అన్నాడు గోముగా చూస్తూ.








నిన్ననే మీ ఉత్తరం అందింది! వచ్చేనెల్లోగాని రావటం కుదరదని రాసారు!

అక్కడ బెంగాలలంతా దసరా ఉత్సవాలు చాలా వేడుగ్గా చేసుకొంటారు దేవిపూజలు భక్తిశ్రద్ధల్తో చేస్తారు అందరికి నాలుగురోజులు శలవు లిచ్చారు!

'అలాగా!" అంది క్రీగంట చూస్తూ, నవ్వుతూ

మరి నేను కూడా దేవీభక్తుణ్నే కదా! పూజ చేయాలి కదా!

"చేసుకోండి! అంది క్రింది పెదవిని పంట నొక్కుతూ.

దేవి దర్శనం లేందే పూజ చేసుకోడం సాధ్యం కాదే! అందుకే మా ఆఫీసరు దగ్గరి కెళ్ళా! !

వెళ్ళి?" రెచ్చగొట్టింది రమ భర్తని

'నా దేవి ఈ దరిదాపుల్లో లేదాసార్! హైదరాబాద్‌లో వుంది! నేను కూడా దేవి పూజలు చేసుకోవాలి కదా! తన యిష్ట దైవాన్నో, దేవతనో దర్శించి పూజలు చేసుకొనే హక్కు ప్రతి పౌరునికీ మన రాజ్యాంగం ప్రసాదించింది కదా! అన్నాను!'

"ఈ హక్కు కూడా ప్రాథమిక హక్కుల్లో వుందా?" ఉస గొల్పింది భర్తని నవ్వుతూ

'ఏదో గేస్ కొట్టాను! పాపం జాలి పడ్డాడు! మరో మూడు రోజులు శలవు గ్రాంటు చేసాడు!'

'అయితే మొత్తం ఏడు రోజులన్న మాట!" అంది

"చెప్పేది వినకుండా మధ్యలో అడ్డకు! అలా కుదరదు సార్! దేవీ నవరాత్రులు జరుపుకోడం మన ఆచారం కదా! అలా చేయక పోవడం అపచారం అవుతుంది కదా! అప్పుడు దేవి ఆగ్రహానికి గురి కావల్సి వస్తుంది కదా! అన్నా "

అలాగా?" అంది ఓరగా చూస్తూ

"దేవికి అపచారం అనగానే ఆ భక్తుడు కూడా భయపడ్డాడు తొమ్మిది రోజులూ ప్లస్ రావడానికీ పోడానికీ రెండు రోజులూ మొత్తం పదకొండు రోజులు సాంక్షన్ చేసాడు! తక్షణం పో! అని కసిరాడు!"

కిలకిలా నవ్వింది రమ

"పాపం! కసుర్లు కూడా తిన్నారన్న మాట!" అంది.

కసురుకోనీ, తిట్టుకోనీ! అది నా కనవసరం! నా క్కావల్సింది దేవీ దర్శనం! ఈ రమాదేవి దర్శనం! ప్రయాణానికి రిజర్వేషన్ దొరక్క నరకయాతన అనుభవించివచ్చా యింతదూరం! కానీ ఏం లాభం! మంచి నీళ్ళు కావాలా అని అడిగేనాథుడే లేకపోయె!" అంటూ మొహమ్మీద మొహం పెట్ట బోతూంటే వారించింది రమ కూల్‌డ్రింక్స్‌తో వచ్చి గుమ్మంలో ఆగిపోయిన వెంకాయమ్మగార్ని గమనించక పోలేదు

"రండి వెంకాయమ్మగారూ!' అంది పక్కకు తిరక్కుండానే ఆమె డ్రింక్స్ యిద్దరికీ అందించి వెళ్ళింది డ్రింక్ గటగటా తాగేసాడు.

"పాపం! అమితమైన దాహంతో వచ్చినట్టున్నారు! ఈ సీసా కూడా తీసుకోండి!" రెండో సీసా అందించింది

రెండో సీసా తాగి మిగిలింది భార్యకు అందించాడు

'ఈ భక్తుని నైవేద్యం స్వీకరించు దేవీ!"

"ఈ ఎంగిలి డ్రింకా దేవికి నైవేద్యం?"

"అసలైన సిసలైన భక్తులు నైవేద్యాన్ని రుచి చూసాకే దైవానికి సమర్పించు కొంటారు! శబరి కథ విన్నావుగా!

మారు మాటాడకుండా మిగిలిన ఆ డ్రింకుని తాగింది రమ.

ఏమిటి? మిలమిలా మెరిసి పోతున్నావ్? ఎక్కడికైనా ప్రయాణమా?" అడిగాడు

'అవునండి! సమయానికి వచ్చారు! మనం సికింద్రాబాద్ స్టేషన్‌కి వెళ్ళాలి! తొందరగా స్నానం చేసి టాయిలెట్ అవండి! ఎందుకో తర్వాత చెబుతా!" అంటూ బయటకు నడిచింది

కూతురూ, అల్లుడూ స్టేషన్‌కి బయలు దేరుతూంటే,

"నే చెప్పింది గుర్తుందా?' అంది అనసూయమ్మ కూతురుతో

"ఏమిటమ్మా?' అడిగింది రమ, గుమ్మం మెట్లు దిగుతూ వెనక్కి చూసి.

దగ్గరకు రమ్మని తల్లి సైగ చేయడంతో వెనక్కి వెళ్ళి తల్లిని సమీపించింది

"అదేనమ్మా! పాత విషయాలు రేణు దగ్గర ప్రస్తావనకు తేకండి! అల్లుడితో కూడా చెప్పు!" నెమ్మదిగా అల్లునికి విన్పించకుండా చెప్పింది హెచ్చరికగా

"అలాగేనమ్మా! ఎన్నిసార్లు చెబుతావ్?' విసుక్కొంది

* * * *

సాయంత్రం అయిదున్నర అయేసరికి వీధి వరండాలో కుర్చీ వేసుకొ కూర్చొంది అనసూయమ్మ, నిమిషాలు లెక్క పెడుతూ గడియారం ఏడు గంటలు కొట్టింది

'రైలు ఒక గంట లేటటమ్మా!" రిసీవర్ని ఫోన్‌పై పెడుతూ గదిలోంచి కేక వేసింది వెంకాయమ్మ కోడలు కోసం నెలలకి నెలలు నిరీక్షించిన ఆమె ఒక గంట ఆలస్యాన్ని భరించలేకుండా వుంది చీకాకెక్కువైంది సహనం సన్నగిల్లింది

"ఈ రైళ్ళు ఎప్పుడూ లేటే!" విసుక్కొంది

మరో గంట గడిచింది. గేటు ముందు టాక్సీ ఆగిన శబ్దం విని చివాల్న లేచింది.

కొడుకూ, బుజాన మనవడితో కోడలూ, వారి వెనక కూతురూ, అల్లుడూ వస్తూంటే చూసి ఆనందపరవశురాలైంది

"వెంకాయమ్మగారూ! వెళ్ళి వాళ్ళని లోనికి తీసుకురండి!" పురమాయించింది తాను హాలులోకి వెళ్ళింది

కోడలు తనను సమీపిస్తుంటే ఆమె చేతిలోంచి మనవణ్ని అందుకొంది.

తన పాదాలను తాకి నమస్కరించిన కోడల్ని మనసారా దీవించింది—

"లే తల్లీ! నీ రాకతో ఈ యిల్లు తిరిగి నందనవనంగా మారింది" అంటూ కోడల్ని లేవనెత్తింది

**(అయిపోయింది)**

ఆశుకవిత్వా చాతుర్య ప్రతిభ ముగ్గ
అవధాని గారు -

మూర్తీభవించిన సౌజన్యం, రూపుకొట్టిన బోధన చాతుర్యం, కరుడు గట్టిన విషయ ప్రామాణికత, సాకారమైన వక్తృత్వం, నిలువుగా నిలువరించిన ప్రయోగ వైశాల్య వైశారద్యం, అవతరించిన ధారణా శక్తి డాక్టర్ దివాకర్ల వెంకటావధానిగారు అయన సౌజన్యానికి, వక్తృత్వానికి, ధారణా శక్తికి వందలు వేలు ఉదాహరణలు ఇవ్వవచ్చు. మూడు దశాబ్దాల క్రింది సంగతి నేను పరిశోధన 'ఆంధ్ర నాటక పితామహ సంచిక'కొక వ్యాసం కోరాను. వారం కూడా గడువు లేదు కనుక తంతి ద్వారా కోరాను వ్యాసం. మూడో నాటికే వ్యాసం చేరింది. చిత్తూరు సంస్కృత ప్రచార సమితి వార్షికోత్సవంలో ఆయన శాకుంతలం గురించి ప్రసంగించారు. గురించి ప్రసంగించలేదు! యాసృష్టిః స్రష్టు రాద్యా అనే మంగళ శ్లోకం ప్రారంభించి, మమాపిచక్షపయతు నీలలో హితః అనే భరత వాక్యం వరకు అన్ని శ్లోకాలు - దాదాపు 400 పఠించి మూడు గంటల సేపు శాకుంతలం నాటకం యథాతథంగా, కదలీపాకంగా, సపోటా పాకంగా వినిపించారు. శ్రోతల ఆనందానికి మేరలేదు మిత్రులు శ్రీ ఇసుకపల్లి దక్షిణామూర్తి కథల సంపుటి ఆవిష్కరణ. ఆయన ప్రసంగించారు దాదాపు 400 పుటల సంపుటి. ముప్పై కథలుంటాయి వాటిలో కనీసం 300 పాత్ర లున్నాయి ఆయన ప్రతి కథా సంగ్రహంగా చెప్పి, ఆ పాత్ర లన్నిటి స్వభావ స్వరూపాలు వివరించారు. శ్రీ దక్షిణామూర్తికే ఆశ్చర్యమైంది. ఏ విషయం మాట్లాడదలచినా క్షుణ్ణంగా అధ్యయనం చేసి, మరొకరికి మిగులకుండా మాట్లాడడం, శ్రోతృరంజకంగా మాట్లాడడం ఆయన సొత్తు ఈ విధంగా వక్తృత్వాన్ని ఆరాధించి తెలుగు దేశమంతటా, ముఖ్యంగా తెలంగాణంలో ఆంధ్ర సంస్కృత సాహిత్యాలను ప్రజాసామాన్యానికి అందించిన డాక్టర్ దివాకర్ల వెంకటావధాని గారు పశ్చిమ గోదావరి జిల్లా ఎండగండి గ్రామంలో 1912 జూన్ 29 న ఆషాఢ పూర్ణిమ నాడు జన్మించారు వీరిది విఖ్యాతమైన విద్వాత్కుటుంబం దివాకర్ల తిరుపతి శాస్త్రిగారి సోదర పుత్రులు. తండ్రి గారు శ్రీ సుందరరామయ్య, తల్లిగారు శ్రీమతి వెంకటలక్ష్మి, 1934 లో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో బి ఏ ఆనర్సులో ప్రప్రథమములుగా ఉత్తీర్ణులయారు 1936 లో ఆంధ్ర నాటక పితామహుడు అనే విషయమై సిద్ధాంత వ్యాసం వ్రాసి ఎం. ఎ ఆనర్స్ పట్టం పొందారు. ప్రాఙ్నన్నయ యుగం - నన్నయ భారతం అనే విషయమై సిద్ధాంత వ్యాసం వ్రాసి ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి 1957 లో డాక్టరేట్ పొందారు. రాజా విక్రమదేవవర్మ అధ్యక్షతన వున్న ఆంధ్ర భారతీ తీర్థ అనే సంస్థ చేత కవి భూషణ బిరుదుతో సన్మానితులయారు 1938 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం 1977 లో కళాప్రపూర్ణ బిరుదంతో సన్మానించింది బి ఎ. ఆనర్స్ కాగానే 1934 లో విశాఖపట్నంలోని మెసర్స్ ఎ వి ఎన్ కాలేజీ తెలుగు శాఖలో లెక్చెరరుగా చేరి 1951 వరకు పని చేశారు 1951 నుంచి 1974 వరకు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో లెక్చెరరుగా, రీడరుగా,

# హైదరాబాద్ నోట్ బుక్

ప్రొఫెసరుగా పనిచేసి సహస్రాధిక సంఖ్యలో శిష్యులను తయారు చేశారు పిదప 1978 వరకు యు జి సి ప్రొఫెసరుగాను, అనంతపురంలో సత్యసాయి మహిళా కళాశాల విజిటింగ్ ప్రొఫెసర్గాను వున్నారు జ్ఞానపీఠ అవార్డు సలహా సంఘ సభ్యులుగాను, ఆరు సంవత్సరాల పాటు కేంద్ర సాహిత్య అకాడెమీ సభ్యులుగాను, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ స్థాపన మొదలు చివరి వరకు సభ్యులుగాను, 1979 వరకు రాష్ట్ర సాహిత్య అకాడెమీ వక్తగాను గద్య, పద్య, నాటక రచనలు చాల చేశారు కిరాతార్జునీయం, ప్రకృతి విజయం, కాదంబరి, మార్గదర్శకులు, వేమన, పోతన (ఆంధ్రాంగ్లాలలో), ముప్పై రోజులలో



తెలుగు- వంటి గద్య రచనలు చేశారు రాజ సందర్శనము, మధువనము, త్రింశతి, కవి పరాజయము, పరివర్తనము, సుందర సందేశము, దాసబోధ మున్నగునవి పద్య కావ్యాలు నాగానందం, కౌముది మహోత్సవమనే సంస్కృత నాటకాలను అనువదించారు బుద్ధ చరితమనే నాటకం రచించారు ప్రాఙ్నన్నయ యుగం, నన్నయ భారతం, ఆంధ్ర నాటక పితామహుడు, వ్యాసావళి, ఆంధ్ర వాఙ్మయ చరిత్ర, సాహిత్య సోపానాలు, ఆంధ్ర భారతము - కవిత్రయము, కావ్యలహరి, విశ్వనాథ కవి సమ్రాట్టు ఆయన విమర్శ గ్రంథాలు. సంస్కృత విద్యార్థుల కోసం సంస్కృత వ్యాకరణ సంగ్రహమనే వ్యాకరణం రచించారు ఆంగ్లాంధ్ర పత్రికలలో దాదాపు 200 వ్యాసాలు వ్రాశారు ఆకాశవాణిలో వందకు పైగా ప్రసంగాలు చేశారు ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం ప్రపంచ సాహిత్య సంపుటికి, ఆంధ్ర మహాభారత సంస్కరణ ప్రతులకు, నన్నె చోడ పదకోశానికి సంపాదకత్వం వహించారు అంతర్జాతీయ కృష్ణ చైతన్య సంఘం కోసం శ్రీ ప్రభుపాదుల భగవద్గీతను, శ్రీ ఈశోపనిషత్తును, ఉపదేశామృతం తెలిగించారు శ్రీ మద్భాగవతం, చైతన్య ప్రభూపదేశాలు కొంత అనువదించారు యజుర్వేదం ఒక సంపుటి తెనిగించారు బల్గేరియా చరిత్ర అబ్దుల్ కలాం ఆజాద్ స్మారక సంపుటి, మలయాళ సాహిత్య చరిత్ర, ఎడుకేషన్ ఇన్ ... తెనిగించారు పెక్కు విశ్వవిద్యాలయాలలో పరీక్షకులుగా వున్నారు రాష్ట్రంలోని వివిధ భాషా సాహిత్య సంస్థలతో సంబంధమున్న వారు, భువన విజయంలో పెద్దనగా, కనకాభిషేకంలో శ్రీనాథుడుగా, కవిబ్రహ్మ తిక్కనలో తిక్కనగా, రాజరాజనరేంద్ర పట్టాభిషేకంలో నన్నయగా, రఘునాథరాయల ఇందిరా మందిరంలో చేమకూర వేంకట కవిగా నటించి, ఆ పాత్రలకు వన్నె తెచ్చారు ఆంధ్ర వాఙ్మయ చరిత్ర పబ్లిక్ సర్వీసెస్ కమిషన్ పాఠ్య పుస్తకం కావడం వల్ల కన్నడ మహారాష్ట్ర భాషలలోకి అనువదింపబడడమే కాక పెక్కుసార్లు పునర్ముద్రితమైంది డాక్టర్ అవధాని గారు భర్తృహరి చెప్పినట్టు అనభిభావగంధాః పరకథాః వ్రతం వారు ప్రత్యక్షంగానో పరోక్షంగానో ఎవరినీ తూలనాడని సజ్జనులు, ఎవరైనా తూలనాడినా వినరు ఒక మారు నేను వారితో పాటు వనపర్తి దగ్గిరి పాలెంకు పోతున్నాను ఎవరో శ్రీ సత్యసాయి బాబా గురించి కొంత ఆక్షేపణ ధ్వనించే మాటలు పలికారు వెంటనే అవధాని గారు అయ్యా, నేను సత్యసాయి బాబావారి భక్తుణ్ని ఆయనపై ఆక్షేపణ చేయకండి అని అంజలి ఘటించి సహజ వినయంతో కోరారు. ఆబాల వృద్ధం ఆయన సౌజన్యపరిచితులే ధారణా శక్తి గొప్పది. ప్రజాసామాన్యాన్ని వెరగు పడేట్టు చేస్తుంది అవధాని గారు తమ సౌజన్యంతో, ధారణతో, వక్తృత్వ కళతో అందరినీ ఆశ్చర్య చకితులను చేశారు ఇక్బాల్ ఉత్సవాలలో ఆయన ఇక్బాల్పై చేసిన ధారాపాత ప్రసంగానికి ఉర్దూ విద్వాంసులే ముగ్ధులయ్యారు ఆయన తమ మేధను, దృష్టిని మౌలిక పరిశోధనపై మళ్లించి వుంటే ఎంత గొప్ప విషయాలు తెలిసేవో ఆంధ్రావళికి అని నేను అప్పుడప్పుడు అనుకొనే వాడిని సరే ఎవరి దృష్టి వారిది మన దురదృష్టవశాత్తు ఆయన శ్రీ విద్యాసేవా సమితి దసరా ఉత్సవాలలో ప్రసంగించడానికి బొంబాయి వెళ్లారు అక్కడ భారతీయ విద్యాభవన్లో సౌందర్యలహరిపై మూడు ఆంగ్ల ప్రసంగాలు చేశారు ఆయన కొంత కాలంగా మూత్రపిండాల వ్యాధితో బాధపడుతున్నారు బొంబాయిలో జెస్లోక్ ఆస్పత్రిలో మూత్రపిండాల శస్త్ర చికిత్స జరిగింది చికిత్స తర్వాత బాగానే ఉన్నారట; కాని, మంగళవారం తెల్లవారుజామున (21 వ తేదీ) 1-30కు దివంగతులయ్యారు ఆయన భౌతికదేహాన్ని ఆ రాత్రే విమానంలో హైదరాబాదుకు తెచ్చారు పలువురు ప్రముఖులు, విద్యారంగంలోని వారంతా ఆయనకు నివాళు లిచ్చారు గురువారం 23 వ తేదీ మధ్యాహ్నం అంత్యక్రియలు జరిగాయి అవధాని గారి మరణంతో ఆంధ్రావళి సౌజన్య స్వరూపాన్ని, ఉత్తమాచార్యుణ్ని, ఉత్తమ వక్తను, ఉత్తమ ధారణాయుతుని కోల్పోయింది దీపానికి నీడ వున్నట్టే అవధాని గారికీ సాహిత్య రంగంలో నీడలున్నాయంటారు కాని, అవి కాళిదా సన్నట్టు ఏకోహి దోషోగుణ సన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః

- తిరుమల రామచంద్ర




"ఈ ప్రపంచంలోకెల్లా అర్థంకాని పదార్థం అని ఒకటేదన్నా వుంటే – ఖచ్చితంగా అది ఆడదే' ముఖ్యంగా మనదేశంలో ఆడది"

నూతిలో కప్పలు –! డిగ్రీలు చదివినా, పోస్టుగ్రాడ్యుయేషన్లు చేసినా ఆడది ఆడదే'వాళ్ళని మించిన పిరికిగొడ్లు వేరేవి వుండవుగాక వుండవు'

ఎందుకంతగా భయపడుతుంది ఆడపిల్ల?వాళ్ళకి మెదడు, ఆ మెదడులో ఆలోచనలు, అభిప్రాయాలు, వ్యక్తిత్వాలు, అవగాహనలుండవా?? లేకపోతే ఇలా జరుగుతుందా?"

ఇరవైమూడేళ్ళ వయసున్న పురుషోత్తమ్ కంఠంలో ఆవేశం ప్రతిధ్వనించింది.

ముక్కుపుటాలు బిగించి కళ్ళు పెద్దవిచేసి, ఎంతో తీవ్రమైన గొంతుతో అన్నాడతను

సాహిత్యం గురించి ఏదైనా తీవ్రంగా చర్చించేటప్పుడు మాత్రమే అతని మొహం ఆ మార్పులని చూపుతుంది

కాని ఇవాళెందుకో చాలా విచిత్రంగా, అకస్మాత్తుగా అమ్మాయిలు మా సంభాషణలోకి వచ్చేసి, ముఖ్యాంశాలుగా మారిపోయారు

"ఏం జరిగింది పురుషోత్తమ్? ఆడపిల్లలపై నీకెందుకంతకోపం? ఆడవాళ్ళు పిరికివాళ్ళు బహుశా అయితే అయివుండొచ్చుగాని వాళ్ళు చాలా తెలివైనవాళ్ళు నా దృష్టిలో అన్నీ తెలిసినా ఏమీ తెలియనట్లు నటించడంలో దిట్టలు, వాళ్ళ వ్యక్తిత్వాలకి, అభిప్రాయాలకి పరిధులు గీసుకొన్నారు ఆఫ్‌కోర్స్, అనేకమార్లు ఆ పరిమితులతో మూర్ఖత్వంగా వ్యవహరిస్తారు.

ఇప్పుడదంతా ఎందుకుగాని – అసలేం జరిగిందో చెప్పు!" సిగరెట్ వెలిగించుకొంటూ చెప్పాను పురుషోత్తమ్‌తో నేను

ఒక్కక్షణం యిబ్బందిగా కదిలాడు పురుషోత్తమ్ 'మీకు తెలుసుగా? ' నాకు అమ్మాయిలంటే సహజంగానే ఆరాధన వుందని, వాళ్ళనెంతో గౌరవిస్తానని."

నవ్వొచ్చింది నాకు – చాలా సహజం' స్త్రీ అంటే పురుషుడికి, పురుషుడంటే స్త్రీకి పరస్పర గౌరవం (బహుశా ఆదొక రకమైన ప్రేమాకర్షణ అనాలి) వుండటం అత్యంత సహజం!

అటువంటిది ఈ అమ్మాయిలు ఎందుకిలా ప్రవర్తిస్తారో అర్థంకాదు వాళ్ళు వాళ్ళు ఎంత దారుణంగా, పిరికితనంగా, మూర్ఖంగా ప్రవర్తిస్తారు–?" పురుషోత్తమ్ గొంతు ఎంతో ఆవేదనతో వణికింది

* * *

పురుషోత్తమ్ ఇంట్లో కూర్చుని, ఏదో కథతో కుస్తీపడుతున్న ఉదయం ఎనిమిది గంటలవేళ –

ఇంట్లో అతనొక్కడే –

చటుక్కున అతని ఏకాంత నిశ్శబ్దాన్ని భగ్నంచేస్తూ, మంద్రంగా మృదుపాదాల సవ్వడి – ఆ వెనకనే గాజుల చప్పుడు –

"పెద్దమ్మగారూ!" ఓ ఆడపిల్ల గొంతు కుండాల్సిన తియ్యదనం ఆ స్వరంలో

ఆ గొంతుని గుర్తుపట్టాడు పురుషోత్తమ్

ఎదురింట్లో వుండే శోభనాద్రిగారి అమ్మాయి సావిత్రి గొంతు అది' అంతకుముందు చాలాసార్లు తన తల్లితో మాట్లాడటం గమనించే వున్నాడతను

సావిత్రి గది గుమ్మందాటి లోపలికి రాబోయి చప్పున ఆగిపోయింది- ఎదురుగా వున్న, పురుషోత్తమ్‌ని చూస

ఆమె కళ్ళని బెరుకు ఆక్రమించుకొంది. సన్నటి చెమట నుదుటి మీద ప్రత్యక్షమైంది.

చదవడానికి తీసుకెళ్ళిన వారపత్రిక చటుక్కున నేలమీదకి గిరవాటేసి వెనుదిరిగి పారిపోయింది సావిత్రి

క్రిందపడున్న పుస్తకాన్ని, వెళ్ళిపోతున్న సావిత్రిని మార్చి మార్చి చూసాడు పురుషోత్తమ్ అతను నిజంగా నిర్ఘాంతపోయాడు.

సావిత్రికి పదిహేడేళ్ళ వయసు కాలేజిలో డిగ్రి మొదటి సంవత్సరం చదువుతోంది అయినప్పటికి ?!

* * *

ముందుగా ఆ అమ్మాయి వెళ్ళిపోతుంది – తలని రెండు భుజాల మధ్యకి కుదించుకుని

ఎక్కడో వుద్యోగం చేస్తున్నట్టుగా తెలియజేస్తుంది ఆమె అలంకరణ, ఆకారం

గుండ్రని కళ్ళద్దాలజోడు, ఒకచేతిలో టిఫిన్ బాక్స్ –

రోడ్డుమీద తనదారిన తాను నడుచుకుంటూ పోతున్న పురుషోత్తమ్ అప్పుడు చూసాడు ఆ దృశాన్ని.

వేగంగా నడవటంలో ఎలా జరిగిందో పొరబాటు తెలియదుగాని ఆ వుద్యోగిని పర్స్‌జారి రోడ్డుమీద పడిపోయింది. ఆవిడది గమనించకుండా సీరియస్‌గా తలదించుకుని వెళ్ళిపోతోంది

చప్పున పర్స్ అందుకొని ఆవిడ్ని పిల్చాడు పురుషోత్తమ్ "ఏవండీ మాట – జస్టేమినిట్ అంటూ వేగంగా ఆవిడవైపు అడుగులేసాడు

ఆవిడ రారత్తిపోయింది మరింత స్పీడ్ పెంచేసింది నడక ఆవిడ్ని అందుకోలేక నానా యాతన పడ్డాడు పురుషోత్తమ్

చివరి కెలాగైతేనే ఆవిడ్ని చేరి, పర్స్ భద్రంగా అందించాడు

పురుషోత్తమ్ చేసిన సహాయానికి ఆవిడ కనీసం కృతజ్ఞతలు కూడా చెప్పలేదు సరికదా, చిర్నవ్వు అయినా నవ్వలేదు

మౌనంగా తనదారిన తాను వెళ్ళిపోయింది

* * *

సిన్మాహాలు నిండిపోయి వుంది

సిన్మా ప్రారంభం కావటంతో చీకటిగా వుంది హాలంతా

# "మైడియర్ ఇడియెట్!"

ఓ మూలన కూర్చుని సిన్మా చూస్తున్న పురుషోత్తమ్ ఆ చీకట్లో గేట్‌కీపర్ ఓ స్త్రీని అటువైపు తీసుకురావటం చూసాడు

అదిగోండమ్మా – ఆ మూలన ఆయన ప్రక్కన ఓ సీటుంది అక్కడకెళ్ళి కూర్చోండి పురుషోత్తమ్ ప్రక్కనున్న సీటువైపు బ్యాటరిలైటువేసి చూపిస్తూ, ఆ నలభైఏళ్ళ స్త్రీతో చెప్పాడు గేట్‌కీపర్

పురుషోత్తమ్ తలతిప్పి, వాళ్ళని చూసాడు.

'మగాళ్ళ పక్కనా – బాబోయ్! నా ప్రాణంపోయినా కూర్చోను మగాళ్ళ పక్కన నాకు సీటు చూపిస్తావటయ్యా' ఆ నలభైఏళ్ళ స్త్రీ కంఠంలో కోపం, భయం

ఇంకెక్కడా ఖాళీలేదు కదమ్మా!'

అయినా సరే!

చుట్టుప్రక్కలవాళ్ళు తాము డిస్టర్బ్ అయ్యేలా ఆవిడ చేసినందుకు, ఆవిడ్ని విసుక్కుంటున్నారు

ఆవిడదేం పట్టించుకోలేదు నాలుగు నిమిషాలబాటు సర్ది చెప్పాడు గేట్‌కీపర్

అయినా లాభంలేకపోయింది

ఆవిడ పురుషోత్తమ్ ప్రక్కన కూర్చోవటానికి ససేమిరా వీలుకాదన్నది చివరికి నిలబడే సిన్మా చూసిందావిడ.

* * *

ఈ మూడు సంఘటనలు వరుసగా, ఎంతో సహజంగా కళ్ళకు కట్టినట్టుగా చెప్పుకొచ్చాడు పురుషోత్తమ్ – ఎంతయినా రచయిత కదా!

మీరే చెప్పండి గురువుగారూ! ఆవిడ ఎందుకలా భయపడుతుంది. నా చిన్ననాటినుండి నాకు తారసపడిన ప్రతి ఆడది అలాగే ప్రవర్తించింది

నాలో రాక్షసుడున్నాడా? నాకు స్త్రీ అంటే చిన్నచూపుందా? మరెందుకు ప్రతిస్త్రీ. అతను ఆవేశాన్ని నిగ్రహించుకోవటానికి ఓ క్షణం ఆగాడు

"సావిత్రినే తీసుకోండి – ఆ అమ్మాయి మా అమ్మని పెద్దమ్మ అని పిలుస్తుంది అయినా నన్ను నమ్మలేక భయపడి, కనీసం పుస్తకం చేతికివ్వటానికి కూడా జడిసి, నేలమీదకి గిరవాటేసి వెళ్ళిపోయింది

ఎంత నిర్లక్ష్యం – మరెంత ఎరికితనం?

మగవాడితో సమానంగా వుద్యోగాలు చేస్తున్నా మగవాడు చేసిన సాయానికి కృతజ్ఞతలు చెప్పటాన్ని ఏదో చెయ్యరాని పనిగా భావించుకున్న వుద్యోగిని

వయసులో పెద్దదైనా అమెకి నా ఈడు బిడ్డలున్నా, నా ప్రక్కన కూర్చొని, సిన్మా చూడటానికి జడిసిన ఆ నలభైఏళ్ళ ఆవిడ

ఏమిటి వీళ్ళంతా?

మా కాలేజి రోజుల్లో నా క్లాస్‌మేట్ అమ్మాయిలు మూతలు బిగించుకొని, మూగనోము పట్టేవాళ్ళు క్లాసులో సర్దాగా పాలిటిక్స్ లెక్చరర్‌గారు గ్రూప్ డిస్కషన్స్ ఏర్పాటుచేస్తే, నోరు విప్పేవాళ్ళు కాదు

మౌనంగా సందడి చెయ్యని సీతాకోక చిలకల గుంపులా వెళ్ళిపోయేవాళ్ళు అమ్మాయిలు! కార్తీకమాసం తోటకి అంతా సర్దాగా వెళ్తే అందమైన ప్లాస్టిక్ బొమ్మల్లా కూర్చునేవాళ్ళు పొరబాటున కూడా పలకరించేవారు కాదు

తనకేం కావాలో, జీవితంనుంచి తనేం పొందాలనుకుంటుందో ఏమాత్రం ధైర్యంగా చెప్పలేని ఈ అమ్మాయిలంతా రేపు పెళ్ళిళ్ళు అయిన తర్వాత మొగుళ్ళ చెప్పుల క్రింది తేళ్ళగా?!

స్టేజీలెక్కి 'స్త్రీ పురుషుల సమానత్వం' అని స్పీచ్‌లమీద స్పీచ్‌లిచ్చి, బయటకొచ్చేటప్పటికి ఓ మగవాడి ప్రక్కన కూర్చోవటానికి భయపడుతున్నారు

ఆధునిక యుగంలో అబలకాదు సబల' అనేసి వంటరిగా రావటానికి భయపడిపోతారు అంట్లు తోమటమేకాదు అంతరిక్షంలోకి వెళ్ళటం కూడా చేతొచ్చు' అని పెద్ద కబుర్లు చెబుతారు చివరికి ఓ మగవాడితో మామూలుగా మాట్లాడే ధైర్యంలేదు సంఘంలో నలుగురితో కలిసిపోవట మనేదే లేదు

అందుకే అంటున్నా – ఈ ఆడవాళ్ళంతా పిరికిగొడ్లు! అంట్లు తోమటానికి, వంట వండటానికి మాత్రమే తాము పనికొస్తామనుకుంటున్నారు! నూతిలో కప్పలు – వ్యక్తిత్వ వికాసం పొందలేని కప్పలు" ఖచ్చితంగా కప్పలే!!!" పురుషోత్తమ్ మొహం ఎర్రబారిపోయింది – విపరీతమైన కోపం ముంచుకురాగా

అతని పరిస్థితిని, అతనికంత ఆవేదనని, ఆవేశాన్ని కలిగించిన సంఘటనలని నేను అర్థం చేసుకోగలను

ఆడవాళ్ళల్లో ఎక్కువశాతం పురుషోత్తమ్ చెప్పిన దానికంటె ఏ మాత్రం భిన్నంగా ప్రవర్తించరు

ఇదంతా నాకు తెలుసు – అయినా నేనెప్పుడూ ఆలోచించలేదు ఆలోచించిన కొద్దిసార్లు నాకు జవాబు దొరకకపోవటంతో నేను దాని గురించి ఆలోచించలేదు

"పురుషోత్తమ్! నీ అభిప్రాయం నిజమే – కాని పూర్తి నిజంకాదు! మన వూరులాంటి ఓ మాదిరి పట్టణాల్లో [illegible], విజయవాడ, విశాఖ, [illegible] జీవించే ఆడపిల్లలకి [illegible]. సిటీగాల్స్



# ఈ పొదుపు సేకరణ మాసమందు మీ ప్రయోజనానికై వికసిస్తున్న నాలుగు నూతన పొదుపు పథకాలు





మానవాళి అవసరాలకు అనుగుణంగా మలచబడ్డ వైశ్యాబ్యాంక్ పొదుపు పథకాలు

## మనీబ్యాక్ పొదుపు పథకం

ఈ వినూత్న పథకంలో మీ పొదుపు అతిత్వరితంగా వృద్ధిచెందడమేగాక నిర్ణీత కాలంలో రెండు మార్లు కొంత రొఖ్ఖం మీకు తిరిగివ్వబడుతుంది మిగతా మొత్తం నిర్ణీత కాలానంతరం మీకు వడ్డీతో బాటు పూర్తిగా చెల్లింపబడుతుంది

ఈ పథకమునందు మీరు నెలనెలా లేదా ఒకేమారు పెద్ద మొత్తం పొదుపు చెయ్యవచ్చు

ఈ పథకమునందు మీకు వీలైన మొత్తం నెలనెలా 120 నెలలు పొదుపుచేసి మీ పొదుపు మరియూ వడ్డీ యొక్క మొత్తం నుండి, మనీబ్యాక్ పథకం కోరవచ్చు

ఉదా - మీరు నెలకు రూ 100 పొదుపు చెయ్యగోరితే,-

| | |
|---|---|
| మీకు 60 నెలల తరువాత చేతికొచ్చే మొత్తం | రూ 3,000/- |
| 96 నెలల తరువాత చేతికొచ్చే మొత్తం | రూ 3 000/- |
| 120 నెలల తరువాత చేతికొచ్చే మొత్తం | రూ 12,885/- |
| పూర్తి మొత్తం | రూ 18 885/- |

(కాగా, మీరు పొదుపు చేసిన మొత్తం రూ 12,000/- మాత్రమే)

మనీబ్యాక్ పొదుపు పథకం –నెలసరి పొదుపు ఇప్పుడు మరింత ఉపయోగకరం గావించబడింది

## సూపర్ డిపాజిట్ పథకం

నెలనెలా పొదుపు చెయ్యవలసిన కష్టం లేకుండా నిర్ణీత కాలానంతరం మీకు అత్యధికమైన మొత్తాన్ని తిరిగిచ్చే పథకం

మీరెంత తొందరగా పొదుపుప్రారంభిస్తే అంత యెక్కువ పొదుపు మరియు విశేషమైన తిరుగు మొత్తాలు మీరు ఆర్జన ప్రారంభించిన వెంటనే ఈ పథకంలో పొదుపు చేస్తే ఎంతో అనువుగా ఉంటుంది నెలకు రూ 100/- చొప్పున 360 నెలలు పొదుపు చేస్తే మీకు, ఆదారం, భద్రతా అత్యవసరమైన కాలంలో రూ 2,76 974=60 మొత్తం మీ చేతికి అందివస్తుంది ఈ పథకంలో పొదుపు చేసినందుకు మీరెంతో గర్వపడతారు

| నెలసరి పొదుపు మొత్తం రూ | కాలం | మీరు పొదుపు చేసిన మొత్తం రూ | కాలానంతరం మీకు తిరిగొచ్చే మొత్తం రూ |
|---|---|---|---|
| 100=00 | 240 నెలలు | 24 000=00 | 86 217=10 |
| 100=00 | 300 నెలలు | 30 000=00 | 1 56 339=55 |
| 100=00 | 360 నెలలు | 36 000=00 | 2 76 974=60 |

సూపర్ డిపాజిట్ – నెలసరి పొదుపు యొక్క కష్టం తెలియకుండా మీకు విశేషమైన మొత్తాలను తిరిగిచ్చే పథకం

## సంపూర్ణా ఎన్యుట డిపాజిట్ స్కీమ్

ఈ వినూత్న పొదుపు పథకం మీ ఖర్చులకు తగిన యోజన కల్పించడమేగాక, మీరు పొదుపు చేసిన మొత్తంపై మీకు వడ్డీని ఆర్జిస్తుంది

మీకు నెలకి రూ 100 చొప్పున 48 నెలలు అవసరమైతే, మీరు బ్యాంక్‌లో జమచేయవలసిన మొత్తం రూ 3,949/- మాత్రమే

కాగా మీకు నెలకి రూ 100/- చొప్పున 120 నెలలు అవసరమైతే మీరు బ్యాంక్‌లో జమ చేయవలసిన మొత్తం, రూ 7,289=50 పై మాత్రమే

సగటు మనిషి నెలసరి విద్యావసరాల ఖర్చులకో లేదా శేషజీవితపు ఖర్చులకో, అన్ని విధాలా అనువైన పొదుపు పథకం.

సంపూర్ణా ఎన్యుటీ డిపాజిట్ స్కీమ్ – మీ పొదుపు విలువను పొడిగించే పథకం

## సౌభాగ్యనిధి డిపాజిట్ పథకం

డిపాజిటర్లకు పూర్తి స్వాతంత్ర్యాన్ని ఇచ్చే నూతన పథకం ఈ పథకమునందు, మీకు వీలైనంత రొఖ్ఖం, వీలైనప్పుడే జమ చెయ్యవచ్చు మీ పొదుపు మొత్తం, మీరు నిర్ణయించిన కాలానంతరం ఆకర్షణీయమైన వడ్డీతో బాటు తిరిగి ఇవ్వబడుతుంది

మీ సంపదను పెంపొందించుకొనే అవకాశం పూర్తిగా మీదే! మీరు రొఖ్ఖం జమచేసినప్పుడల్లా, ఆ మొత్తం మీ పాస్‌బుక్‌లో నమోదు చెయ్యబడడమే గాక, నిర్ణీతకాలానంతరం మీ చేతికందే మొత్తం కూడ నమోదు చెయ్యబడుతుంది అందువల్ల ఎప్పటికప్పుడు మీరెంత సంపన్నవంతులో మీరే కనుగొంటారు

సౌభాగ్యనిధి – మీ సిరిసంపదలను పెంపొందించుకొనడానికి ముందెన్నడూ లేనంత స్వాతంత్ర్యం

రండి కలిసి అభివృద్ధి సాధిద్దాం.

మా ఏ బ్రాంచిలోనైనా సంప్రదించి,
మీకు సౌభాగ్యతను చేకూర్చే పొదుపు పథకాల వివరాలను కనుగొనండి.

మా పొదుపు అభివృద్ధి పథకంలో పాల్గొనండి. నవంబరు నెలలో మా వద్ద ఖాతా తెరిచి, ఆకర్షణీయమైన బహుమతిని పొందండి.



**ది వైశ్యా బ్యాంక్ లిమిటెడ్**

రిజిష్టర్డ్ ఆఫీస్ ఎవెన్యూ రోడ్, బెంగుళూరు - 560 002
అడ్మినిస్ట్రేటివ్ ఆఫీస్ 72 సెయింట్ మార్క్స్ రోడ్,
బెంగుళూర్ 560 001
ఛైర్మన్ -రమేశ్ గల్లి

KIRON/VBL/86

ఎంతో సోషల్‌గా మూవ్ అవుతారు – అందరూ కాకపోయినా, ఎక్కువ మంది' ఆఫ్‌కోర్స్, ఇక్కడ కూడా వుంటారు కాకపోతే మనకి తారసపడలేదు'

ఆ సంభాషణకి స్వస్తివాక్యం చెప్పేద్దామన్న వుద్దేశ్యంతో అన్నాను నేను.

తల అడ్డంగా ఆడించాడు పురుషోత్తమ్ 'మీరు పూర్తిగా పొరబడుతున్నారు' ఆడపిల్లల మనస్తత్వాలకి మినహాయింపులుండవు ప్రపంచంలో ఎక్కడవున్నా, ఆడది ఒక్కలాగే ప్రవర్తిస్తుంది. మహా అయితే మీరు చెప్పిన నగరాల్లో ఒక్కశాతం కొద్దిగా మాట్లాడుతారేమో?

అసలు ఆడది మగవాడ్ని మామూలుగా పలకరించటానికి ఎందుకు భయపడుతుంది?

తను కలిగించుకొన్న మానసిక భయాలు తప్ప, మరేమి కారణం కాదు. అందుకే – ఐహేట్ దెమ్!"

నేనిక ఆ విషయం గురించి మరో ముక్క కూడా మాట్లాడలేదు నన్ను చాలాకాలం క్రితం, చాలాకాలంబాటు నన్ను వేధించిన ఆ చిక్కు ప్రశ్న మరోమారు నా జీవితంలోకి ప్రవేశించి, మనసుని దొల్చేస్తుంది మగవాడితో ఆడది సహజంగా ఎందుకు ప్రవర్తించలేదు – ఎందుకు??

ఆ రాత్రి చాలాపేటికివరకూ కిటికి దగ్గర కూర్చొని, ముసురు కొంటున్న చీకటిని సూస్తూ ఆలోచించాను

★ ★ ★

రోజులు గడుస్తున్నాయి

ప్రతి సాయంత్రం నేను, పురుషోత్తమ్ కలుసుకొంటునే వున్నాం. ఒకళ్ళ కథలు ఒకళ్ళకి విన్పిస్తూ, మమ్మల్ని మేం మరింతగా మెరుగు పర్చుకోవడానికి ప్రయత్నిస్తున్నాం

చాలా రోజుల తర్వాత ఓ సాయంత్రం –

ఎంతో హుషారుగా వచ్చాడు పురుషోత్తమ్. ఆనందం అతని ముఖాన్ని వెలిగిస్తోంది చేతిలో మడత పెట్టబడి వున్న నాలుగైదు కాగితాలు-

ఆ కాగితాలని చూడగానే అర్ధమయ్యింది నాకు – పురుషోత్తమ్ కొత్తగా ఏదో వ్రాసాడు!

"ఏమిటి – కొత్త కథ పేరు?' అడిగానతడ్ని ఎంతో ఆసక్తితో.

## "మైడియర్ ఇడియెట్!"

వెంటనే జవాబివ్వలేదు మందు చిన్నగా నవ్వు పడ్డాడు ఆ తర్వాత మందహాసంచేసి చెప్పాడు" ఇదేం కథ కాదు!"

'బావుంది పేరు "

'అబ్బే కథ కాదిది' ప్రేమలేఖ – పోస్ట్ చెయ్యబోతున్న ప్రేమలేఖ!"

'ఎంతో ఆశ్చర్యపోయాను "ప్రేమలో పడ్డానని ఎన్నడూ నాతో అనలేదే' ఏమైతేనేం, అందుకోండి నా అభినందనలు

'చాలా చిత్రంగా జరిగిపోయింది' జస్ట్ కొద్ది రోజుల క్రితం జరిగిందా సంఘటన అర్పిత అనే అమ్మాయికి నేనంటే యిష్టం" ప్రేమపేరు తలవగానే చాలా మంది కుర్రాళ్ళ గొంతులో పలికే మత్తు జీరే పురుషోత్తమ్ కంఠంలోనుండి కూడా తొంగి చూసింది

"సామాన్యంగా మగవాడు వెనకబడి ప్రేమిస్తాడు - కాని స్త్రీ తనంతట తాను ముందుకొచ్చి హృదయాన్ని అర్పించిందంటే, యూ ఆర్ ది లక్కీగై!" చెప్పాను నేను

పురుషోత్తమ్ తన ప్రేమకథ చెప్పటం ప్రారంభించాడు

"అర్పితకి నా కథలంటే చాలా యిష్టం! నా కథలు చదివి, నన్ను కలవాలని ఆమె ఎన్నాళ్లనుంచో కోరుకుంటుంది మొన్న నేను మా బంధువుల పెళ్ళికి వెళ్ళినపుడు కలిసింది అర్పిత అద్భుతమైన సౌందర్యం ఆమెది!

నన్నెవరో ఆమెకి రచయితగా పరిచయం చేయగానే అర్పిత కళ్లలో ఆనందం తొణికసలాడింది పెదవులపై చిరునవ్వు పుట్టుకొచ్చింది గొంతులో నుంచి ఉత్సాహం తొంగి చూసింది

"పురుషోత్తమ్‌గారూ! మిమ్మల్ని కలవడం నా అదృష్టం' అన్నది నా కథల్లో జీవితాలని బాగా చిత్రీకరిస్తానట. నా కథల కొస మెరుపులు ఆమెని ఆశ్చర్య చికితురాల్ని చేస్తుంటాయట నా కథల కటింగులన్నీ ఆమె భద్రపరిచిందట నా కథ పత్త పుస్తకం చదవటం కోసం ఏమైనా చేస్తుందట

రచనలు చేయడమనేది ఓ అపూర్వ వరం అన్నది రచయితని కలుసుకోవాలన్న చిరకాలపు కోర్కె తీరినందుకు సంతోషించింది నా ఆటోగ్రాఫ్ తీసుకుంది పెళ్ళి ఫోటోలు తీసిన కెమేరామాన్‌ని బ్రతిమాలుకొని, నాతో కలిసి. ఫోటో తీయించుకొంది

ఆ పెళ్ళి వేడుకల్లో నేనున్న రెండు రోజులు నన్ను అంటిపెట్టుకుని తిరిగింది అర్పిత. మంచినీళ్ళు కావాలంటే మెరుపులా పరుగెత్తి పట్టుకొచ్చేది టిఫిన్, భోజనం అన్నీ వేళకు అమరేలా చేసింది

నేను తక్కువ తింటుంటే, రచయితకి కలంబలంతో బాటు కండబలం కూడా కావాలి అని చనువుగా కసిరి, దగ్గరుండి ఎక్కువ వడ్డించింది

నా చిరునామా అడిగింది ఉత్తరాలు వ్రాస్తే జవాబిస్తారా అని ప్రాధేయపడింది

తమ వూరొస్తే తప్పక యింటికి రమ్మని ఆహ్వానించింది

నాలుగు రోజుల క్రితమే అర్పిత దగ్గర్నుండి వుత్తరమొచ్చింది నేనీ మధ్యకొత్తగా వ్రాసిన కథ నాలాంటివాడు వ్రాయాల్సిన కథ కాదని, ఎప్పటిలాగే నవ్యత్వం వున్న ఇతివృత్తాలని మాత్రమే ఎన్నుకోమని వ్రాసింది నేను 'టాప్ వన్' కావాలని అభినందనలు తెల్పింది ఆ వుత్తరంలో ఎంత అభిమానం? ఎంత ఆప్యాయత ?

వయసులో వున్న ఓ ఆడపిల్ల పూర్తిగా అపరిచితమైన మగవాడితో అంత చనువుగా మాట్లాడి, ఆప్యాయతని పంచిపెట్టిందంటే అది ప్రేమకాక మరేమిటి? ఖచ్చితంగా ప్రేమే! అందుకే ఈ ప్రేమలేఖ!" ఉత్సాహంతో చెప్పాడు పురుషోత్తమ్.

నేనూ నవ్వాను - ఆనందంతో కాదు, నా మిత్రుడు ప్రేమించాడని అసలేకాదు

ఇన్నాళ్లకి నా చిక్కు ప్రశ్నకి నేను జవాబు పొందగలిగినందుకు. మనుషుల మనసూ లోతట్టు పొరల్లోని బలహీనతల్ని అర్ధం చేసుకోగలిగినందుకు.

పురుషోత్తమ్! నువ్వు నన్ను చాలా రోజుల క్రితం ఓ ప్రశ్న అడిగావు గుర్తొచ్చిందా? ఆడది ఓ మగవాడితో ఎందుకు మామూలుగా మాట్లాడలేదూ

మేపురంగులనిచ్చే పసుపు బంగారు యాత్రలకు కారణం ఆయుర్వేద మూలికలే.

# హిమానీ గోల్డ్

## టర్మరిక్ సబ్బు మరియు క్రీమ్.

ఎవరికి తెలియదు చర్మ సౌందర్యాలకు పసుపు ఎంత సహాయ కారిణి అని. కానీ యీ తొందర రోజులలో శనగపిండితో కలిపి ప్రతి దినం ఎవరు వాడతారు... శనగపిండి లేకుండా కేవలం పసుపు మాత్రం కలిసి ఉన్న చర్మ సౌందర్య సాధనాలు ఎలా చర్మాన్ని కాపాడగలవు ?

సంవత్సరాల తరువాత యీ సమస్యకు సమాధానంగా కనిపెట్టారు భారత విఖ్యాత రవీంద్ర పురస్కార విజేత శ్రీ శివకాళీ భట్టాచార్యగారు సౌందర్య సాధనాలలో కలిపేందుకు గాను పసుపుతో సహా తులసి, గోరింట పచ్చి వేళ్ళు, చందనం మరియు పద్మకముతో నవమూలికల గుణములు కలిసినట్లయితే చర్మ సౌందర్యాలకు పసుపు ఇస్తుంది ఒక ప్రత్యేకతను. శనగపిండి లేదే అన్న సమస్య మరి లేదు. సంపూర్ణ బంగారు ఛాయలు అలా నిలుస్తాయి.

ఔను—ఆయుర్వేదపు యీ అమూల్య అన్వేషణా ఫలితం లభిస్తోంది పూర్తిగా హిమానీ గోల్డ్ టర్మరిక్ సబ్బు లేక హిమానీ గోల్డ్ టర్మరిక్ క్రీమ్‌లో సదా. ఇదే భారత దేశంలో ప్రప్రథమం.

ఇప్పుడు మీ చర్మంలో క్రీమ్ మరియు సబ్బుల యొక్క ఆయుర్వేధ గుణం అతి సహజ సౌందర్యాలతో మిళితమై శరీరం బంగారు ఛాయలతో మిరిమిట్లు గొలుపుతోంది.
ఔను—అందరు అందాలను రెప్ప వేయకుండా చూస్తారు.



శాస్త్రాలలో వర్ణించబడిన నవ ఔషధాల శ్రేష్ఠగుణములు :



పసుపు : ముఖానికిస్తుంది అందాల ఆహ్లాదాలను.



గోరింట : రంగురూపాలను అధిక కాంతివంతం చేస్తుంది.



తులసి : చర్మంపైన మరకలను నిర్మూలిస్తుంది.



చందనం : అరిన చర్మాలకు అందాల నిస్తుంది.



పద్మకము: చర్మ రోగాలను నిర్మూలించి జీవాణువులను నాశనం చేస్తుంది.



★కొబ్బరిమాని :చర్మ కోమలత్వాన్నిచ్చి సహజ సౌందర్యాన్నందిస్తుంది.



★వేపమాను: జీవాణువులను నష్టపరచి చర్మరోగాలను నిర్మూలించేందుకు దోహదాన్నిస్తుంది.
★సబ్బులో మాత్రమే.




హిమానీ గోల్డ్ సబ్బు మరియు క్రీమ్

బంగారు సుదినాల సౌందర్యాన్ని తిరిగి తీసుకొస్తోంది

9580A/1TEL

# మూర్ఖుల పాండిత్యం




# ధర్మపథం

చదువుకున్న వారందరూ ఒక్క మాదిరిగా ఉండరు. గొప్ప ప్రతిభావంతులు తమ విద్యను వృద్ధి చేసుకుని, పరిశీలించి కొత్త విషయాలు కనిపెట్టి లోకానికి మహోపకారం చేస్తూ కీర్తి ప్రతిష్ఠలు సంపాదిస్తారు. కొందరు ఉన్న జ్ఞానంతో తృప్తిపడి సాఫీగా జీవనం గడపడమే ధ్యేయంగా భావిస్తారు. మూర్ఖులైన కొందరు విద్య నేర్చుకున్నా, తాము చదువుకున్న దానిని విపరీతంగా అర్థం చేసుకుని అనర్థాలకూ, చిక్కులకూ గురియై, నలుగురిలో నవ్వుల పాలవుతూ ఉంటారు. చదువుకున్న దానిని బాగా అర్థం చేసుకుంటే– మూర్ఖులని అనిపించు కోరు. చిక్కులూ పడరు.

ఒక ఊరిలోని ఇద్దరు మిత్రులు విద్యకోసం దూరదేశం వెళ్ళి సంస్కృతంలో పాండిత్యం సంపాదించారు. వాళ్ళు మూర్ఖులగుట వల్ల అన్నిటికీ, అసలు అర్థాలు గ్రహించక పెడ అర్థాన్నే తీసుకుని చిక్కులపాలయేవారు.

చదువు ముగించాక వారు స్వగ్రామానికి బయలుదేరారు. కొంత దూరం వెళ్ళాక, వారు వెళ్ళే దారి రెండుగా చీలినది. ఏ దారిన వెళ్ళాలో వారికి తెలియక, కొంచెం సేపటికి "మహాజనో యేన గతః స పంథాః" అనే మాట జ్ఞప్తికి తెచ్చుకొని "పెద్దలు నడుచుకొనే పద్ధతినే నడుచుకోవాలి" అనే సరియైన అర్థాన్ని గ్రహించక "పదిమంది నడిచి వెళ్ళేదే దారి" అని తప్పుగా అర్థం చేసుకొని ఒక శవం వెంట పోతున్న జనం వెంట వెళ్ళారు. శ్మశానంతో ఆ దారి నిలిచిపోయింది. అందువల్ల వీరు వెనక్కి వచ్చి రెండో దారిని కొంతదూరం వెళ్ళగా ఒక నది అడ్డువచ్చింది. దాన్ని సులభంగానే దాటవచ్చును. అయినా, ఒక పెద్ద ఆకు కొట్టుకురావడం చూచి, ఆ ఇద్దరిలో ఒకడు "ఆగమిష్యతియత్ పత్రం తదస్మాంస్తారయిష్యతి" (వచ్చే తెప్ప మనల్ని నదిని దాటిస్తుంది) అనే దానిలో పత్రం అనే దాన్ని "ఆకు" అని తప్పుగా అర్థం చేసుకుని, దానిపై కూర్చుండి, మునిగిపోయాడు. తర్వాత మెల్లగా లేచి, ఎలాగో నదిని దాటి ఒడ్డు చేరుకున్నాడు. రెండోవాడు ముందుగానే ఒడ్డు చేరాడు. తర్వాత రాత్రికి వారు ఒక ఊరు చేరుకున్నారు. పండితులని గౌరవించి ఒక గృహస్థు భోజనం పెట్టాడు. భోజనంలో గారెలు వడ్డించారు. వాటికి నడుమ రంధ్రాలుంటాయిగదా! "ఛిద్రేష్వనర్థాః బహులీ భవంతి" అనే సూక్తినిబట్టి "ఛిద్రాలవల్ల– రంధ్రాలవల్ల అనర్థాలు ఎక్కువ అవుతాయి" అని తలచి ఆ మూర్ఖ విద్వాంసులు కమ్మని గారెలను తినడం మానివేశారు. "తప్పులు సంభవించినప్పుడు, వాటివల్ల అనర్థాలు ఎక్కువ కాగలవు" అని ఆ సంస్కృత సూక్తికి గల అసలు అర్థం.

చదువుకొన్నంత మాత్రాన ప్రయోజనం లేదు. దానిని సరిగా అర్థం చేసుకోవాలి. పదాలకు అనేకమైన అర్థాలుంటాయి. సరియైన అర్థం గ్రహించక పోతే చిక్కులు కలుగుతాయి. అట్టివారు నవ్వులపాలవుతారు.

—బులుసు వేంకట రమణయ్య

అని

ఎందుకో తెలుసా - ఇందుకే!

ఓ అమ్మాయి నీ కథలు చదివి, నీ రచనాశక్తి పట్ల గౌరవంతో నీమీద ఆదరం చూపి, కొద్ది గంటలు నవ్వుతూ మాట్లాడినంత మాత్రాన ఆ ఆరాధనని, అభిమానాన్ని - అదంతా ప్రేమ అనుకొనే స్థాయికి దిగజారిపోయావు నువ్వు - రచయితవి అయివుండి

ఇక మామూలు మగాళ్ళ సంగతి చెప్పాలా?

ఆడపిల్ల ఏదో అవసరమై పల్కరించినా, నువ్వేసిన జోక్ కి జోకేసింది తోటి మానవుడేకదాని నవ్వితే, ఆ ఆడదాని మనసులో ఆ బాపతు ఉద్దేశముందని, మనల్ని తెగ ప్రేమించేస్తుందని, అందుకే మాట్లాడిందని, నవ్విందని వక్ర భాష్యాలు చెప్పుకుంటాము

మరి ఆడది మామూలుగా ఎలా మాట్లాడుతుంది?

ఒకటి ఆలోచించు నేస్తం - ఆడపిల్ల బయటికి ఎందుకు రాలేకపోతుంది వాళ్ళు మానసిక వికాసం ఎందుకు పొందలేకపోతున్నారు - ఇవన్నీ బహుశా పెద్ద పెద్ద మాటలు, బోరు కలిగించే వాక్యాలు కావచ్చు.

అనుక్షణం మనలో సలసల మరిగే రక్తం అమ్మాయిల్ని చూస్తే మామూలుగా వుండనివ్వదు కాబట్టి -!

మంచితనం ముసుగేసుకొన్నవాడు సినిమా హాళ్ళల్లో, సిటీ బస్సుల్లో అదే సందని అమ్మాయిల అవయవాల్ని తాకేస్తూ, తడిమేస్తూ సంతృప్తిపడిపోతాడు

నోటి దురద వున్నవాడు 'అ, ఆ' అన్న పెద్ద బోర్డు తగిలించుకొని, కారుకూతలు కూస్తాడు ఇంకొంచెం తెగించినవాడు, మనం పెట్టుకున్న కట్టుబాట్లు లెక్కచెయ్యనివాడు ఆ అమ్మాయి చెయ్యి పట్టుకొంటాడు

ఈ దేశంలో ఆత్మవంచన చేసుకోకుండా నిజాయతీగా నిజం చెప్పగలిగే దమ్ముంటే చాలామంది మగవాళ్ళ దృష్టిలో ఆడదంటే మగవాడి పొందుకోసం సృష్టించబడ్డ ఓ విందు భోజనం!

అందరు మగవాళ్ళు యిలా వుండకపోవచ్చు - కాని ఎక్కువ శాతం మగవాళ్ళు ఆడదాన్ని గురించి ఇలా వూహించుకోవడానికే ఎక్కువగా యిష్టపడ్తారు.

అందుకే ఆడది రిస్క్ తీసుకోవటానికి ఇష్టపడదు. అది పిరికితనంకాదు. ముందు జాగ్రత్త!

ఆడవాళ్ళు నూతిలో కప్పలే - నిజమే! కాని ఆ నూతిలో పడేసింది మనమే" బయటకు రాకుండా అడ్డుపడుతుంది మనమే!!!

వ్యక్తిత్వం వికాసం అని మనం కబుర్లు చెప్పుకుంటే లాభంలేదు బ్రదర్! దానికి వీలైన వాతావరణం సృష్టించాలి.

అప్పుడు ఆడవాళ్ళకి వ్యక్తిత్వాలుంటాయి.

ఈ దేశంలో ఆడపిల్లలు - ఆడపిల్లలే! మగవాడు ఆమె పట్ల తోటి మనిషిగా కాకుండా 'మగవాడి'గానే ప్రవర్తించినంత కాలం ." నేను చెబుతూనే వున్నాను

హఠాత్తుగా పాలిపోయినట్టు పురుషోత్తమ్ ముఖంలో ఏదో మార్పు -

అతని కళ్ళకి హుషారు వీడ్కోలు చెప్పేసింది.

అతని చేతుల్లోని ప్రేమలేఖ నాలుగు కాగితాలయ్యి, ఎనిమిది ముక్కలయ్యి, మరిన్ని చిన్న చిన్న ముక్కలుగా మారిపోయాయి. □

# ఉత్తరాలు

( 7 వ పేజీ తరువాయి)

## సీరియల్స్

17-23 అక్టోబరు 1986 నటి అంబిక ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్రవారపత్రిక చాలా బాగున్నది. సి. విమలా గణేశ్‌గారి సిరియల్ పావని' ప్రారంభమునుంచి చాల బాగున్నది–

ఏపూరి లక్ష్మినారాయణ, శారద, పింజరమడుగు

## ఇ'వేమన' పద్యాలు

17-23 అక్టోబర్ ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ఇ వేమన పద్యాలు చాల బాగున్నవి.

ఎం. వెంకట్రావు, ఛత్రపూర్ (ఒరిస్సా)

## కథలు

"అరుణోదయం" నాకు చాలా బాగా నచ్చింది. అరుణ పాత్ర చాలా బాగుంది. రంగడిలో మార్పుతెచ్చి చదువుకోనందువలన కలిగే నష్టం బాగా తెలియపరిచింది.

శ్రీకంతం కామాక్షమ్మ, నెల్లూరు

★ ★ ★

నటి అంబిక ముఖచిత్రంతో వెలువడిన సంచికలో ప్రచురించిన ఆరుకథలు ఆసక్తిదాయకంగా ఉన్నాయి. "జ్ఞానోదయం" "అరుణోదయం" కథలు మమ్మల్ని మరింత ఆకట్టుకున్నాయి.

బళ్ళారి మహమ్మద్ సలీమ్, గుత్తి

★ ★ ★

నటి అంబిక ముఖచిత్రముతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాలా బాగుంది. "ప్రేమలో నీతి, జ్ఞానోదయము" కథలు బాగున్నాయి.

దోర్నాల సంజీవరెడ్డి, తంగళ్ళపల్లి



ఈ వారం 17-23 అక్టోబరు 86 అందాల తార అంబిక ముఖచిత్రంతో వెలువడిన సంచిక వెరైటీగా ఉంది. ప్రేమలోని నీతి, అడుగుజాడలు, డ్యూటీ ఈజ్‌ది ఫస్ట్ కథలు చాలా బాగున్నాయి.

-సాహుకార భిల్లేశ్వరరావు, నౌపడా

★ ★ ★

మహాత్ముల 'అడుగు జాడల'లో నడవని మనిషి 'చీకట్లోకి' పోతాడనేది 'ప్రేమలోని నీతి' కాదు పెద్దలు చెప్పిన నీతి. ప్రతి మనిషి 'డ్యూటీ ఈజ్ ఫస్ట్' అనే సూత్రాన్ని ఆచరించిననాడు అతనిలో జ్ఞానోదయం' కలిగి, అతడి జీవితంలో అరుణోదయం' భాసిస్తుంది.

ఈ వారం (17-23 అక్టోబరు) ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ఆరుకథలూ బాగున్నాయి.

పక్కలంక రామారావు, మానేపల్లి

★ ★ ★

నటి అంబిక ముఖచిత్రంతో (17-23 అక్టోబర్ 86) వెలువడిన పత్రికలో "ప్రేమలోని నీతి' కథ చాలా బాగుంది. విచిత్ర యదార్థ గాథలు శీర్షికలో "యథార్థంగా మారిన కల్పన" మాకు తెలియని విషయాన్ని తెలియ జేసారు.

రెడ్డి శివనాగేశ్వరరావు, మాచర్ల □

'ఉత్తరాలు' శీర్షికకి
రాసేవారు

తమపేరు, పూర్తి చిరునామా
తెలుగు లిపిలో రాయాలని
మనవి చేస్తున్నాము.

–సంపాదకుడు.



Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Acting Editor: M. Madhava Rao, Chief Editor: S. Radhakrishna.
Phones : Business : 61247, 61248, 75569 Editorial : 75667


సీక్రెట్ ఏజెంట్
విక్రమ్
మోహన్ * దిలీప్‌కదమ్
11


తర్వాత హోటల్‌లో -
రేపు రాత్రికి జైలు లో పలికి వెళ్ల బో తున్నాను.


మిస్టర్ కపూర్! నా వెంట రండి. జనరల్ ఒబెయిద్, పోలీసు ప్రధానాధికారి మీతో మాట్లాడాలంటున్నారు.
రేణూ! నువ్విక్కడే ఉండు.


పోలీసు ప్రధాన కార్యాలయంలో -
చూడండి! నన్ను మీరు వేసగిస్తున్నారు. మళ్ళీ ఏమొచ్చింది?
మిస్టర్ విక్కి! ఇవాళ రాత్రి మిసెస్ వర్మ, ఎక్కడికి వెళ్లారో వివరించగలరా?



ఆ! నేనూ, నా భార్యా కొద్దిసేపటి క్రితంవరకూ మా గదిలోనే ఉన్నాము. దేనికి ఇదంతా?
అంతకుముందు మీరూ, మీ శ్రీమతి హోటల్ ఎవర్‌గ్రీన్‌లో భోజనంచేసారు. పాటలు పాడే రోని మీకక్కడ పరిచయం అయింది.


ఆ! మీ గూండాలు అక్కడే ఉన్నారు. మమ్మల్ని వాళ్ళు చూసారు.
ముందే
పనిపోయింది.
హత్య చెయబడింది.
© RANG REKHA FEATURES PVT. LTD. 1986


హత్య చెయ్యబడిందా? హరి భగవంతుడా! ఎలా జరిగించది?
అది తెలుసుకోటానికే మేము కూడా ప్రయత్నిస్తున్నాము. మీరేం మాట్లాడారు?



ఏముంటుంది. నేను తాగి ఉన్నాను. ఆమె పాటని మెచ్చుకొని ఉంటాను. ఆమె ఎలా హత్య చెయ్యబడింది?
గొంతు పిసికి చంపారు.


చాలా ఘోరం జరిగింది. కాని దానితో నాకేమిటి సంబంధం?
ఆమె హత్యకి కొంచెం ముందు మీరు రోని ఇంట్లోకి వెళ్ళినట్లు తెలిసిందని నేనంటే?


మీరు నన్నా దారిలోకి లాగవద్దు! ఆ హత్యా నేరాన్ని నాపై రుద్దటానికి ప్రయత్నిస్తే మీరు భారత ప్రభుత్వానికి చెందిన ఆ 5 కోట్ల రూపాయలకి నీళ్లొదులుకోవాల్సి ఉంటుంది!
భయపడకు మిస్టర్ విక్కి.
(ఇంకా ఉంది)

